# అమ్మ

(అనువాద నాటికాలు)

శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం-4



సారస్వత నికేతనంకు
ప్రేమతో
విరసం
జనవరి - 2001

కూర్పు

చలసాని ప్రసాద్



విప్లవ రచయితల సంఘం

ఆంధ్రప్రదేశ్

1999

శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం-4

**1. సంపెంగ తోట – 1947**

(Cherry Orchard - by chekhov)

**2. అమ్మా – 1967**

(Mother by Karel Capek)

కాపీరైటు శ్రీరంగంవెంకటరమణ (జూనియర్ శ్రీశ్రీ)
2/1, ఎస్.బి రోడ్డు,
మందవల్లి, మద్రాస్ - 600 028

ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

కూర్పు చలసానిప్రసాద్
విశాఖపట్టణం

టెక్ట్స్ కంపోజింగ్ : ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్,
బాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్-44, ఫోన్ 7660000

కవర్ కంపోజింగ్ లక్ష్మీ డిజిటల్ గ్రాఫిక్స్
హైదరాబాద్

ముద్రణ : చరిత గ్రాఫిక్స్
చిక్కడపల్లి, హైదరాబాద్, ఫోన్ 7607361

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : నవోదయ బుక్ హౌస్,**
**3-3-865, ఆర్య సమాజ్ ఎదురువీధి**
**కాచిగూడ, హైదరాబాద్ - 500 027**
**ఫోన్ : 4652387**

**రూ : 30/-**

# మా మాట

చెపుతూ చూపించేది కథయితే చూపించుతూ చెప్పేది నాటకం శ్రీశ్రీకి నాటకం అంటే ఆసక్తి, అనురక్తి మెండు రేడియో నాటికలు, చతుర్స్రం నాటకం కూడా రాసేశాడు చిన్న నాటిక 'కృష్ణాకృష్ణ' చమక్కున మెరిపించాడు మూడు గోడలతో జెండయ్య గారిగది ముచ్చట తీర్చాడు. ఒక మేరకయినా తన మాట దక్కించుకున్నాడు కాని వాటి విస్తృతీ, వైశాల్యం, లోతు, గాఢత్వం మన మనసుల్లో సుడులు రేపుతూనే వున్నాయి

ఈ సంపుటిలో వున్నవి రెండే రెండు నాటకాలు రష్యాలో సామాజిక పతనాన్ని చిత్రించే చెహూవ్ (1860-1904) నాటకం ఇది అతని చిట్టచివరి రచనల్లో ఒకటి. ఆ ఏడాది (1904) చెహూవ్ కన్ను మూశాడు. జార్ రాజరికం సామ్రాజ్య వాదులతో షరీకయి ప్రజలని పీల్చి పిప్పిచేసింది సమాజంలో మానవ సంబంధాలు అధమావస్థకి చేరుకున్నాయి మేటి కళాకారుడిగా చెహూవ్ తన గళం విప్పాడు.In the Gullyఅనే తన కథలో కూడా బండివాడిపాత్ర చేత Mother Russia is Arising అని ఆశాశంఖం పూరిస్తాడు. ఆ మరుచటి ఏడాదే (1905) రష్యాలో తొలివిప్లవం చెలరేగింది. జారుసైన్యం తుపాకులు పేల్చింది. సామాన్యుల నెత్తురితో నేలంతా చిత్తడి అయింది. అదే Bloody Sundayగా చరిత్రకెక్కింది లెనిన్ సారథ్యంలోని బోల్షివిక్ పార్టీ నిర్మాణమే విప్లవాన్ని విజయవంతం (1917) చేసింది. ఇది చరిత్రసారం చిక్కటి సామాజిక చిత్రణలో, ఉత్తమ సందేశంలో, ఆశలు పురికొల్పడంలో రష్యన్ సాహిత్యం మార్గదర్శి. చెహూవ్ నాటకం దీనికో మేలిరకం ఉదాహరణ.

సంపెంగతోట తెలుగు అనువాదం రాతప్రతి (శ్రీశ్రీ స్వదస్తూరి) మా దగ్గర పదిలంగా వుంది. అయితే సత్యం చెప్పులు తొడుక్కునే లోపల అసత్యం భూప్రదక్షిణం చేసి వస్తుందని అంటారు. ఈ అనువాదం మీద శ్రీరంగం నారాయణబాబుగారు రగడ చేశారు. దీని పూర్వాపరాలు పూర్తిగా తెలియాలంటే అనుబంధంలోని నాలుగు ఉత్తరాలు అందరూ చదవాలి. అవి చదివి సత్యాసత్యాలు ఎవరికి వారే నిర్ణయించుకోవచ్చు.

ఇక రెండో నాటకం అమ్మ విన గానే అందరికి గోర్కీనవల గుర్తు రావడం సహజం విప్లవం విజయవంతం కావలసిన అవసరాన్ని చిత్రించేది గోర్కీ అమ్మ. విప్లవ విజయం తరవాత ప్రపంచశాంతి ఆవశ్యకతని చిత్రించేది కారల్ చాపెక్ (1890-1938) అమ్మ. ఎందుకంటే లెనిన్ అన్నట్టు సామ్రాజ్యవాద మంటేనే యుద్ధం ఇతర పద్ధతుల ద్వారా రాజకీయాలు కొనసాగింపే యుద్ధం. ప్రపంచ శాంతి, దేశదేశాల విప్లవాలు విడదీయరానివి.

ఈ రెండు నాటకాలలోనూ కూడా పాత్రల పేర్లని కూడా తెలుగు చేసేశాడు శ్రీశ్రీ. నిజానికిది సాహసం. సాహిత్య సాహసి శ్రీశ్రీ. అయితే ఇలా Nativise చేయడం ఎంతవరకు సమంజసమో తేల్చవలసింది మాత్రం నాటకాలుచదివిన వాళ్ళూ, చూసిన వాళ్ళూ

విశాఖపట్టణం
31-10-1999

చలసాని ప్రసాద్

# ఈ సంపెంగతోటలో

| | |
|---|---|
| జయశ్రీ | సంపెంగతోట యజమానురాలు |
| అరుణ | ఆవిడ కూతురు. వయస్సు 17 సం॥ |
| తరుణ | ఆవిడ అభిమాన పుత్రిక వయస్సు 24 సం॥ |
| విరించి | జయశ్రీ అన్నగారు |
| శేషశాయి | వ్యాపారస్థుడు |
| అనంతం | ఒక విద్యార్థి |
| లింగమూర్తి | భూస్వామి |
| శివయ్య | గుమాస్తా |
| జానకి . | పనిమనిషి |
| వియ్యన్న . | జీతగాడు |
| రాముడు | బంట్రోతు |

---

**Anton chekhov** రష్యన్ గ్రంథకర్త కథలు, నాటకాలు చాలా రచించాడు. సమకాలిక సాహిత్యాన్ని చాలా ప్రభావితం చేశాడు. మానవుడి ఏకాకితనం, అసహాయత్వం, ఆశావైఫల్యం, క్లేశం, రష్యన్ జీవనంలోని వెనుకబాటు - ఇవి ముఖ్యంగా ఇతని రచనకు వస్తువులయ్యాయి ఇతని రచనలలో ముఖ్యమైనవి. **The Sea Gull (1898), Uncle Vanya (1897), The Three Sisters (1901), The Cherry Orchard (1904),** ఇది చెహోవ్ చిట్టచివరి రచన.

# సంపెంగతోట



రచన

**ఆంటన్ చెహోవ్**

అనుసృజన

**వరద**

**శ్రీ శ్రీ**

# ఇంతవరకు అచ్చయిన శ్రీశ్రీ పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1 | పరిణయ రహస్యం. వి ఆర్ ప్రెస్, విశాఖపట్టణం | 1924 |
| 2 | ప్రభవ కవితాసమితి విశాఖపట్టణం | 1928 |
| 3 | వారం వారం, ప్రతిమాబుక్స్, ఏలూరు | 1946 |
| 4 | సంపెంగతోట, ప్రజాసాహిత్యపరిషత్తు, తెనాలి | 1947 |
| | అనువాదంChekhov Cherry Orchard | |
| 5 | మహాప్రస్థానం నళినీకుమార్, మచిలీపట్నం | 1950 |
| | విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్-విజయవాడ, దాదాపు 20 ముద్రణలు 1952 to | 1984 |
| | శ్రీశ్రీ స్వంతదస్తూరి స్వంతగొంతుక విదేశాంధ్ర ప్రచురణ-లండన్ | 1981 |
| 6 | అమ్మ (కారల్ చాపెక్ Mother నాటకం అనువాదం) | |
| | అరుణరేఖ ప్రచురణలు-నెల్లూరు, సోషలిస్టు పబ్లికేషన్స్-విజయవాడ 1952 | 1967 |
| 7 | మేమే, త్రిలింగ పబ్లిషర్స్-విజయవాడ, | 1954 |
| 8 | మరో ప్రపంచం. రేడియో నాటికలు, సారథి పబ్లికేషన్స్-సికిందరాబాద్ | 1954 |
| | అరుణరేఖ ప్రచురణలు-నెల్లూరు | 1956 |
| 9 | 1+1=1 (అదే పుస్తకం పేరుమార్పు) రేడియో నాటికలు 1964, | 1966 |
| | విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ 1979, 1984, | 1987 |
| 10 | Three Cheers for Man, Abhyudaya Prachuranalu-Madras | 1956 |
| 11 | చరమరాత్రి కథలు, గుప్తాబ్రదర్స్-విశాఖపట్నం | 1957 |
| 12 | మానవుడిపాట్లు (మైఖేల్ షొలఖోవ్, అనువాద నవల) | |
| | విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ | 1958 |
| 13. | Soudamini, Puripanda's Poems translated into English, | |
| | Addepally & Co. - రాజమండ్రి | 1958 |
| 14 | గురజాడ, మనసాహితి-హైదరాబాద్ | 1959 |
| 15 | మూడు యాభయిలు, విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ | 1964 |
| 16 | ఖడ్గసృష్టి, విశాలాంధ్ర ప్రచురణాలయం 1966, | 1984 |
| 17 | వ్యూలు, రివ్యూలు-ఎమ్వీయల్ మినర్వాప్రెస్-మచిలీపట్నం | 1969 |
| 18. | శ్రీశ్రీ సాహిత్యం, 5 సంపుటాలు, షష్టిపూర్తి సన్మానసంఘం-విశాఖపట్నం | |
| | ఎడిటర్ కె వి ఆర్ | 1970 |
| 19 | Sri Sri's Miscellany, English Volumes Editor : K V.R | |
| | షష్టిపూర్తి సన్మానసంఘం, విశాఖపట్నం | 1970 |
| 20 | లెనిన్, (మయకోవిస్కీ కావ్యం అనువాదం) ప్రగతి ప్రచురణ-మాస్కో | 1971 |
| 21 | రెక్క విప్పిన రివల్యూషన్ (Beginning of the end అనువాదం) | |
| | ఉద్యమసాహితి-కరీంనగర్ | 1971 |
| 22. | వ్యాసక్రీడలు, నవోదయ పబ్లిషర్స్-విజయవాడ | 1973 |
| 23. | మరోమూడు యాభయిలు, ఎమెస్కో-సికింద్రాబాద్ | 1974 |
| 24. | చైనాయానం, స్వాతి ప్రచురణలు-విజయవాడ | 1980 |
| 25 | మరోప్రస్థానం-విరసం | 1980 |
| 26 | సిప్రాలి-అమెరికాలో ఫొటోకాపి | 1981 |
| 27 | పాడవోయి భారతీయుడా, శ్రీశ్రీ ప్రచురణలు-మద్రాసు | 1983 |
| 28 | శ్రీశ్రీ వ్యాసాలు-విరసం | 1983 |
| 29 | New Frontiers-విరసం | 1983 |

ఇవేకాక ఎక్కడా అచ్చుకాని శ్రీశ్రీ రాతప్రతులూ, ఉదాహరణకు "బెండయ్యగారిగది", కృష్ణా కృష్ణ నాటకాలు - పత్రికల్లో అచ్చయి, పుస్తకరూపంలో రాని రచనలు చాలా వున్నాయి అన్నీ కలిపి మళ్ళీ వర్గీకరించి శ్రీశ్రీ సంపూర్ణ సాహిత్యం మొత్తం 20 సంపుటాలుగా విరసం ప్రచురిస్తున్నది.

# సంపెంగ తోట

## ఒకటో అంకం

ఒక గది అరుణ గదికి పోవటానికి ఒక గుమ్మం
ఉదయం రంగమధ్యంలో సూర్యోదయం అవుతుంది శీతాకాలం సంపెంగ తోటలో మంచుకురుస్తోంది కిటికీలు మూసివేసి ఉంటాయి లాంతరు పుచ్చుకుని జానకి. పుస్తకం చేత్తో పట్టుకుని శేషశాయి ప్రవేశిస్తారు

శేషశాయి అమ్మయ్య! రైలొచ్చేసింది ఎన్ని గంటలిప్పుడు ?

జానకి అయిదు (చేతిలోని లాంతరు ఆర్పి) అప్పుడె తెల్లారిపోతోంది

శేషశాయి రైలివాళ యెంతో ఆలస్యమయింది (ఆవలించి బద్ధకం తీర్చుకుంటూ) ఎంత బుద్ధి తక్కువపని చేశానూ! వాళ్ళని రైలు దగ్గర కలుసుకుందామని వచ్చినవాణ్ణి యిక్కడ కూర్చుని అట్టె నిద్రపోవడఁవేఁవిటి? కాస్త నువ్వయినా లేపక పోయినావూ?

జానకి నాకేం తెలుసూ. మీరు వెళ్ళారనుకున్నా (వింటూ) అదిగో ఆ వచ్చేది వాళ్ళే కాబోలు

శేషశాయి ఉఁ, ఉహుఁ - సామాన్లూ - చట్టుబండలూ - అదీ యిదీ తెఁవలొద్దూ అప్పుడే యెక్కడొస్తారు? జయశ్రీ ఊరు విడిచి అయిదేళ్ళు కావొచ్చింది. ఎంత మారిపోయి ఉంటుందో ఆవిడ బహుదొడ్డమనిషి చక్కని స్వభావం వెన్నలాంటి మనస్సు. వాళ్ళది ఎంత ఆస్తి! యెంత ఐశ్వర్యం! ఇప్పుడంటే చితికిపోయినారు కాని నా చిన్నప్పుడు - యిప్పటికీ నాకు చాలా జ్ఞాపకం నన్నెంతో గారాబంగా చూసేది. పేదరైతుబిడ్డను మా పూర్వీకులంతా సేద్యం చేసుకుని బతికినవాళ్ళే నే నీ నాటికి మోతుబరినై సేలంపంచా సిలుకు చొక్కా వేసుకు తిరిగితె మాత్రం? ఎంత డబ్బున్నా యిప్పుడూ, యెప్పుడూ నేనో రైతుబిడ్డనే (పుస్తకం తిరగేస్తూ) ఈ పుస్తకానికి తలా తోకా కనపడలేదు అలా చదువుతూనే నిద్దరొయాను

జానకి ఇంట్లో పెంపుడు కుక్కలు కూడా రాత్రల్లా అరుస్తూనే ఉన్నయి వాటికి తెలుసు కాబోలు అమ్మగా రొస్తున్నారని.

శేషశాయి అదేం జానకీ అలా వున్నావేఁవిటి?

జానకి చేతులు వొణుకుతున్నయి పడిపోతానేమో అని భయంగా వుంది.

శేషశాయి ఆ వేషం! అలంకారాలు! నీకు చనువిచ్చి పాడుచేశారు. అది కాదు ఎవరి హద్దులో వాళ్ళుండాలి

(శివయ్య ప్రవేశం పూలతట్టతో)

శివయ్య : జానకీ! ఈ పూలు తోట్లోవి. అమ్మగారొచ్చాక యిమ్మన్నాడు తోటమాలి లోపలికి తీసుకెళ్లు

శేషశాయి . నాకు కాస్త దాహానికి మజ్జిగ

జానకి తెస్తున్నా. (లోపలికి వెళుతుంది)



శివయ్య ఇవాళ ఉక్కజాస్తిగా ఉంది పువ్వులు విరియబూచినా ఈ వేడికి వసివాడుతయేమో అనిపిస్తుంది ఏఁవిటో కాలమాన వేఁవీ బాగులేదు చూడండీ శేషశాయిగారూ! నా కెంత ఆవస్థ వచ్చిందో మొన్న కొన్న కిర్రు చెప్పుల కాట్లకి కాళ్ళన్నీ పచ్చిపుళ్ళవుతున్నయి తైలమర్దనం అవసరమంటారా, కాదంటారా?

శేషశాయి ఊరుకోవయ్యా శివయ్యా! ఆ వాగుడు కట్టిపెడుదూ బాబూ!

శివయ్య నా జాతకం యేఁవిటొగాని రోజూ నా నెత్తిమీద ఒక కొత్త పిడుగు పడుతూనే ఉంటుంది అన్నిటికీ ఓర్చుకోవటం అలవాటయింది

(జానకి ప్రవేశించి శేషశాయికి మజ్జిగగిన్నె అందిస్తుంది)

శివయ్య ఇహ నే వెడుతున్నా (అంటూ నడచి కుర్చీని డీకొని పడిపోతాడు) ఇదీవరస ఇలాంటివి మనకి రోజూ యిరవై అపశకునాలు నా కర్మం

(వెళ్ళిపోతాడు)

జానకి శివయ్య నన్ను పెళ్ళి చేసుకుంటా నంటున్నాడు.

శేషశాయి చిత్రం ! నిజంగానే?

జానకి ఏఁవో? నిజంగా అన్నాడో, హాస్యానికన్న మాటలో ఇతగాడి ధోరణంతా అదోమాదిరి ఏఁవిటో మాట్లాడేస్తూంటాడు ఏఁవీ అర్థంకాదు నా మీద వెర్రి అభిమానం వొట్టి సత్యకాలప్మనిషి ఇతనంటే నాకూ యిష్టవే కాని . వొట్టి దురదృష్టవంతుడు ప్రతి నిత్యం యేదో ఒక ఆపద తెచ్చుకుంటాడు శకునపక్షి అని అందరూ వెక్కిరిస్తారు

శేషశాయి (విన్నట్టు అభినయిస్తూ) అలికిడవుతోంది వాళ్ళొస్తున్నారనుకుంటాను

జానకి వాళ్ళే వాళ్ళే! ఏఁవిటిచెప్మా నా కిలా వుంది వొళ్ళల్లా చల్లబడి పోతోంది

శేషశాయి ఈ మాటు నిజంగా వాళ్ళే .. ఎదురు వెళ్ళి కలుసుకుందాం పద జయశ్రీగారు నన్ను పోల్చిపట్టగలుగుతారా? అయిదేళ్ళు కావచ్చింది ఆవిడ నన్ను చూసి

జానకి (తత్తరపాటుతో) నిలబడలేకుండా వున్నాను నా గుండె లెలా కొట్టుకుంటున్నాయో!

(వీధి గుమ్మందగ్గర బండ్లు ఆగిన చప్పుడు శేషశాయి, జానకి దూకుడుగా వెళ్ళిపోతారు రంగస్థలం నిర్మానుష్యంగా ఉంటుంది పక్కగదుల్లో నుంచి చప్పుడు వినిపిస్తుంది జయశ్రీని చూదామని వచ్చిన వియ్యన్న తత్తరపాటుతో కర్రూత పుచ్చుగుని రంగస్థలానికి అడ్డంగా నడచిపోతాడు ఏదో గొణుక్కుంటూ ఉంటాడు మనకేఁవీ స్పష్టంగా వినిపించదు నేపథ్యాన కలకలం యెక్కువవుతుంది ఒక కంఠస్వరం 'రండి! యిలా పోదాం" జయశ్రీ, అరుణ, తరుణ, విరించీ, లింగమూర్తి, శేషశాయి, జానకి ప్రవేశిస్తారు సామాన్లు ఒక టాకటే పనిమనుషులు తెచ్చి లోపల పెడుతుంటారు )

అరుణ . ఇలారండి. ఈ గదిలోకి రండి అమ్మా, ఈ గదేదో నీకు తెలుసునా?

జయశ్రీ (కన్నీళ్ళతో) పురుళ్ళ గది

తరుణ . ఎంత ఉక్కగా వుంది! ఎండలు ముదురుతున్నయి (జయశ్రీతో) నీ పడగ్గదీ, నగలగదీ ఇప్పటికీ అలాగే ఉన్నాయమ్మా.

జయశ్రీ . నేను పుట్టినగది. నా చిన్నతనఁవంతా యీ గదిలోనే గడిచింది మళ్ళీ యిక్కడికే

వచ్చాను పసిపిల్లలా తరుణ ఎప్పటిలాగే ఋషికన్యలా వుంది ఏం జానకమ్మా క్షేమంగా?

విరించి — రైలు రెండుగంట లాలస్యంవయింది ఇలా చేసుకుంటారా ఎవరైనా?

(అందరూ లోపలికి వెళిపోతారు - జానకి, అరుణ తప్ప)

జానకి — మీరొస్తారని యెన్నాళ్ళనుంచో యెదురుచూస్తున్నాము

అరుణ — ప్రయాణంలో రెండు రాత్రులూ నిద్రలేదు నిక్కాక చేసిపోయింది

జానకి — వెర్రి తల్లీ నువ్వు లేకపోవటం ఇల్లు ఇల్లులా లేదు ఇంటిమాట చెప్పకుగాని నా ఘోష వినేందుకు యెవరూ లేకపోయారు

అరుణ — ఏం సంగతీ?

జానకి — శివయ్య నన్ను పెళ్ళిచేసుకుంటానన్నాడు

అరుణ — నువ్వట్టి పిచ్చిదానివి ఎప్పుడూ అలా కలలుకంటూ ఉంటావు (తల తడువుకుంటూ) నా పిన్నులన్నీ పోయాయమ్మా

జానకి — ఆయనకి నామీద యెంత ప్రేమ!

అరుణ — నా స్వంత గది! కిటికీల కళ్ళతో నన్నే చూస్తోంది ఈ గది ఎప్పుడూ విడిచినట్లేలేదు ఎలా అయితేనేం యింట్లో పడ్డాను నిద్రలేవగానే తోటలోకి పరిగెడతాను నిద్ర పడుతుందా? ప్రయాణంవంతా కంటికి కునుకు లేదు ఏంవిటో ఆదుర్దా ఏదో గుండె బెదురు

జానకి — మొన్ననే అనంతంగా రొచ్చారు.

అరుణ — (పట్టలేనంత సంతోషంతో) అనంతం!

జానకి — సామాన్ల గదిలో పడుకున్నారు. మీ కెవరికీ యిబ్బంది కలగకూడదని (కిటికీ వొంక చూస్తూ) నేను లేపాలనే అనుకున్నా. కాని తరుణ లేపొద్దని ఒకటేపోరు

తరుణ — జానకీ! జానకీ! లేచి కాస్త కాఫీ పెడుదూ అమ్మ కావాలంటోంది.

జానకి — ఇక్కడున్నట్టు

(వెళిపోతూంది)

తరుణ — దేవుడిదయవల్ల మీరంతా దేశానికొచ్చేశారు ఇంతకూ చక్కని తల్లీ! నువ్వొచ్చేశావు నా కళ్ళు చల్లబడ్డాయి ఎన్నాళ్ళయింది! ఎన్నాళ్ళయింది!

అరుణ — మేం సిమ్లా చేరుకోవటం చలికాలంలో. అందులోకి విపరీతంవయిన చలి వెళ్ళిన నాలుగురోజులకే వచ్చీరాని హిందీ మాట్లాడటం మొదలు పెట్టాను. అమ్మ ఓ మూడంతస్తుల మేడలో ఉండేది. ఆ మేడలో కాపురంవున్న వాళ్ళంతా ఉత్తరాదివాళ్ళే ఒక్క అమ్మ తప్ప అమ్మని చూసేనరికల్లా నా కెంతో జాలేసింది. కన్నీళ్ళాపుకోలేకపోయాను అమ్మ కూడా నన్ను కావలించుకుని ఏడ్చింది

తరుణ — ఆ సంగతి తలచుకుంటే నాకు దుఃఖం పొర్లిపొర్లి వస్తుంది. ఆ సంగతెత్తకు

అరుణ — పెద్ద పెద్ద ఉద్యోగాలు చేసుకునే మొగాళ్ళకే కళ్లు తిరిగిపోతయి. సిమ్లా కాపరంవంటే ... అమ్మ బంగారంవంతా అమ్మేసింది నా సంగతి నీకు తెలుసు కదా! కట్టుబట్టతో

వచ్చాను. ఎల్లాగో కష్టపడి మేఁఎక్కడ చేరుకోవటం ఓ పెద్ద బ్రహ్మాండఁవయి పోయింది అమ్మది బారి చెయ్యి కాఫీ, రొట్టె ముక్కలూ దొరలు తింటాడు చూశావ్ అందులోంచి తెప్పించేది ఏఁవీ అడక్కు ఎలా ఉండాలో అలా ఉంది అన్నట్టు ఆ తనఖా రూపాయలు చెల్లించావా?

తరుణ · చెల్లించటానికి డబ్బేది? ఎలా వస్తుందనుకున్నావు?

అరుణ కొంపల మీదికి తెచ్చావు. యేం సాధన?

తరుణ జ్యేష్టమాసంలో వేలాం తప్పదు

(శేషశాయి ద్వారంలోంచి పైకి చూసి సకిలిస్తాడు)

తరుణ ఆయనకొచ్చిన రోగం అది ఏం చేస్తాం?

అరుణ (తరుణను అనురాగంతో కావలించుకుని) అక్కయ్యా! ఆయన నిన్ను చేసుకుంటానన్నాడు కదా ఏం తేలింది ఆ సంగతి? (తరుణ తలాడిస్తుంది) నీ మీద అతగాడికి ప్రేమట చక్కా యిద్దరూ ఓ మాటకొచ్చి శుభస్యశీఘ్రం అని ఎందుకా మూడు ముళ్లూ వేగం పడనివ్వరు?

తరుణ ఏఁవిటో ఆయన ప్రేమ నాకేం అర్థం కాలేదు ఎల్లప్పుడూ వ్యాపారం రూపాయలూ తప్ప మంచీ చెడ్డా యేం లేదు వెయ్యికాళ్ళ జెర్రి ముచ్చటగా నాతో మూడు మాటలాడడానిక్కూడా తీరికలేదు ఊరందరూ వూసులాడుకోవడం మాత్రం నిజం మేఁవిద్దరం పెళ్లి చేసుకుంటాఁవని. అంతమందీ నన్నడగడఁవే ఆయన చూస్తే అలాగవ! నాకేం పాలు పోకుండా ఉంది ఆయన మాటలన్నీ నీటిలో మూటలు (అరుణ భుజంపక్క చూస్తూ) యేఁవిటది? పవిటపిన్ను కొత్తదిలా ఉందే! చక్కాతుమ్మెదలా యెంత బావుంది!

అరుణ (విచారంగా) ఢిల్లీలో అమ్మకొన్నది (తన గదిలోకిపోయి అమాయక స్వరంతో) ఓ మారు మేము విమానం యెక్కాం ఎంత బావుందనుకున్నావు?

తరుణ మా చిట్టితల్లి హాయిగా యింటికొచ్చిందమ్మా! ఇల్లంతా నిండుగా ఉంది అదే చాలు (జానకి కాఫీ తెచ్చి చల్లారపోస్తుంటుంది)

తరుణ (గది తలుపు నానుకుని) నువ్వులేక యిల్లంతా చిన్నపోయింది రోజంతా నీమీదె నా ధ్యాస! పనిచేసుకుంటున్నంతసేపూ మనసల్లా నీ మీదే యేదో నిన్నింత కలిగినవాళ్ళింట్లో పడెయ్యగలిగామా మా అందరి ప్రాణం కుదుట బడుతుంది నా మాటకేం? ఏ కాశికో, రామేశ్వరమో పోతాను తీర్థయాత్రలు చేసుకుంటూయీ మిగిలినరోజులు వాడి సేవలో గడిపేద్దాఁవని ఉంది ఏఁవౌకదా మన సుకృతం!

అరుణ తోటలో కొయిల హాయిగా కూస్తోంది! టయిమెంత?

తరుణ అరుదగ్గిర కాస్త పడుకుని బడలిక తీర్చుకో!

అరుణ (కలతగా) నాన్నగారుపోయి ఆర్నెల్లయింది ఆయన పోవడఁవేఁవిటి నెల తిరక్కుండా తమ్ముడన్నా తమ్ముడు కాడు చక్కనిచుక్క యేటిలోపడి బలవంతపు చావు చచ్చిపోయాడు అమ్మకు గుండె చెరువైపోయి యివన్నీ మరిచిపోవాలని సిమ్లా ప్రయాణఁవయింది (జలదరించి) అమ్మకి తెలియదుగాని నేనంతా గ్రహించగలిగాను

అసలింతం తమ్ముడికి చదువు చెప్పాను అసలాళ్ళు వాళ్ళ అమ్మకి ఇప్పుడు జ్ఞాపకం రాకమానదు

(వియ్యన్న ప్రవేశిస్తాడు)

వియ్యన్న అమ్మగారు కాఫీకొస్తున్నారు. తయారైందా? (జానకితో. ఏంచూసావు మందిపారాన్న)

జానకి అయ్యో నామతి మండిపోనూ -

(గబగబా వెళ్ళిపోతుంది)

వియ్యన్న అమ్మగారు వొచ్చిందాకా బతికున్నానమ్మా. ఎదే పదేలు కళ్ళు సల్లగా మూలన్నపిలాగ కనిపిస్తాది. ఇక నాను సచ్చినా బాదలేదు

(జయశ్రీ విరించి ప్రవేశిస్తారు)

జయశ్రీ ఆసు వేసికొస్తే ఆటయిపోయుండును

విరించి లాచంలేదు చెర్లీ! మణిలా యింకావుంది. దానికేం గాని మనం చిన్నతనంలో యీ గదిలోనే ఆడుకునేవాళ్ళం. ఇప్పుడు నాకు యాభయ్యోపడి దాటింది

శేషశాయి కాలానికి రెక్కలున్నాయి

విరించి ఏంపని సెలవిస్తున్నారు?

శేషశాయి కాలం. చూశారూ! ఇట్టే ఎగిరిపోతుంది

అరుణ అమ్మా నిద్దరొస్తున్నది నేను వెళ్ళిపడుకుంటానె

జయశ్రీ చిట్టితల్లీ! ఇల్లు జూసి ఎన్నాళ్ళయింది. నా కళ్ళని నేనె నమ్మలేకుండా ఉన్నాను

అరుణ మాంవయ్యా! నే వెడుతున్నా

విరించి చిన్నమ్మ బొత్తిగా డీలా అయిపోయింది

లింగమూర్తి రైలు ప్రయాణంవంటే మాటలా

తరుణ ఇహ మనం యెవరిమానాన వాళ్ళం కదిలితే బాగుంటుంది

జయశ్రీ (నవ్వుతూ) నువ్వెప్పుడూ ఒక్కలాగే ఉన్నావు (తల నిమురుతూ) ఓ చుక్క కాఫీ గొంతులో పోసుకుని మరీ కదులుదాం (వియ్యన్న జయశ్రీకి అనుకోటానికి దిండు వేస్తాడు) వియ్యన్నకున్న జాగర్త మరొహరికిలెదు ఈ కాఫీ అలవాటుతో చచ్చిపోతున్నాను.

తరుణ సామాన్లన్నీ సరిగా చేరాయో లేవో చూసి వస్తాను

జయశ్రీ నిజంగా ఇంటికొచ్చేశాంవా? (నవ్వుతుంది) సంతోషం పట్టలేకుండా ఉన్నాను రెప్పవాలిస్తే నిద్రపట్టేట్టుంది మా వూరనేసరికి ప్రాణంలేచొస్తొంది రైలు కిటికీలోంచి వెలపలికి చూళ్ళేకపోయాను కళ్ళంబడి నీళ్ళు జడివానలా కురిశాయి ఏదీ కాస్త కాఫీ (వియ్యన్న కాఫీ అందిస్తాడు) ముసలితనం వచ్చినా యింకా బతికున్నావు మా యింటినే కనిపెట్టుకుని ఉన్నావు

వియ్యన్న మూడు రోజులయింది

విరించి వియ్యన్నకు కొంచెం చెవుడు

శేషశాయి మళ్ళీ నేను పాసెంజరులో విశాఖపట్నం పోవాలి వెధవ చిక్కులు! ఒక్కమారు

మిమ్మల్ని చూసి మాట్లాడి పోవాలని వచ్చాను అప్పటికీ యిప్పటికీ మీరు లక్ష్మీదేవిలా ఉన్నారు

లింగమూర్తి రోజురోజుకీ చేవదేరుతోంది ఆవిడ అందం. కాని ఆ కంచి చీర చూడండీ ఎంత మజాగా కట్టారో. కళ్ళు జిగాల్మంటున్నాయి.

శేషశాయి మీ అమ్మగారు నన్నెప్పుడూ తూలనాడడంవే ఓ పని కింద పెట్టుకున్నట్టుంది నాకు డబ్బువాహం జాస్తి అనీ, కులం తక్కువనీ యేవేవో అంటారు నేను లెక్కచేసేవాణ్ణి కాదనుకోండి - ఆయన మాటలు విని మీరు నన్ను చులకనగా చూడకుండా ఉంటే చాల్లెండి. ఇదివరకులాగే ఇప్పుడూ మీరు నన్ను అభిమానంతో కటాక్షిస్తే చాలు మనుషులకి తెలియకపోతే భగవంతుడికైనా తెలియదా? మా తండ్రి తాతలంతా మీ అండనే బతికారు. మిమ్మల్ని సాక్షాత్తూ ఆ పార్వతీదేవిగా భావిస్తాను

జయశ్రీ . ఒకచోట కూర్చోలేకుండా ఉన్నాను (కుర్చీలోనుంచి తటాలున లేచి, ఆవేశంతో అటూ ఇటూ పచార్లు చేస్తుంది) ఏదో పట్టరాని సంతోషం నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. నా వెకిలి చేష్టలు చూసి అంతా నవ్వవచ్చు . నా వాలకం బాగులేదని నాకు తెలుసు. అదుగో నా బీరువా (చేత్తో బీరువాను మెల్లిగా నిమురుతుంది) అవిగో నా అందాల చెప్పులు!

విరించి అమ్మన్నగారు - పురుళ్లు పోస్తూండేది - ఈ మధ్యనే చచ్చిపోయారు నీకు తెలుసా?

జయశ్రీ (కుర్చీలో కూర్చొని కాఫీ తాగుతుంది) నువ్వు రాశావుకాదూ నా పేర! పాపం! చచ్చి ఏ స్వర్గాన ఉందో!

లింగమూర్తి. మా పిల్ల సీత మీకు నమస్కారాలు చెప్పమంది.

శేషశాయి . మీరందరూ వింటే ఓ ముఖ్యమైన సంగతి చెప్పాలని ఉంది నేను వెళిపోవాలి ఆట్టే వ్యవధికూడా లేదు. రెండు మూడు ముక్కల్లో చెప్పేస్తాను వినండి మరి, జయశ్రీగారు! మీ ఋణాలు తెగతెంపులు కావాలంటే మీ సంపెంగతోట వేలం అయిపోక తప్పదు జ్యేష్ట బహుళ దశమినాటికి వాయిదా. అయితే మీరేంవీ బెంగ పెట్టుకొనక్కర్లేదు ఓ చిన్న సలహా వింటే మీ ఆస్తికేంవీ ముప్పురాదు మనవిచెయ్యమంటే చేస్తాను అంతా శ్రద్ధగా వినండి.. విశాఖపట్నంమీద బాంబులు పడ్డదగ్గర్నుంచి జనం మన ఊళ్ళంట తండోపతండాలుగా వస్తున్నారు ఇక్కడికి విశాఖపట్నం నలభైమైళ్ళ చిల్లర మన వూరా ఆట్టే పల్లెటూరుకాదు పట్నవాసం కాదు. చల్లటి యేటినీరు జీవనది రైళ్ళు అస్తమానం తిరుగుతూనే ఉంటాయి విన్నారా? అంచాత నేను చెప్పిన ప్రకారం చెయ్యండి. మరేం లేదు. మీ సంపెంగతోట కొట్టించేసి రెండు మూడు చక్కటి బంగళాలు కట్టిస్తే యేడాదికి ఒక్కొక్క బంగళాకి కనీసం అయిదు వందలయినా వేసుకుంటే మొత్తం పదిహేను వందలైనా ఆదాయం లభ్యమవుతుంది నేను చెప్ప దలచుకున్నముక్కేదో చెప్పేశాను. ఇక మీ ఇష్టం.

విరించి లెక్కలకేం వెధవలెక్కలు. కట్టి పెడుదురూ మీ ఊకదంపు కబుర్లు.

జయశ్రీ నాకేంవిటో తలాతోకా అందకుండా ఉంది అసలు మీరనే మాటేంవిటి?

శేషశాయి నే ననేది మరేం కాదమ్మా! మీకు ఋణబాధ తప్పి పోవడమే కాకుండా పెలీనా రెండు వేలు చులాగ్గా కళ్ళ చూడగలరు తమరు ఊఁ అన్నారంటే ఇవాళ పని ప్రారంభించవచ్చును వచ్చే పున్నమనాటికి ఒక్క గజం మేరయినా లేకుండా యిళ్ళు లేస్తాయి మరి రెండో ఆలోచన వద్దు మీ కష్టాలన్నీ తీరినట్టే అనుకోవచ్చు ఏటి ఒడ్డున ఉండడం అన్ని యిమ్ములూ కలిసొచ్చిన జాగా కావడం ఎటొచ్చీ ఈ పాడుబడ్డ యిళ్ళన్నీ విప్పించెయ్యాలి ఈ ఘనంతికూడా పోవాలి ముఖ్యంగా సంపెంగతోట మాత్రం కొట్టించెయ్యక తప్పదు

జయశ్రీ నందనవనంలాంటి తోట కొట్టించెయ్యడమే! అయ్యో! తమరు చాలా అసంగతంగా మాట్లాడుతున్నారు ఈ దేశానికంతా అలంకారం యీ తోట ఒక్కటేనని ఎన్ని వేలమంది చెప్పుకుంటున్నారు కాదు?

శేషశాయి తోటలోకల్లా పెద్దదని తప్ప వేరే విశేషమేమీ నాక్కనిపించడం లేదు రోజూ బండెడు పూలు పూస్తుంది. నిజమే అమ్మకమా? ఆదాయమా? ఏముంది?

విరించి గవర్నరయ్యేది, మహారాజయ్యేది! ఎంత పెద్దవాడొచ్చినా ఈతోటని చూడకుండా పోలేడు

శేషశాయి ఈ క్షణమే మీరేదో ఒక నిర్ణయానికి గనక రాకపోతే, వచ్చే జ్యేష్ఠమాసంలో తోటే అన్నమాటేమిటి, మీ యావదాస్తి వేలంకాక తప్పదు. ఏదో తేల్చుకోండి ఇది తప్ప ఇంకో మార్గంలేదని ముమ్మాటికీ నమ్మండి

వియ్యన్న నా పిన్నతనంలో యీ పువ్వులంటే యేం యిద్ధారంగా ఉండేది! అత్తర్లేటీ, అగరునూనెలేటి, అమ్మోరికలంకారాలేటీ అంతా యిరగబడి కొనుక్కెళ్ళేవోరు, మరేం వొచ్చి .

విరించి · ఊరుకోరా వియ్యన్నా

లింగమూర్తి సిమ్లాలో చలి జాస్తీకాబోలు

జయశ్రీ తాగేనీళ్ళుకూడా గడ్డకట్టుకుపోతాయి.

లింగమూర్తి ఏమాశ్చర్యం!

శేషశాయి అదీగాక ప్రజల్లో పట్నాలమీద మోజు తగ్గిపోయింది ఏ మాత్రం తీరికున్నా ఇలాంటి చక్కని ప్రదేశంలో ఓ చిన్న యిల్లు చూసుకుని కాలక్షేపం చెయ్యడం అలవాటయింది మీ తోటలో అన్నిదిక్కులా యిళ్ళులేచి నానాదేశాలనుంచీ జనం వస్తూంటే ఎంత కలకలలాడుతూంటుంది?

విరించి చాల్చాలు! ఏమిటీ ఘోష?

తరుణ . (ప్రవేశించి) అమ్మా! నీకు రెండు టెలిగ్రాములు వచ్చాయి (చప్పుడుతో బీరువా తెరిచి) ఇవిగో!

(చింపిచూసి) సిమ్లానుంచే (టెలిగ్రాములు చదవకుండానే చింపేస్తూ) సిమ్లాకీ నాకూ రుణం తీరిపోయింది.

విరించి . అమ్మాయీ! ఈ బీరువా యెన్నాళ్ళనాటిదో తెలుసూ? అరవయ్యేళ్ళ కిందటిది. ఇదే

మనిషయితే షష్టిపూర్తి చెయ్యొచ్చు దీనికి ప్రాణం లేదనే కట్టుకొండి అయినా యిందులో మహామహులు రాసిన పుస్తకాలు యిమిడిఉన్నాయి.

లింగమూర్తి ఆరవయ్యేళ్ళే! ఏంవాశ్చర్యం!

విరించి సరస్వతీపీఠం! మా పుస్తకాలబీరువా! ఓ మహత్తర గ్రంధ భాండారమా! నీవు యెన్నెన్ని ఉన్నతాశయోపేతములయిన పవిత్రభావాలను వెదజల్లి మాలో విజ్ఞానాన్నీ ధర్మాన్నీ విస్తరిల్లజేశావో! ఈ అరవైయేళ్ళలో నీ మౌనసందేశం యెంత మందికి ఋజుమార్గం చూపించే జ్ఞానతర్జనిగా పని చేసిందో! మానవజగత్తుకి మహిమాన్విత భవిష్యత్తును ప్రసాదించగల వినూతన విజ్ఞానాన్నిచ్చి తరతరాలవారికి సముజ్వల సాంఘిక చైతన్యాన్నిచ్చి రగుల్కొల్ప జేసిందో! (ఊరుకుంటాడు)

శేషసాయి నిజమే

జయశ్రీ ఎప్పుడూ ఒక్కలాగున్నా వన్నయ్యా!

విరించి (కాస్త పరిభ్రమించి) సెబాస్! రండి తురుపుకొట్టండి.

శేషశాయి (గడియారంవైపు చూసి) వేళయింది. ఇక నేను వెళ్ళాలి

వియ్యన్న అమ్మగోరు మందు తీసుకోడానికి వేళయింది (మందుచేతి కందిస్తాడు )

లింగమూర్తి ఎందుకమ్మా! ఈ దిక్కుమాలిన మందులన్నీ. వీటివల్ల ప్రయోజనం లేదు ఇవి మంచీ చెయ్యలేవు చెరుపూ చెయ్యలేవు ఇలా యివ్వండి చెపుతాను (అంటూ మాత్రల డబ్బా తీసుకుని మాత్రలన్నీ అరచేతిలో వేసుకొని నోట్లో వేసుకొని ఇన్ని నీళ్ళు తాగుతాడు)

జయశ్రీ (గాభరాతో) నీకేం మతిపోయిందా యేమిటి?

లింగమూర్తి అన్నిమాత్రలు పుచ్చేసుకున్నాను

శేషసాయి వీడు విచిత్రమయిన మృగంలా ఉన్నాడే

(అంతా నవ్వుతారు)

వియ్యన్న అమ్మగోరూ, పెద్దపండుక్కి భోజనానికొచ్చి కూడుతిన్నాక పాతిక బొబ్బట్లు సులువ్గా ధవిరేడు (గొణుగును)

జయశ్రీ ఏమిటంటావు? ఏమిటా గొణుగుడు?

తరుణ మా కలవాటయిపోయింది మూడేళ్ళయింది వీడికీ గొణుగు సంకటం పట్టుకుని

శేషశాయి నేను వెళ్ళాలి పదిహేను రోజుల్లో వస్తాను మరిప్పటికి సెలవు (జయశ్రీకి నమస్కరిస్తాడు) (విరించితో) విరించి బాబూ, సెలవు (లింగమూర్తితో) వెళ్ళొస్తాను (అందరివంకా పోతున్నట్టు చూసి) వెళ్ళాలని లేదు ఏం జేస్తాను (జయశ్రీతో) నేను చెప్పింది మీకు నచ్చి మీరల్లా చేస్తానంటే అయిదువేలిస్తాను అప్పుకింద. తరవాత యింటద్దెలమీద తీర్చుకోవచ్చును ఏదో మాట నాకు ఖచితంగా చెప్పండి.

తరుణ (కోపంగా) బాగుంది తమరు దయజేసి వెళ్లొచ్చు

(పోతాడు)

శేషశాయి ఇక ఆగను వెళుతున్నా సెలవు.

విరించి కాబోయే భర్తని నేనంటున్నానని తరుణకి కోపంవొస్తే రానీ నాకు మీ పాత్ర కులంటిక్కున పశువు దగుల్బాజి

తరుణ బాగుంది మావయ్యా మీరన్నమాట

జయశ్రీ నా కానందవే. నిన్ను చేసుకుంటే. అతను చాలా మంచివాడు

లింగమూర్తి ఒప్పుకుని తీరాలి ఆయన ఉత్తమోత్తముడు మా పిల్ల సీత కూడా అలాగే అంటుంది అమ్మగారూ! తమరు నాకొక ఉపకారం చేసితీరాలి లేక పోతే చచ్చిపోతాను మార్వాడీదగ్గర చిన్న వస్తువొకటి తాకట్టుపెట్టాను రేపు వడ్డీకట్టక తప్పదు పదిరూపాయలిప్పించారా మీ మేలు మరువను

తరుణ (చిరాగ్గా) మాదగ్గిర లేవు

జయశ్రీ నిజంగా నా దగ్గిర డబ్బులేదు

లింగమూర్తి ఏదో విధంగా ఆపద గడిచిపోతుందిగాని ఉండిపోతుందా? (నవ్వుతాడు) నేనెప్పుడూ నిరాశ చేసుకొను ఆ సమయానికి భగవంతుడేదో ఆధారం చూపిస్తాడు అన్నివిధాలా చితికిపోయి యిక మనకేం దారి అనుకుంటున్న వేళకి ఆ రైలుముండాకొడుకులు నా భూమ్మీదే పట్టాలు వేసి నాకొ నాలుగు డబ్బులు ముట్టచెప్పారు అలాగే ఇవాళ కాకపోయినా రేపైనావస్తుంది డబ్బు . నా కూతురు సీత అదృష్టవంతురాలంటారు అంతమందీ అందుకే దాని పేరుమీద లాటరీటిక్కట్టు కొన్నా ఆ మూలంగానయినా ఓ వెయ్యి రూపాయలు కళ్ళజూస్తాను

జయశ్రీ కాఫీతాగడం అయింది కాబట్టి కాస్త విశ్రమిద్దాం

తరుణ (ముద్దుగా) అరుణకి నిద్రపట్టేసింది (మెల్లిగా కిటికీ తెరిచి) చూడవమ్మా పెళ్ళుమంటూ వచ్చింది ఎండ అవిగో ఆ చెట్లు చూడూ ఎంత అందంగా వున్నాయో! హాయిగా గాలి వీస్తోంది ఆ పైని తియ్యని కోకిలగానం!

విరించి (ఇంకో కిటికీ తెరిచి) సంపెంగతోట కరిగించిన బంగారంలా వుంది నువ్వు మరిచిపోలేదు కాదూ! పూర్వం మనం తోటలో నడుస్తూవుంటే ప్రతి చెట్టూ బంగారపు గుమ్మటంలా మెరిసిపోయేది. నువ్వు మాత్రం మరచిపోగలవా? మరవడం ఎవరితరం?

జయశ్రీ నా చిన్ననాటి రోజులు స్ఫురణకొస్తున్నాయి స్త్రీ జీవితానికి మకుటాయమానమైన మాతృత్వం మొదట ఈ గదే నాకు ప్రసాదించింది నా పిల్లలకిది మాతృభూమి మనస్సులో యెన్ని బాధలున్నా ఒక్కమారు యీ కిటికీలోంచి వైకుంఠంలాంటి యీ తోట చూస్తే అన్ని విచారాలూ పోయేవి ప్రతిరాత్రీ తోటని చూసి చెట్ల గుబుర్లలో దీపాలలాంటి శోభచూసి హాయిగా నిద్ర పోయేదాన్ని. నే పడుకుంటే సుఖం వచ్చి జోకొట్టేది పొద్దున్నే సుఖమే నిద్రలేపేది అచ్చు అప్పట్లాగే వుంది తోట పిసరు మార్పు లేదు నా అందాలకుప్ప మలమల మాడ్చే వేసవి, గజగజ లాడించే శీతకాలందాటి హాయిగా ఆనందంగా ఉన్నావు. అప్సరసల్లాగ నీది నిత్యయౌవనం నీలో స్వర్గసౌఖ్యం ఉంది నా గుండెల్లో పాషాణంలా పాతుకుపోయిన విచారమంతా మరిచి ఒక్క క్షణం హాయిగా ఉండగలిగితే బాగుండును! గతాన్ని మరిచి పోగలిగితే బాగుండును!

విరించి ఆఖరికి మన రుణాలకోసం తోట అమ్మకంవయిపోతోంది! విచిత్రంగా లేదూ!

జయశ్రీ చూడు మా అమ్మ నడుస్తోంది సంపెంగ రంగు చీర కట్టుకుని వనలక్ష్మిలా అదుగో, ఇదే వస్తోంది! (నవ్వుతూ) ఆవిడే! ఆవిడే!

విరించి ఎవరూ!

తరుణ ఏఁవిటమ్మా అది?

జయశ్రీ ఎవరూ లేరు. వొట్టి భ్రమ! తోట కుడిపక్క నూతిమీదకి వంగి ఉండే ఆ చెట్టునుచూస్తే అది నీళ్ళు తోడుతూన్న ఆడమనిషిలా కనిపించింది.

(ప్రవేశం అనంతం లాగూ, చొక్కా, భుజమ్మీద కోటూ, కళ్ళకిజోడూ)

జయశ్రీ : తోటకాదు పుత్తడిబొమ్మ నీలాకాశం కింద అపరంజి పువ్వులు

అనంతం . జయశ్రీదేవిగారూ! (అతనివంక చూస్తుంది) మీకో నమస్కారం పెట్టి సెలవు పుచ్చుకొటానికొచ్చాను. ఒక్కనిమిషం నిలవమన్నా నిలవను. (వినయ పూర్వకంగా దగ్గరికొచ్చి) నన్ను ఉదయంవరకు కనిపెట్టుకుని ఉండమన్నారు వున్నాను ఇహ ఒక్క క్షణం ఉండలేను.

(జయశ్రీ విభ్రాంతితో అతన్ని చూస్తుంది)

తరుణ . (కన్నీళ్ళతో) ఈయనే అనంతంగారు.

అనంతం అవును మీ చిన్నబ్బాయికి చదువు చెప్పేవాణ్ణి పోల్చిపట్టలేనంత మారిపోయానా? (జయశ్రీ అతనిచేతులు పట్టుకుని రోదిస్తుంది)

విరించి అదుగో అదే వద్దన్నానమ్మా! ఏడ్చి ఏం ప్రయోజనం!

తరుణ (ఏడుస్తూ) అందుకే నిన్ను రేపటిదాకా అమ్మకి కనపడవద్దన్నాను.

జయశ్రీ నా చిన్నతండ్రిని ఏడేళ్ళు పెంచి ఏటికి బలేశాను

తరుణ ఏం జేస్తాం! ఆ యేడు కొండలవాడి ఇచ్ఛ!

అనంతం (కళ్ళనీళ్ళతో మెత్తగా) ఏడవకండమ్మా ఏడవకండి!

జయశ్రీ మరిరాడు అమ్మ దగ్గరికి నా వెర్రితండ్రి నేనేం పాపం చేశానని, అనంతం ! (మృదువుగా) అరుణ ఆ గదిలో నిద్రపోతోంది. నేనూ గట్టిగా రాగాలు తీస్తున్నాను అనంతం! నువ్వేఁవిటలా మారిపోయావు? మొహంలోకి ముసలి కళ వచ్చిందేం?

అనంతం నేను రైల్లో వస్తున్నప్పుడొక గొల్లమనిషి చీడపురుగంది

జయశ్రీ ఆనాటికి నువ్వుబొత్తిగా కుర్రాడివి ఇప్పుడేఁవిటిలా అయిపోయావు? ఆ కళ్ళజోడేఁవిటి? జుట్టంతా అలా పలచబడి పోయిం దేఁవిటి? .. ఇంకా కాలేజీలో చదువుతున్నావా? (గుమ్మం దగ్గరికి పోతుంది)

అనంతం : నా జీవితఁవంతా కాలేజీలోనే కడ్తారేట్లుంది

జయశ్రీ (అన్నగారి భుజంతట్టి, తరుణ తల నిమురుతో) కాస్త శ్రమ తీర్చుకోండి అన్నయ్యా! నాకూ వృద్ధాప్యం వచ్చేసింది.

లింగమూర్తి ఇహ నిద్రలకి లేవొచ్చు. ప్రాణం చాలొస్తోంది ఇవాళకి యిక్కడే ఉండిపోతాను నే మనవిచేసింది రేపటికేనా యిప్పిస్తే అదును గడిపిన వారవుతారు పది రూపాయలుమాత్రం

విరించి ఎప్పుడూ విప్పుతూన్న పురాణఁవే.

లింగమూర్తి  వడ్డీ డబ్బులిప్పిస్తే చాలును. అంతకన్న నే నడిగేదేం లేదు. కటాక్షించక తప్పదు

జయశ్రీ  నాదగ్గిర లేదంటే నమ్మవుకదా!

లింగమూర్తి  అమ్మమ్మా! ఆపద గడిప్పెట్టాలి మీకు మళ్ళీ రెండు రోజుల్లో ఫిరాయిస్తాను మీబోటివారి కిదేమాత్రం? చచ్చిపోతాను

జయశ్రీ  అయితే మా అన్నయ్యనడుగు - అత నడుగుతున్నదేదో యిచ్చి పంపించు

విరించి  నేనా? ఇవ్వడంవా? ఇచ్చేదాకా కాచుక్కూర్చొమను

జయశ్రీ  లాభం లేదు అభోజనం కూర్చుంటాడు పాపం చాలా అవసరం? రెండ్రోజుల్లో యిచ్చేస్తాడులే

(జయశ్రీ, అనంతం, లింగమూర్తి, వియ్యన్న లోపలికి వెళ్ళిపోతారు విరించి, తరుణ, రాముడు ఉంటారు)

విరించి  చెల్లికింకా దుబారాతనం పోలేదు (రాముడితో) వెళ్ళయ్యా నువ్వు నువ్వు దగ్గరకొస్తే ఏదో ఎలక చచ్చిన వాసన మంచిదిహ వెళ్ళు

రాముడు  ఎప్పటికీ మీరొక్కలా ఉండిపోయారు

విరించి : ఏఁవిటది? (తరుణతో) ఏఁవిటంటున్నాడు?

తరుణ . (రాముడితో) నిన్ను చూడాలని నిన్ననగా మీ అమ్మ ఆ పల్లెటూర్నించి వొచ్చి ఆ పశువులదొడ్లో కాచుక్కూచుంది

రాముడు  దానిమాటకేం లేవమ్మా!

తరుణ  నీకు కాస్త జాలైనా లేదా?

రాముడు  ఇవాళేం కొంపములిగింది? రేపు రాకూడదా? (పోతాడు)

తరుణ  అమ్మ యెప్పటికీ ఓలా వుంది ఒక్కపిసరు మారలేదు. డబ్బుచేతిలో ఉండాలిగాని అడగనివాళ్ళదే పాపం

విరించి  అవును (కాస్సేపు ఆగి) ఈ చిక్కులన్నీ ఎలా విరగడవుతాయనిక శతవిధాల ఆలోచిస్తున్నాను. కుదరని జబ్బుకు లక్ష మందులు. నెత్తి బద్దలు కొట్టుకొని ఆలోచిస్తున్నాను. పరిపరి విధాలుగా పథకం వేస్తున్నాను. ఒకటీ పనికొచ్చేది లేదు ఒకటే, డబ్బున్న దగ్గిరజ్ఞాతులెవరేనా చచ్చి వాళ్ళ ఆస్తి మనకి కలవాలి! అరుణకి సంపన్న గృహస్తుల యింట సంబంధమైనా చూడాలి. ఈ రెండూ కాకపోతే మా పెద్దత్త - పెద్ద మొఖాసాదారు పెళ్ళాం - ఆవిడ దయేనా సంపాదించాలి మా అత్త తలుస్తే ఎంత? పెద్ద జమీందారు భార్య!

తరుణ : (కళ్ళనీళ్ళతో) భగవంతుడి కృప

విరించి : అలా యేడిస్తే యేం లాభం? అత్త చాలా ధనవంతురాలేగాని మన వాసనంటే కిట్టదు. చెల్లి ఉన్నవాణ్నెవర్నీ చేసుకోక - కోరి సామాన్య కుటుంబానికి చెందిన ప్లీడర్ని పెళ్ళిచేసుకుంది. (అరుణ గుమ్మందగ్గరకొచ్చి నిలబడుతుంది).

అదీకాక దాని ప్రవర్తన మంచిది కాదుట కాకపోతేనేం మంచి మనస్సు. మెత్తని గుండె. సిమ్లాలో ఆ వర్తకుడిదగ్గర ఉండిపోయిందని కాదూ అందరి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నారు. ఎవరేనా యేంచేస్తారు. వయస్సులో భర్త చచ్చిపోతే ఉన్నమాట

అనుకోవాలి ఇంత మనిషీకూడా కాస్త పోకిరీగా కనబడుతుంది దాని ప్రవర్తన మంచిదికాదనే చెప్పాలి. ప్రతీ వొద్దికలోనూ ఆ సంగతి కనబడుతూనే వుంటుంది

తరుణ ఇష్ - ఇష్ - అరుణ అక్కడే ఉంది వింటుంది

విరించి ఏఁవంటావు? (కాస్సేపు ఊరుకొని) ఏఁవిటో నా కుడికన్ను చెడ్డ నొప్పెడుతోంది ఇదివరలా కనబడకుండా వుంది మొన్న లక్ష్మివారం జిల్లా కోర్టుకి వెళ్ళినప్పుడు -

(అరుణ ప్రవేశం)

తరుణ ఏం చెల్లీ, అప్పుడే లేచిపోయావు?

అరుణ అసలు నిద్రపట్టందే.

విరించి నా వెర్రితల్లీ! నాబంగారపుబొమ్మా! నువ్వు నా మేనగోడలివి కావు నా సర్వస్వానివి! నా తోడునీడవి! నమ్ము నా మాటలు

అరుణ నమ్ముతానుగాని మాఁవా! పెద్దవాడివి అన్నీ తెలిసిన వాడివని నిన్నింటల్లిపాదీ గౌరవిస్తారుగాని నీ గౌరవం నిలబెట్టుకోలేవు నువ్వు నోరెత్తడం మానెయ్యాలి మాఁవా! అమ్మ నీకు సొంతచెల్లెలు. నిమిషం కింద అమ్మనిగురించి నువ్వేమంటున్నావు? ఎందుకంటావు మాఁవా అలాంటి మాటలు?

విరించి . ఔను. పొరపాటొచ్చింది (చేతుల్తో మొహం కప్పుకొని) నిజఁవే మాట జారిపోయింది చూడూ యివాళ ఆ బీరువామీద యెంతసేపు వాగేనో? వొట్టి బుద్ధితక్కువ తీరా వాగుడంతా అయిపోయాక తలచుకుంటే వొట్టి తెలివి తక్కువని తేలింది

తరుణ ఔను మాఁవయ్యా! నువ్వు నోరు కట్టుకోవాలి మాట్లాడకు అంతే

అరుణ · నువ్వు మాట్లాడకుండా ఊరుకుంటే నీకేయెంతో లాభం!

విరించి మరి చచ్చినా మాట్లాడను (తరుణ, అరుణ తలలను నిమిరి) పీక పోయినా మాట్లాడను ఇది మాత్రం వ్యవహారభోగట్టా. మీరు వినితీరాలి లక్ష్మింవారం జిల్లాకోర్టుకెళ్ళాను వాళ్ళూ వీళ్ళూ అనేక మంది పోగయ్యారు. ఆ మాటా యీ మాటా యేదో లోకాభిరామాయణం చాలాసేపు సాగింది. మీకు తెలుసునో తెలియదో, నాకుమాత్రం ధైర్యం ఉంది కో అపరేటివ్ బ్యాంకిలో అప్పుతెచ్చి తణఖా మీద బకాయిలన్నీ చెల్లించెయ్యవచ్చు

తరుణ . భగవంతుడి కటాక్షం ఉండాలి

విరించి · మంగళవారం బయల్దేరుతున్నాను మళ్ళీ మాట్లాడుకుందాం (తరుణతో) అలా విచారించకు. (అరుణతో) ఆ శేషశాయితో చెప్పిచూడమను మీ అమ్మని మీ అమ్మ చెప్పితే కాదనలేడు నువ్వు ప్రయాణపు బడలిక తీర్చుకున్నాక మా అత్తయ్య దగ్గిరకోమారు వెళ్ళు ముగ్గురం మూడు దిక్కుల్నించి కలిసికట్టుగా పనిచేస్తే వ్యవహారం ఒకక్షణంలో పరిష్కారమైపోతుంది. అప్పు తీర్చిపారేస్తాం అరనిమిషంలో ఆ మాట నేను ఘంటాపథంగా చెప్పగలను ప్రమాణం చేసి చెప్పగలను మన ఆస్తి పోదు ఎంతమాత్రం వేలాం జరగదు (ఆవేశంతో) సూర్యచంద్రులు గతులు తప్పినా, కులపర్వతాలు కూలిపోయినా వేలాం మాత్రం జరగనివ్వను. ఈ మాట తప్పితే నా తల వెయ్యి చెక్కలైనట్లే

అరుణ (మామూలు స్థితికొచ్చి సంతోషంతో) నువ్వు మంచివాడివి మావయ్యా చాలా తెలివయినవాడివి (విరించిని కావలించుకుని) అమ్మయ్య నా గుండెలు కుదటబడ్డాయి బెంగంతా పోయింది

(వియ్యన్న ప్రవేశం)

వియ్యన్న ఇంకా యెప్పుడు పడుకుంటారు బాబూ!

విరించి ఇప్పుడే ఈ క్షణం నువ్వు వెళ్లు వియ్యన్నా! ఇదిగో నేను - ఈ కోటువిప్పి వచ్చేస్తున్నా పిల్లలారా ఇక లేవండి ఇప్పటికొక పథకమంటూ ఆలోచించాం కదా! పిల్లర వ్యవహారాలు రేపు మాట్లాడుకుందాం ఇహ మనం నిద్రపోదాం (అరుణ, తరుణ తలలు నిమిరి) నేను కొంచెం పూర్వోత్తరం మనిషినే కావచ్చు కాని పంతం వస్తే భల్లూకప్పట్టు పడతాను అందుకే ఈ రైతు లంతా నన్నంతగా నమ్ముతారు రైతుల్ని సరీగా అర్థం చేసుకొవడంలోనే ఉంది రైతువాడు యెలాగయితే -

అరుణ మళ్ళీ ప్రారంభించావూ మావయ్యా!

తరుణ కాస్త ఊరుకుందూ, యీపాటికి

వియ్యన్న (చికాకుతో) బాబయ్యగోరూ!

విరించి వస్తున్నా, వస్తున్నా తోసిరాజూ, ఆటకట్టూ వేసిన యెత్తుక్ తిరుగుండకూడదు

(వెళిపోతాడు వెనకనే వియ్యన్న కుంటుకుంటూ పొతాడు)

అరుణ నా మనస్సు కుదటబడింది నేనుమాత్రం అమ్మ అత్తగారింటికి వెళ్ళను వెళ్ళకపోయినా మనస్సు తాపీని పడింది ఇదంతా మావయ్య చలవ. (కూర్చుంటుంది)

తరుణ ఇహ నిద్రపోదాం రా! నేను వెడుతున్నా మీరు ఊళ్ళో లేనప్పుడెన్నో చికాకులొచ్చాయి అప్పులవాళ్ళ పీడ, పనివాళ్ళ లోకువ అడుగడుక్కి యిబ్బందులే (ఆవులించి) అన్నీ యెలాగో నెట్టుకొచ్చాను (అరుణతో) అరుణా! (కాస్సేపూరుకుని) అరుణకి నిద్రపట్టేసింది (అరుణ మెడమీద చెయ్యివేసి) గదిలోకి పోదాం రా! (తీసుకుపోతుంది) చిట్టితల్లి అలిసిపోయింది రా!

(వెళిపోతారు).

(దూరంగా సంపంగితోటలో కాపుపాట అనంతం వచ్చి అరుణనీ, తరుణనీ చూసి నిలబడిపోతాడు)

తరుణ . ష్ నిద్రపోతోంది నిద్రమత్తు రా అమ్మా పోదాం.

అరుణ (మృదువుగా సగం తెలివితో) నా వొళ్ళు నా వశంలో లేదు రైలింజను మోత, చక్రాల చప్పుడు మావయ్యా - అమ్మా -

తరుణ రా చెల్లీ - మెల్లిగా నడు

(అరుణ గదిలోకి పోతారు)

అనంతం (నాజూగ్గా) నా జీవనవసంతశోభా! నా మధుమూర్తీ!

(. తెర )

# రెండో అంకం

## తోట వెనుక

శిధిల శిలావిగ్రహం దానిపక్కన బావి పగిలిన బండరాళ్ళు పాతబడిపోయిన శిలావేదిక విరించి యింటికి వెళ్ళే దారి కనిపిస్తూ ఉంటుంది ఒక పక్కయేపుగా పెరిగిన సరుగుడుచెట్లు అక్కణ్నించే సంపెంగతోట ప్రారంభిస్తుంది దూరాన టెలిగ్రాఫ్ స్తంభాలు వాటపైన దూరదూరంగా యేదో పెద్దపట్టణం కనిపిస్తూంటుంది బాగా వెలుగుంటేనే కాని అది కనిపించదు సూర్యాస్తమయం కాబోతున్నది రాముడూ, జానకీ కూర్చుని ఉంటారు శివయ్య నిలబడి తంబూరా వాయిస్తుంటాడు అందరూ యేధ్లో ఆలోచిస్తూ కూర్చుంటారు

శివయ్య (తంబూరా వాయిస్తూ పాడుతాడు) ఈ వీణ మోగితే యేం సుఖం!

జానకి అది వీణకాదు. తంబురా అంటారు (తల్లో పువ్వులు సర్దుకుంటుంది)

శివయ్య వెర్రిగా ప్రేమిస్తున్నవారి కిది వీణే! (పాడుతాడు జానకి కూడా పాటలో పాట కలుపుతుంది)

జానకి దేశం దాటిపోతే మంచి మజాగా ఉంటుందన్నమాట

రాముడు · అందు కభ్యంతరఁవేంటి? మా చెడ్డ ఉషారుగా ఉంటుంది

శివయ్య అది సబబైనమాటే తెల్లవాళ్ళ దేశాల్లో ప్రతిదీ ఒక పాకానికొచ్చేసింది

రాముడు · అందు కబ్యంతరఁవేంటి?

శివయ్య నేను మా సాధకం చేశాను. ఎన్నో పుస్తకాలు చదివాను అయితే నేం? ఆఖరికి నా గతేఁవిటో నాకే అంతుపట్టకుండా ఉండటఁవా? ఊడటఁవా? ఏది యెలా యేడిసినా యెందుకేనా మంచిదని ఇదిగో యీ క్లై జారొకటి జాగర్తచేశాను (క్లైజారు తీసి చూపిస్తాడు)

రాముడు . అమ్మో! క్లైజారె!

శివయ్య అయితేగియితే తెలిన విషయఁవేవిటయ్యా అంటే నా గీత యెంత మాత్రమూ బాగాలేదు అన్నివిధాలా బతుకు భ్రష్టయింది. పడవమీద తుపానుకేం కనికారం? ఇవన్నీ నా వెర్రి ఊహలనుకుందాం అయితే యివాళ ఉదయం నేను నిద్రలేచేటప్పటికి నా యెదురు రొమ్ముమీద యింత పెద్ద సాలీడుండడఁవేవిటి? కాసిని నీళ్ళు తాగుదాఁవంటే అందులో బొద్దింకేఁవిటి? (కాస్సేపూరుకుని) హుఁ ఇదిగో, జానకమ్మా, ఓ మాట.

జానకి · అలాగే - యేం కబురు?

శివయ్య ఇక్కడ కాదు వేరే మనం యేకాంతం మాట్లాడుకోవాలి.

జానకి సరేకాని ముందు ఆ యింట్లోంచి ఒక చాప తీసుకొద్దురూ. వేసుక్కూచుందాం

శివయ్య దానికేం! తెస్తాను ఈ కత్తితో యేంజెయ్యాలో యిన్నాళ్ళకి బోధపడింది. (తంబుర తీసుకుని పాడుకుంటూ పోతాడు)

రాముడు  చంవురుగాళ్ళ పెద్దన్న - యదవనాయాల

జానకి  కొంపతీసి ఆ కత్తి పెట్టుకు పొడుచుకోడుగద (కాస్సేపూరుకుని) అదో మాదిరి గుండెల్లో గుబులొస్తోంది పదేళ్ళయింది యిక్కడ పనిక్కుదిరి మొదటపనులంటే అలవాటు తప్పిపోయింది చూడు. నా చేతులెంత నాజూగ్గా ఉన్నాయో! ఏది చూసినా గుండెల్లో బెంగ! నువ్వు నన్ను దగాచేస్తే నాగతేంకాను

రాముడు  ఓసి జాణా! నడతబాగాలేని పిల్లనిచూస్తే నాకు మా చెడ్డకోపం

జానకి  నా ప్రాణంవంతా నీమీదే ఉంటుంది నువ్వు మా బుద్ధిశాలివి నీకు తెలియనిదంటూ లేదు

రాముడు  అదిమాత్రం నిజం అసలు దీని సంగతేంవిటంటే ఒక ఆడకూతురికి మొగాడిమీద యిష్టం కలిగిందా, దానికి నీతిలేదన్న మాట! ఊం (కాస్సేపూరుకుని) ఆరుబైట చుట్టముట్టిస్తే ఏం మజా! (వింటున్నట్టు) ఎవరో వస్తున్నారు. అమ్మగారల్లే ఉంది నీ మానాన్న నువ్వెళ్ళిపో లేకుంటే తంటా వస్తుంది

జానకి  అబ్బ! నీ చుట్టవాసనతో నా తల నొస్తోంది (పోతుంది)

(జయశ్రీ, విరించి, శేషశాయి ప్రవేశం)

శేషశాయి  అటోయిటో నిష్కర్షగా తేల్చిపారెయ్యక తప్పదు జాప్యంచేస్తే లాభంలేదు ఆలోచనకేంవుంది? తోట కొట్టించేసి బంగళాలు కట్టించేందుకు సమ్మతేనా? అవును, కాదు! ఒక్కటే మాట.

జయశ్రీ  అబ్బ! ఏం చుట్టకంపు యెవడు కాల్చాడోగాని (కూర్చుంటుంది)

విరించి  ఈ రైలుపడడం యేం అనుకూలంగా ఉంది! పట్నం వెళ్ళి గడియలో పని చూసుకొచ్చేశాం బేష్. మూడు దెబ్బల పాడి రెండోయెత్తు కొంపకెళ్ళి మారుపేక కలపాలి

జయశ్రీ  ఇంతట్లోకే యేం పుట్టిమునిగిందని?

శేషశాయి  ఒక్కమాట చెప్పండి అవును, కాదు - మాట్లాడరేం?

విరించి  (ఆవులిస్తూ) ఏంవిటే? నువ్వనేది?

జయశ్రీ  (పర్సు చూసుకుని) నిన్నను అన్ని రూపాయలున్నాయి ఇవాళ చూద్దునుగదా అన్నీ కర్పూరంలా హరించుకుపోయాయి పెద్దమ్మా యేంవిటో ఆదాచేస్తానంటుంది పనివాళ్ళను పస్తుపెట్టి నేను చూస్తే డబ్బంతా యిలా తగలేస్తున్నాను (అంటూ పర్సు కిందపడేస్తుంది) ఇదిగో - ఉన్నవి కూడా ఉండనంటున్నాయి (చిరాకు పడుతుంది.)

రాముడు  అమ్మగారూ, నేనేరిపెడతా నుండండి

(డబ్బులు యేరుతాడు)

జయశ్రీ  మంచిది. ఎందుకన్నయ్యా, అస్తమానం పట్నం పోవాలని అఘోరించడం? కాఫీ క్లబ్బులకోసంవేనా? అంత తినడంవెందుకు? తాగడంవెందుకు? అదే పనిగా తాగడంవెందుకు? కాఫీ నీళ్ళందించేవాళ్ళ దగ్గర సంఘసంస్కరణ మీద ఉపన్యాసాలేంవిటి?

శేషశాయి	మరేం

విరించి	(చేతులాడిస్తూ) ఇహ నా జన్మకి నేను బాగుపడడం కల్ల! (విసుగుతో రాముణ్ణి చూసి) అదేం పోయేకాలం! అస్తమానం యెదట్నే నిలబడతావు స్తంభంలాగ!

రాముడు	మీరు నోరు కదిపితే నాకు కడుపు చెక్కలయ్యేట్టు నవ్వొస్తుంది

విరించి	(వెల్లెలుతో) ఈ వెధవ యిక్కడుంటే

జయశ్రీ	ఒరే రాముడూ, వెళ్ళిపో

రాముడు	చిత్తం అమ్మగారూ

శేషశాయి	భోగమలు సాహుకారు లక్షాధికారి. అతగాడు మీ ఆస్తంతా కొనాలనుకుంటున్నాడు వేలానికి తను స్వయంగా వస్తాట్ట

జయశ్రీ	. నీకెలా తెలిసింది?

శేషశాయి	పట్నం అంతా అదేమాట

విరించి	మీ పెద్దత్త రుణాలతీరుబడి నిమిత్తం కొంత పైకం పంపిస్తానంది ఎంత పంపిస్తుందో, యెన్నడు పంపిస్తుందో, యేమో

శేషశాయి	పంపిస్తే మహా యెంత పంపిస్తుంది? పదివేలా? ఇరవైవేలా?

జయశ్రీ	మహా అయితే పది పదిహేను వందలు

శేషశాయి	ఇంత వ్యవహారజ్ఞానంలేని మనుషుల్ని ఎక్కడా చూళ్ళేదు మీ ఆస్తంతా గంగలో కలిసిపోవటానికి సిద్ధంగా ఉందని ఘంటాపధంగా చెబుతుంటే వినిపించుకోరేం?

జయశ్రీ	నిజంవే అయితే యేంజెయ్యం? అదేదో నువ్వే చెప్పు

శేషశాయి	రోజూ చెప్పడంలేదూ? ఒకటికి పదిసార్లయినా పాడిందే పాటగా చెబుతున్నాను తోట కొట్టించి బంగళాలు కట్టించటానికి సమ్మతించాలి వేలం రోజు వెనక్కిపోదు ఈ ముక్క గ్రహించారంటే మీకు కావలసిన పెట్టుబడి నేను చూసుకుంటాను మీకీ బెడద తప్పిపోతుంది

జయశ్రీ	. బంగారంలాంటి తోట పాడుపెట్టి బంగళాలు లేపడంవంత నామర్దా పని ఇంకొకటుండబోదు

విరించి	నా అభిప్రాయంకూడా అంతే

శేషశాయి	నా ప్రాణానికొచ్చింది నవ్వాలో, యేడవాలో, మూర్ఛ పోవాలో తెలియకుండా ఉంది ఇక సహించలేను (విరించితో) నువ్వొక నాయనమ్మవి

విరించి	ఏంవంటున్నావ్?

శేషశాయి	తమర్ని నాయనమ్మ అంటున్నాను

(వెళ్ళిపోవటానికిలేస్తాడు)

జయశ్రీ	(గాభరాపడి) వెళ్ళిపోకు నువ్వుంటే చాల్చాలు ఇంకేదేనా ఆలోచన చెయ్యొచ్చు

శేషశాయి	బుర్ర బద్దలు కొట్టుకుంటే మాత్రం యేంలాభం?

జయశ్రీ	. బతిమాలుకుంటున్నాను నువ్వు మాత్రం వెళ్ళిపోకు బాబూ! ఏదెలావున్నా నువ్వుంటే కాస్త స్తిమితంగా ఉంటుంది (కాస్సేపూరుకుని) ఏం ఉపద్రవం వస్తుందో అని యెప్పుడూ నాకు బెంగ.

విరించి  చూస్తావేం, తుడుపుకొట్టు

జయశ్రీ  మేం చెయ్యరాని పాపాలు చేశాం

శేషశాయి  మీరా? ఏంవిటా పాపాలు?

విరించి  నాకున్న ఆస్తల్లా చిరుతిళ్ళకింద తగలేశానని అంతమందీ అనుకుంటారు

జయశ్రీ . నేచేసిన పాపాలకి అంతుందా? తనూ పై కానక ఇల్లు గుల్ల చేసుకున్నాను ప్రేమించి పెళ్ళి చేసుకున్న భర్త ధనార్జనకి బదులు ఋణార్జన చేశారు ఆయన తాగుడికి అంతూపొంతూ ఉండేది కాదు. చివరకి అదే ఆయన్ని మింగేసింది నా విధవతనంలో ఈ పాపిష్టి శరీరాన్ని యింకోడివశం చేశాను ఆ పాపానికి ఫలం కాబోలును నా చిన్నతండ్రి నాగుబాములాంటి యీ నది కాహారమైపోయాడు ఈ బాధ మరచిపోవటానికని పట్నం విడిచి పట్నం, దేశం విడిచి దేశం, పిచ్చిపట్టినట్టు తిరిగాను నా వెంటనే నీడలాగ (టెలిగ్రాం ఆడిస్తూ) ఈ రెండో ఆయన వెంబడించాడు సిమ్లాలో ఒక పెద్ద బంగళాలోఉన్నాం. అప్పుడాయనకి పెద్దజబ్బు చేసింది ఆ అవస్థలో యెక్కడికీ కదలటానికి వీల్లేక ఆ యిల్లు బోలెడంత డబ్బు పెట్టి కొనేశాం రాత్రనక పగలనక మూడు సంవత్సరాలు అందులో అతనికి నానా చాకిరీ చేశాను ఋణాలు తీర్చటానికని తుదకా బంగళా అమ్మేశాం విషంతాగి చచ్చిపోవటానిక్కూడా ప్రయత్నించాను! నలుగురిలో తలయెత్తి తిరగలేక పోయాను అప్పుడనిపించింది నా స్వదేశానికి వెళ్ళి మళ్ళీ నా పిల్లలతో శాంతంగా గడుపుదాంవని నారాయణమూర్తీ! తండ్రీ! నా తప్పులన్నీ క్షమించు నన్నాట్టే శిక్షించకు. (టెలిగ్రాం విషయంగా) మళ్ళీ రమ్మని బతిమాలుతున్నాడు (టెలిగ్రాం చింపేస్తూ) ఎంత చక్కని సంగీతం! ఎవరిదో!

విరించి  మనింట్లోంచే! సీరంవారి సన్నాయిమేళం

జయశ్రీ . ఇంకా వాళ్లు మేళం కడుతూనే ఉన్నారా? ఓమారు వాళ్ళనుపిలిపించి కచేరీ చేయించాలి

శేషశాయి . (వింటూ) నాకేం వినిపించడంలేదు. (మెల్లిగా)

త్యాగరాజు పాట దాక్షిణాత్యులనోట
భాషలేని వెర్రి ఘోష కాదె! ...

నిన్న రాత్రి ఓ తమాషా నాటకం చూశాను.

జయశ్రీ  అందులో యేమీ తమాషా వుందని నాకు తోచదు మీలాంటివాళ్లు అసలు నాటకాలు చూడకూడదు. మీలో వున్న లోపాలు చూసుకోవటానికి ప్రయత్నించాలి మీరు చేసే అధిక ప్రసంగాలూ, వ్యర్థపు కాలక్షేపాలూ - యివి చూసుకోవాలి

శేషశాయి . బాగా చెప్పారు. నిజానికి మాది నికృష్టపు బదుకు. (కాస్సేపురుకుని) నా తండ్రి వ్యవసాయంతప్ప యింకేంవీ యెరగడు. వొట్టి మొద్దు కొంచెం కూడా జ్ఞానం లేదు నాకో అక్షరం ముక్క కూడా చెప్పించలేదు ఎటొచ్చీ కోపం వచ్చినప్పుడల్లా కర్రుచ్చుకుని నన్ను బాదుతూ ఉండేవాడు. చివరికి నేనూ అతగాడి లాగే తయారయాను. ఒక్కపారం సరిగా చదవలేదు ఇహ నా దస్తూరి బ్రహ్మరాత. చదువుకున్నవాళ్ళ దగ్గిర నా మొహం చూపెట్టటానికి చిన్నతనంగా ఉంటుంది

జయశ్రీ పెళ్ళాడితే యీ చిన్నతనం పోతుంది

శేషశాయి అవును నిజఁవే

జయశ్రీ అయితే నువ్వే తరుణని పెళ్ళిచేసుకుంటే బాగుంటుంది చాలా మప్పితఁవైన పిల్ల

శేషశాయి అవును

జయశ్రీ కల్లాకపటం లేని పిల్ల పొద్దస్తమానం కష్టించి పనిచేస్తుంది అన్నిటి కన్నా ముఖ్యం నీమీద దాని కిష్టం నీకూ ఎన్నాళ్ళనుంచో దాని మీద మచ్చికే.

శేషశాయి దానికేం నాకూ సమ్మతే పిల్ల చాలా మంచిది

(కాస్సేపూరుకుంటాడు)

విరించి నాకు బ్యాంకులో ఉద్యోగఁవిస్తాఁవంటున్నారు నెలకి రెండు వందలు జీతం తెలిసిందా?

జయశ్రీ నీకు బ్యాంకులో ఉద్యోగఁవేఁవిటి? నువ్వెప్పుడూ ఇలా ఉండి పోవలసిందే

(మాత్రల సీసా పుచ్చుకుని వియ్యన్న వొస్తాడు)

వియ్యన్న · ఇదిగో మీ మాత్రల సీసా మరసిపోనారు.

విరించి : అబ్బ! ప్రాణం తినేస్తాడయ్యా!

వియ్యన్న . ఇలాసేస్తే యెలాబాబూ! నాకు సెపితే అన్నీ అందిస్తును. సెప్పకుండా సెయ్యకుండా యెళిపోతిరి

జయశ్రీ : నీ వయస్సెంత వియ్యన్నా?

వియ్యన్న ఆఁ?

శేషశాయి . నీ వయస్సెంత అని అడుగుతున్నారు అమ్మగారు

వియ్యన్న ఏనాటి మాట బాబూ! నా ఆడది కాపరానికి వొచ్చే నాటికి మీ అయ్య పుట్టనేదు (నవ్వుతాడు) ఆ రోజుల్లో అంతా లచ్చనంగా యెలిపోయేది

శేషశాయి . ఆ రోజులు వేరు అప్పుడు రైతుని చెప్పుతో కొట్టినా ఊరుకునేవాడు

వియ్యన్న . (విననట్టు) నిజంబాబూ! నా పిన్నతనంలో రైతులూ బుగతలూ ఒకళ్ళకొకరు ఆసరాగా వుండేవోరు. ఇప్పుడేటి, ఒక్కటే దొమ్ములాట. తలాతోకా నేదు

విరించి . నోరుముయ్యి వియ్యన్నా! మళ్ళీ రేపు పట్నంపోవాలి ఓ షావుకారు ఎంత డబ్బు కావలిస్తే అంత డబ్బిస్తానన్నాడు నోటు మీద.

శేషశాయి తమ ప్రయోజకత్వం తెలుసు అసలు మాటటుంచి వడ్డీరాళ్ళైనా చెల్లిస్తారని నే ననుకోను. కాస్త నిదానించండి.

జయశ్రీ ఆయన మాటలకేం. అసలా సాహుకారుమాటే అబద్ధం. అదంతా ఓ కల్పన.

(అనంతం, అరుణ, తరుణ వొస్తారు)

జయశ్రీ రండి, రండి! నా చిట్టి తల్లులు చెరోపక్కా అలా కూచోండి

శేషశాయి మన శాశ్వత విద్యార్థికి పడుచుపిల్లలతోనే కాలక్షేపం.

అనంతం : ఆ గొడవంతా మీ కెందుకు?

శేషశాయి · యాభైయేళ్ళు నిండినా ఇంకా విద్యార్థిగా ఉండటంచేత.

అనంతం సారస్యంలేని హాస్యం ఇక కట్టిపెట్టండి

శేషశాయి	ఇంతలోనే ఆగ్రహం రావాలటయ్యా మహానుభావా?

అనంతం	నా జోక్యం మీకెందుకు?

శేషశాయి	(నవ్వుతూ) నన్ను గురించి విద్యార్థిగారి అభిప్రాయ వేంటో తెలుసుకోవాల్సుంది

అనంతం	అయితే చెబుతా వినండి తమరు సంపన్నులు త్వరలో కోటీశ్వరులౌతారు కూడా అరణ్యానికి క్రూరమృగంవల్ల ఏం ప్రయోజనం ఉందో మానవ సంఘానికి తమరివల్ల అక్షరాలా అదే ప్రయోజనం దొరికినంత మట్టుకు చిన్న ప్రాణుల్ని కబళించడం

(అంతా నవ్వుతారు)

తరుణ	ఖగోళంలోని చిత్రాల్ని గురించి కాస్త చెప్పండి

జయశ్రీ	నిన్నటి విషయం మీదనే మాట్లాడనియ్యి

అనంతం	ఏంవిటది?

విరించి	అహంకారం మీద

అనంతం	ఎంతోసేపు మాట్లాడాం నిన్న, కాని ఓ సిద్ధాంతానికి రాలేకపోయాం అహంకారం అనే యీ పదంలో ఏదో అవ్యక్తమైన ధ్వని మీకు గోచరించవచ్చు కాని దూరంగా ఆలోచిస్తే ఈ అహంకారానికి ఆధారంవేంవీ కనిపించదు దేన్ని చూసుకుని గర్వించాలి అవకతవకగా నిర్మించిన యీ మానవశరీరాన్ని చూశా? అందులో కళవళించే అజ్ఞానాన్నీ, ఆవేదనల్నీ చూశా? ఈ స్వాభిమానాన్ని నిర్మూలించి నిరంతరం ఏదో పనిలో మగ్నులై ఉండాలి

విరించి	ఎన్ని చేసినా చివరికి చావు తప్పదు

అనంతం	ఏం చెప్పగలం? అసలు చావంటే అర్థంవేమిటి? మానవుడికి శతాధికంగా ఇంద్రియాలుండవచ్చు అతని మరణంతో మనం యెరిగిన పంచేంద్రియాలూ నశించి తక్కిన తొంభై అయిదూ నిలిచే ఉండవచ్చు

జయశ్రీ	అనంతం! నీది కుశాగ్రబుద్ధి

శేషశాయి	(ఎగతాళిగా) విద్యార్థిగారి ప్రజ్ఞావిశేషం వేరే చెప్పాలా?

అనంతం	మానవజాతి నిరంతరం నవ నవోన్మేషంగా పురోగమిస్తోంది ఈ నాడు మనకి అందరానిదిగా కనిపించే ప్రతివస్తువూ ముందొకనాటికి కరతలామలకమై తీరుతుంది కాని మనం ఉద్యోగించి పనిచెయ్యాలి. మనయావచ్ఛక్తినీ వినియోగించి సత్యాన్వేషణకు చేయూతనివ్వాలి నేటి మన భారతదేశంలో పనికిమాలినవారి సంఖ్య యెక్కువ మనదేశంలో విద్యాధికుల అవస్థ చూడండి వారికొక గమ్యం లేదు తిన్నగా యేపని చెయ్యడానికీ దక్షతలేదు విద్యాధికులంవని విర్రవీగుతారు నౌకర్లని ఒరే ఒసే అని పిలుస్తారు రైతుల్ని పశువుల్లా చూస్తారు. కొత్తదేదీ నేర్చుకోరు. పాతదేంవీ మననం చెయ్యరు. పరమబద్ధకస్తులు ఆచరణ శూన్యం ఆర్భాటం యెక్కువ శాస్త్రంవన్నా, కళ అన్నా అవగాహనం అసలే లేదు గంభీరంగా కనపడతారు అన్నీ తెలిసినట్టు నటిస్తారు అసాధారణ విషయాలే చర్చిస్తూ ఉంటారు. తత్వాన్ని పరిశీలిస్తాంవంటారు వీరంతా యిలాంటి వ్యాపారాల్లో మునిగి ఉంటే ప్రజలు

ఎలా ఉంటాడు నూటికి తొంభై తొమ్మిదిమంది పశుప్రాయులుగా జీవిస్తున్నారు కాస్త కోపంవొస్తే ఒకరి మీదొకరు విరుచుకుపడతారు పందుల్లా తిని మురికి కూపాలలో దుర్గంధాన్ని పీలుస్తూ నిద్రిస్తారు ఎక్కడ చూసినా సల్లులు, మురికి వాసన ఇల్లంతా గొడ్లచావిడి! భ్రష్టజీవనం! ఈ కుళ్ళంతా కప్పి పెట్టడానికే మనం చేసే ఉపన్యాసాలన్నీ ఏవీ మన సంస్కర్తలు చెప్పే ఆరోగ్యాలూ పరనమందిరాలూ, ఎక్కడా కనిపించవు అవి గ్రంథాల్లో రాయడానికి మాత్రమే వినియోగిస్తాయి యదార్థజీవితంలో యెక్కడా లేవు ఉన్నదల్లా మాలిన్యం, నైచ్యం, భారతీయ నిస్పృహత ఈ ముడుచుకున్న మొగాల్ని చూస్తే నాకు చెడ్డభయం అసహ్యం. ఈ గంభీరోపన్యాసాలూ అంతే ఇంతకన్న నోరు మూసుకోవటం మంచిది

శేషశాయి నేను మాత్రం తెల్లారకముందే లేచి రోజల్లా యేదో పనిలో మునిగుంటాను నాదిగాని, ఇతరులదిగాని పైకం యెప్పుడూ నా చేతిలో ఆడుతూ ఉంటుంది నాకు నిత్యమూ అనేకమందితో పరిచయం పనిలో దిగితే సరి, లోకంలో నిజాయితీ మనుషులు యెంతమంది ఉన్నారో బోధపడుతుంది భగవంతుడు పెద్ద పెద్ద అడవులు నిర్మించాడు సారవంతమయిన భూములు సృష్టించాడు విశాలమైన ఆకాశాన్నిచ్చాడు వీటిమధ్య నివసిస్తున్న మనం దేవతలంగా బతకవలసింది

జయశ్రీ దేవత లయిపోవాలనుందటోయ్ నీకు? కథల్లో ఫర్వాలేదుగాని కంటబడితే భయం వేస్తుంది

(వెనకనించి శివయ్య తంబురమీటుకుంటూ పోతాడు)

జయశ్రీ అడుగో శివయ్య

అరుణ అడుగో శివయ్య

విరించి పొద్దుగూకింది

అనంతం అవును

విరించి (స్వాప్నికంగా) హే విశ్వజననీ! ప్రకృతీ! నీ తేజోరాశి నిరవధికం జననమరణాలకు నీ వధిష్ఠానదేవతవు కల్పానికి వికల్పానికి

తరుణ మామయ్యా!

అరుణ మళ్ళీ మొదలెట్టావూ మామయ్యా?

అనంతం ఈ స్తోత్రం మాని తమరు వెంటనే తురుపు తగిలిస్తే బాగుంటుంది

విరించి ఇహ మాట్లాడితే ఒట్టు

(అందరూ ఆలోచనలోపడతారు పరమ నిశ్శబ్దంగా ఉంటుంది వియ్యన్న సణుగుడు మాత్రమే వినవస్తుంది అకస్మాత్తుగా ఆకాశంలో ధ్వని యేదో వీణ తీగె తెగినట్లు - విషాదసూచకమైన ధ్వని )

జయశ్రీ ఏమిటా ధ్వని?

శేషశాయి ఏమో, ఎక్కడో దూరాన బిందె పడ్డట్టుంది

విరించి అదోరకం పక్షి కూత కావచ్చు. కొంగరుపులా ఉంది

అరుణ లేకపోతే గుడ్లగూబ కూసిందేమో?

జయశ్రీ (జలదరించి) ఎందుకోగాని ఆ కూత వింటే భయం వేస్తోంది

విరించి సరిగ్గా యీ కూతే యినబడ్డాది గాలివానకి ముందు నీళ్ల పొయ్యి మీద కాగి గణగణమని మోగింది

జయశ్రీ అంతా లేవండి వెళ్లిపోదాం (అరుణతో) ఏఁవమ్మా అరుణా! కంట తడిపెడుతున్నావు ఎందుకు చిట్టితల్లీ!

అరుణ అబ్బే యేం లేదు.

అనంతం ఎవరో వొస్తున్నట్టుంది

(ఎవరో దారిపొయ్యేవాడొస్తాడు నలిగిపోయిన బట్టలూ, చిరిగిన తలపాగా కొద్దిగా తాగినట్టున్నాడు)

బాటసారి . దండాలు, దండాలు బాబయ్యా! వేసనికెల్లే దారిదేనా?

విరించి అదే, సరాసరి పో

బాటసారి మీ కడుపు సల్లగుండాల (పాడుతాడు) కడుపుమంటకొ కాసి డబ్బెయ్యండి తల్లీ!

(తరుణ కెవ్వుమంటుంది భయపడుతుంది)

శేషశాయి అయినదానికీ కానిదానికీ ఒకటే రొదా?

జయశ్రీ (తొందరపాటుతో) ఇంద తీసుకొ (సంచిచూసి) చిల్లర డబ్బులు లేవు సరే యీ నోటు తీసుకొ

బాటసారి తల్లి మాలచ్చిమి కడుపు సల్లంగుండాల (నిష్క్రమిస్తాడు)

(నవ్వుతారు)

తరుణ నేను చూడలేను నేను చూడలేను ఇంటి దగ్గ రొక్కరికీ తిండి సరిగా లేదుగదా, ఇలా నోట్లకినోట్లు పారేస్తే యెలాగనమ్మా!

జయశ్రీ ఎన్నేళ్లొచ్చినా మీ అమ్మ యింతే ఈ తడవ వెళ్ళిపోయేప్పుడంతా నీకిచ్చి పోతానమ్మా శాయీ, నాకింకొంచెం పైకం బదులిద్దూ!

శేషశాయి అలాగే

జయశ్రీ రండి పోదాం

శేషశాయి బహుపరాక్! మీ అందరికీ మళ్ళీ జ్ఞాపకంచేస్తున్నాను బహుళ దశమి నాటికి సంపెంగతోట వేలం అయిపోతున్నది. జాగర్తగా ఆలోచించుకోండి

(అనంతం, అరుణ తప్ప అంతా వెళిపోతారు)

అరుణ · ఆ ముష్టివాడి ధర్మఁవా అని అక్కయ్య మనల్ని వెంబడించకుండా వెళిపోయింది

అనంతం నువ్వూ నేనూ వివాహబంధంలో చిక్కుకుంటాఁవని మీ అక్కయ్య భయం ఒక్కక్షణమయినా మనల్ని యేకాంతంగా మాట్లాడుకొనియ్యదు మనిద్దరమూ యీక్షుద్రమయిన వివాహానికి అతీతులమని ఆవిడ అల్పబుద్ధికి గోచరం కాదు మానవసౌభాగ్యానికీ, స్వాతంత్ర్యానికీ, సౌఖ్యానికీ అంతరాయం కల్పించే ప్రతీ అల్పత్వాన్నీ ఛేదించుకు పోవడమే మన జీవితానికి పరమావధి ముందంజ వెయ్యండి. సోదరమానవులారా! నిరాటంకంగా మునుముందుకి సాగిపొండి -

అరుణ ఎంత చక్కగా వర్ణిస్తావు అనంతం? (కొంచెం ఆగి) ఎంత హాయిగా వుంది యివాళ?

అనంతం చక్కని గాలి వీస్తోంది.

అరుణ  నీ ప్రబావంచేత సంపెంగతోట మీద నాకు మోజేపోయింది ఒకప్పుడాతోటంటే నాకు వెర్రి అభిమానం ఈ లోకంలో అంతకన్న అందమైన ప్రదేశం లేదనుకునేదాన్ని.

అనంతం  బారతదేశమే మన మహోద్యానం ఈ విశాలావనిలో ఎన్ని రమ్యస్థలాలు లేవు! (కొంచెం ఆగి) ఒక్కమాట విను అరుణా! ఎందరు శ్రమజీవుల చెమటోడ్చి పెంచారో యీ సంపెంగతోటను, మీ తండ్రులు, తాతలు, ముత్తాతలు ఆ క్షుదార్తుల చూపులు పూవుపూవునా కొమ్మకొమ్మనా నీకు కనిపించడంలేదూ? తలచుకుంటే వొళ్ళు జలదరిస్తుంది నీ సంపెంగతోట పేరు చెబితే నాకు భయం సాయం వేళకానీ రాత్రికానీ ఆ తోటలో నడుస్తూ ఉంటే అవ్యక్తమయిన కాంతితో మెరిసి పోయే ఆ తరుచ్ఛాయలు చూశావా? ఆ వెనకటి కష్ట కథలు జ్ఞాపకం వచ్చి పీడకలలు కంటున్నట్టు గోచరించవూ? లోకమంతా ముందుకు సాగిపోతోంది మనం మాత్రం రెండు శతాబ్దాల వెనకపడి ఉన్నాం ఇంతవరకు మనం సాధించిన మహాకార్యం ఏమీ లేదు. మన సంప్రదాయాలకూ మనకూ ఎలాటి సంబంధమో గ్రహించనైనాలేదు తత్వాలల్లుతున్నాం ఏమీ తోచక తిరుగుతున్నాం తింటున్నాం. తాగుతున్నాం ఈ ప్రాచీన సంప్రదాయభారం మన భుజాలనుండి జారిపోతేనేగాని తేలిగ్గా మనం ముందుకు నడవలేం ఆ భారం పోవాలంటే అఖండమైన తపోనిష్ఠ కావాలి అరుణా! అది గ్రహించు.

అరుణ  నా కిన్నాళ్ళు వసతిగా వున్న యీ యింటిపై నాకు హక్కు లేదని యెన్నడో తెలిసింది నా మాట నమ్ము ఇల్లు విడిచిపెట్టడానికి నేను సిద్ధంగా ఉన్నాను

అనంతం . ఆ యింటితాళా లేవేనా ఉంటే బావిలో గిరవాటేసి పో నలుదిక్కులా వీచే గాలివలె స్వేచ్ఛగా విహరించు

అరుణ . ఏమి నీ మాటల చమత్కారం.

అనంతం  నమ్ము నా మాట అరుణా! నమ్ము నాకింకా ముప్ఫయియేళ్లు నిండలేదు. నేను యువకుణ్ణే విద్యార్థిని కాని యెంత వేదన అనుభవించాను? నా ఆకలికి అంతులేదు నా దరిద్రానికి మితిలేదు విధి నిర్దయగా నన్ను క్రీడాకందుకాన్ని చేసి ఆడిస్తున్నది. ఏనేల నిలిచినా రేయనక పవలనక ఉత్కంఠతో నా ఆత్మ విహ్వాలిస్తున్నది. కాని నీకు తెలుసు అరుణా? శుభోదయవేళ సమీపిస్తున్నదని

అరుణ  అదిగో చంద్రోదయం.

(శివయ్య తంబూరా మీద విషాదగీతం పలికిస్తూనే ఉన్నాడు చంద్రోదయం అవుతుంది సరుగుడుచెట్ల వెనకనించి తరుణ అరుణను పిలుస్తోంది )

అరుణా! అరుణా!

నంతం  అదుగో మళ్ళీ వొస్తోంది: మన ప్రాణాలు కొరుక్కుతింటానికి.

రుణ  వొస్తే రానీ, నదీతీరం చేరుకుందాం.

నంతం . రా, పోదాం.

(తరుణ పిలుపు ... 'అరుణా' 'అరుణా' అని)

(. ..తెర....)

---

# మూడో అంకం

నలుగురూ కూర్చునే గది వెనక పెద్ద ఆర్చి ఆర్చి వెనక మరో గది.

లాంతరు వెలుగుతోంది పక్క గదిలో గ్రాంఫోను రికార్డు వినిపిస్తోంది

లింగమూర్తి, అనంతం, జయశ్రీ, అరుణ, తరుణ ముందు వస్తారు తరవాత జానకి వస్తుంది

వియ్యన్న మంచినీళ్లు పట్టుకొస్తాడు

లింగమూర్తి మన ఆరోగ్యానికేఁవీ లోపం లేదు.

అనంతం విగ్రహపుష్టి, నైవేద్యనష్టి

లింగమూర్తి అదే అసలు చిక్కు చేతిలో డబ్బేవీఁ ఆడడంలేదు డబ్బులేనిది డెక్కాడదు అదొక్కటే నా జబ్బు

అనంతం నీ జన్మంతా యీ డబ్బుకోసం వెదకడం మానేసి ఆశక్త యింకో దాని మీద వినియోగిస్తే, యీ లోకాన్ని తలకిందులు చెయ్యొచ్చు

లింగమూర్తి వేమన్న మహ గొప్ప వేదాంతి - తన మహత్తువల్ల అన్ని వస్తువులూ బంగారం చేసేవాడు ఈనాడే ఆయన బతికుంటే నాలుగు నూర్రూపాయల నోట్లు చెయ్యలేకపోయేవాడా? ఎల్లుండి యీ వేళకి ఇంటద్దె ముప్పయ్యయిదు రూపాయలు చెల్లించాలి చేతిలో పదకొండు రూపాయలు మాత్రం ఉన్నాయి. (జేబులు వెతుక్కుని గాభరాపడి) అరే! కనిపించడంలేదే ఎక్కడో పోయింది ఎక్కడ పారేసుకున్నానో! (సంతోషంతో) అమ్మయ్య! యీ జేబులో ఉంది ఒళ్ళంతా ముచ్చెమటలు పట్టేసింది

(జయశ్రీ, తరుణ ప్రవేశం)

జయశ్రీ అన్నయ్య యేఁవైనట్టు? ఇంత సేపాయ పట్నంలో ఏం జేస్తున్నాడో?

అనంతం వేలాం ఆగిపోయిందేఁవో?

జయశ్రీ ఇవాళ యీ మేళఁవేఁవిటి? ఇంకోనాడు పెట్టుకోవలసింది... ఏదో అయిపోయింది. ఇప్పుడనుకుంటే యేం లాభం? వేలం అయిపోయుంటుంది. లేకపోతే ఆగిపోయిందో? ఏఁవైనా మా అన్నరాడే!

తరుణ . మాఁవయ్య కొనేసి ఉంటాడేఁవో ఆస్తంతా?

అనంతం కొనకేం?

తరుణ . అత్తయ్య డబ్బు పంపించింది కాదూ. తప్పకుండా కొనే ఉంటాడనుకుంటాను

జయశ్రీ మీ అత్త యెంత పంపించిందనుకున్నావు? పదిహేను వందలు. వడ్డీ చెల్లించడానికైనా చాలదు నా కర్మం యివాళతో తేలిపోతుంది

(ప్రవేశం రాముడు)

రాముడు : శివయ్య గ్రాంఫోను పగలగొట్టాడు.

తరుణ · అతణ్ణక్కడికి యెవరు వెళ్ళమన్నారు అతని సంగతేఁవీ బోధపడ్డం లేదు నాకు

జయశ్రీ . మా అన్న ఇంకా రాడేం చెప్మా, అటో ఇటో తేలిపోయిందని కబురు తెలిస్తే

నా ఉంపిపెను. నాకేదివో ఆందోళనగా ఉంది. అనంతం! నువ్వైనా కొంచెం ధైర్యం చెబుదూ! ఏవో మాట్లాడుదూ!

అనంతం  మీ ఆస్తి యివాళ అమ్మకంవైనా రేపు అమ్మకంవైనా ఒకటే. అమ్మకం సంగతియేనాడో తెలిసిపోయింది. ఇప్పుడు వగచి యేంలాభం! మీరిక చాదస్తాలు పెట్టుకోక, నిజాన్ని ఉన్నదున్నట్లు గుర్తించాలి

జయశ్రీ  నిజంవన్నదేది? నిజంవేదో అబద్ధంవేదో నువ్వు చూడగలవు గాని ఆ విచక్షణశక్తి నాలో నశించింది. అంతా నాకు అగమ్యగోచరంగా ఉంది. ఎంత పెద్ద విషయాన్నయినా నువ్వు యిట్టే మూడు ముక్కల్లో తెగతెంపులు చేసిపారేస్తావు. ఆ ధైర్యం ఎలా వచ్చిందో నీకు తెలుసా? యౌవనంలో ఉండటంచేత! నాలాటి వాళ్ళు పడే వేదన నీకు తెలియకపోవడంచేత! జీవితం అంతా నీకు ముందే వుంది. ముందు రాబోయే బాధలు నీ కుర్రకళ్ళ కెలా గోచరిస్తాయి. నువ్వు మా అందరికన్నా ధైర్యవంతుడివే! నిజాయితీ మనిషివే! గంభీరుడివే! కాని కొంచెం ఆలోచించు! కాస్త ఉదారబుద్ధి చూపించు. నన్ను చూసి జాలిపడు. ఇలా చూడు. నేనీ యింట్లో జన్మించాను. నా తలిదండ్రులిక్కడ కాపురం చేశారు. నాకీ యింటి మీద యెంత మమకారంవో నీకేం తెలుస్తుంది? ఈ సంపెంగతోట పోతే నా ప్రాణాలే పోయినట్టు. తోటను అమ్మాలిసే వొస్తే తోటతోపాటు నన్నూ అమ్మెయ్యండి. మా చినబాబు యిక్కడే మరణించాడు (ఏడుస్తుంది) నన్ను కలతపెట్టకు. నామీద కనికరించు నాయనా?

అనంతం  కనికారం లేకేం.

జయశ్రీ  ఆ మాటే యింకా సౌమ్యంగా అనలేవూ? (రుమాలు తీస్తూ టెలిగ్రాం కింద పడేస్తుంది) ఈనాడు నా హృదయంవెంత దుర్బలంగా ఉందో నువ్వు ఊహించలేవు. ఈ ధ్వనులన్నీ నన్ను కలత పెడుతున్నాయి. ప్రతి ధ్వనికీ నా గుండె ఆగిపోతున్నది. ఎలా వొణికిపోతున్నానో చూడూ. కాని ఎక్కడికి పోను? ఏం చెయ్యను? తోడు లేనిదే నేను బతకలేను. నీ కారిన్యాన్ని విడిచిపెట్టు. నీమీద నాకు పుత్రప్రేమ. అరుణని నువ్వు పెళ్ళాడితే నా కానందంవే. కాని నువ్వు మొదట పరీక్ష ప్యాసయి యేదో పనిలో ప్రవేశించాలి. నీ అంతట నువ్వేదీ చెయ్యవు. విధి యెలా ఆడిస్తే అలా ఆడుతూ ఉంటావు. అది అట్టే భావ్యం కాదు. ఏంవంటావు? నే నన్నది నిజంవేనా? ముందు ఆ గడ్డం కాస్త పెరిగే మార్గం ఆలోచించాలి. నీ పేడి మొహం చూస్తే నవ్వొస్తోంది

అనంతం  (టెలిగ్రాం నేలమీద నుంచి తీసి) నాకు నవ మన్మథుణ్ణయి పోవాలని లేదు

జయశ్రీ  ఈ తంతి సిమ్లానించొచ్చింది. రోజూ ఇలా వొస్తూనే వుంటాయి. నిన్నొహటీ, ఇవ్వాళొహటీ. ఆయనకి మళ్ళీ జబ్బు తిరగబెట్టిందట. తన్ను క్షమించమంటాడు. రమ్మని బతిమాలుతున్నాడు. నిజానికి తక్షణం నేను సిమ్లా వెళ్ళవలసిందాన్నే. ఎందుకల్లా కఠినంగా చూస్తావు నా వంక. నేనేం జెయ్యను? అతడు వ్యాధిగ్రస్తుడు. తోడునీడ లేకుండా బాధపడుతున్నాడు. ఎవరాతణ్ణి లాలించేవారు? వేళకతనికి మందిచ్చేవారెవరు? ఇహ నాకు సిగ్గేంవిటి? ఆయనే లేనిది నేనొక క్షణం బతకలేను

ఈ తగులాటం నా మెడకో బండరాయి అడుగడుక్కీ నన్ను కుంగదీస్తోంది అయినా ఈ బరువులేనిదే నేను బతకలేను (అనంతం చెయ్యి పట్టుకుని) నన్ను నిందించకు అనంతం! ఏమాటా అనకు

అనంతం ఉన్నమాట అనేస్తున్నాను అతను మీ సర్వస్వమూ అపహరించాడు

జయశ్రీ (చెవులు మూసుకుని) అలాంటి మాటలు నువ్వనకూడదు నేను వినకూడదు

అనంతం వాడుత్త వుండాఖోరు మీ రొక్కరే తెలుసుకోలేక పోతున్నారు పరమ దుర్మార్గుడు, అధమాధముడు!

జయశ్రీ (కోపం వచ్చినా బిగబెట్టుకుని) పాతికేళ్ళు పైబడ్డాయి కాని నువ్వింకా ఓనమాలు దిద్దుకుంటున్నట్లే మాట్లాడుతున్నావు

అనంతం అయితే కావచ్చు

జయశ్రీ నీకింత వయస్సు వచ్చినా మీసం లేదు గడ్డం లేదు నీకు ప్రేమ లేదు. ఇంకొహరి ప్రేమ నీకు అర్ధం కాదు. అదేదో పవిత్ర శీలంవనుకుంటున్నావు కాబోలు నీకు శీలంవే లేదు. నువ్వొట్టి వెటకారం మనిషివి వాజవి

అనంతం (అదిరి) ఏంవిటీ?

జయశ్రీ ప్రేమ కతీతుణ్నానుకుంటావుకదూ నువ్వు అసలు సంగతేంవిటంటే నువ్వొట్టి పనికిమాలిన మనిషివి నీ యీడుకి నీకు స్త్రీ సాంగత్యంవే లేదంటే నిన్నేం వనుకోవాలి?

అనంతం కర్ణకఠోరంవైన మాటలు (తల చేతుల్తో పట్టుకొని) ఛీ, ఛీ! ఈ మాటలు వినలేను (లోపలికి వెళ్ళి వెంటనే వస్తాడు) ఇహ మనకీ జన్మలో మాటల్లేవు (వెళిపోతాడు)

జయశ్రీ (అతన్ని పిలుస్తూ) అనంతం! అనంతం! వెళ్ళిపోకు ఏదో మాటమీద మాటవచ్చి వుట్టినే అన్నాను.

**(అనంతం దెబ్బతిని పడ్డ చప్పుడు. అరుణ, తరుణ కెవ్వుమంటారు. మరుక్షణం నవ్వు)**

జయశ్రీ ఏంవిటా చప్పుడు!

(అరుణ అనంతంతో పరుగెత్తుకొస్తుంది )

అరుణ (నవ్వుతూ) అనంతం మెట్లమీదనుంచి జారి కింద పడ్డాడు.

జయశ్రీ : ఏం అవకతవక మనిషి రావోయ్! అనంతం! ఇలారా! నువ్వు పుణ్యపురుషుడివి నే నన్నమాట లక్ష్యపెట్టకు రా పోదాం

(జయశ్రీ, అరుణ, అనంతం వెళ్ళిపోతారు )

(వియ్యన్న, రాముడు ప్రవేశం)

రాముడు తాతా! ఏం కబుర్లు.

వియ్యన్న నా వంటో యేం బాగానేలేదు ఒళ్లంతా వొణికిపోతున్నాది

రాముడు ఇన్నాళ్లు బతికావు చాలదూ! ఇక చచ్చిపో!

వియ్యన్న ఆరి గాడిదకొడకా! (తనలో గొణుక్కుంటాడు)

(జయశ్రీ, అనంతం వస్తారు)

జయశ్రీ నాకు ఆయాసంగా ఉంది. కూచుంటాను

(అరుణ వస్తుంది)

అరుణ (ఆందోళనతో) తోట అమ్మకంవైపోయిందని యెవరో పెద్దమనిషి పెరట్లో అంటున్నాడు

జయశ్రీ . అమ్మకంవా? ఎవరికి?

అరుణ ఎవరికో చెప్పలేదు అప్పుడే వెళిపోయాడు

రాముడు ఎవడో ముసలాడు. ఎరిగిన మొగం కాదు

వియ్యన్న విరించి గోరింకా రానేదు. ఇయ్యాల మందుచ్చుకున్నారో నేదో

జయశ్రీ అటుయిటూ తెంవలకుండా ఏంవిటీబాధ? ఒరేయ్, నువ్వెళ్ళి కనుక్కురా యెవరుకొన్నారో!

రాముడు ఇంకా కూచున్నాడా ఆ ముసలాడు? అప్పుడే వెళిపోయాడు

జయశ్రీ వియ్యన్నా! మా ఆస్తంతా అమ్మకంవై పోతే నువ్వెక్కడికి పోతావు?

వియ్యన్న అమ్మగోరి సిత్తం, యాడకెళ్ళమంటే ఆడ కెళుతాను

జయశ్రీ ఏంవిటాలోచిస్తున్నావు ఒంట్లో జబ్బుగా ఉందా? పోయి పడుకో.

వియ్యన్న అలాగే నమ్మగోరూ! ఈ యిల్లంతా నీ సేతిమీదుగా నడపాలి లేకపోతే యేమౌతది?

రాముడు జయశ్రీ అమ్మగారూ! మీరు మళ్ళీ సిమ్లా వెళిపోతే నన్ను కూడా తీసుకుపొండి ఈ దేశంలో నేనుండలేను అంతా అడివిమ్రుగాలు

(లింగమూర్తి వస్తాడు)

లింగమూర్తి జయశ్రీగారికి జయం! తమరు కటాక్షించి ఒక్క పాతిక రూపాయలు దయచేయించాలి పాతిక రూపాయలు చాలు

(జయశ్రీతో నిష్క్రమణ)

(రాముడు పాడతాడు. జానకి వస్తుంది)

జానకి తాతా! నా వొళ్ళంతా అదోమాదిరిగా వుంది ఎవరో ఒకబ్బాయిప్పుడు నేను పువ్వులాగ వున్నానన్నాడు

వియ్యన్న · యేటన్నాడూ?

జానకి నేనట పువ్వులాగ సుకుమారంగా ఉన్నానట!

వియ్యన్న పిల్లా! నీ తల తిరిగింది

(శివయ్య వస్తాడు)

శివయ్య జానకీ! నా మీద బొత్తిగా శీతకన్నేశావు నేనో గడ్డిపోచతో సమానం నీ కళ్ళకి.

జానకి ఏం కావాలి నీకు?

శివయ్య · నీ అభిప్రాయం సరైనదే కావచ్చు కాని బాగా దూరం ఆలోచించి, లెస్సగా పరిశీలించి చూస్తే నన్నొక అవస్థలోకి దించేశావని చెప్పక తప్పదు నా గతేంవి కానున్నదో నేనెరుగుదును రోజూ నా కేదో దురదృష్టం సంభవించడం అలవాటయిపోయింది. నవ్వేసి ఊరుకుంటూ ఉంటాను కాని నువ్విచ్చిన మాట వల్ల. .

జానకి · తర్వాత మాట్లాడుదాం లెద్దురూ. ఈపాటికి నువ్విచ్చిన మాటవల్ల -

శివయ్య . ప్రతిరోజూ ఒక దురదృష్టం. అయితేనేం, నా గొప్ప చెప్పుకోగూడదుగాని అందరిలాగా

నేను తలవంచను చిరు నవ్వుతోనే కాదు అట్టహాసంతో కూడా దాన్ని సంహరిస్తూనే ఉంటాను.

(తరుణ వస్తుంది)

తరుణ ఇంకా యిక్కణ్నే ఉన్నావూ? నీతో చెప్పిందేఁవిటినేను? (జానకితో) వెళిపో వేగం యిక్కణ్నించి. (శివయ్యతో) ఆ గ్రాంఫోను దగ్గిరికి నిన్నెవరు పొమ్మన్నారు? పోయినవాడివి దాన్నెందుకు బద్దలుకొట్టావు? ఇంటి కాహ్వానించిన మనిషిలాగ ఆ విఁర్రవీగడఁవేఁవిటి?

శివయ్య . నన్ను ఆజ్ఞాపించడానికి తమకెంత మాత్రమూ అధికారం లేదని తెలియజేస్తున్నాను

తరుణ నిన్ను ఆజ్ఞాపించడం లేదు. నా సంగతి చెబుతున్నా నువ్వు చెయ్య గలిగిందల్లా ఇట్నుంచటూ అట్నుంచిటూ పచార్లు చెయ్యడం పట్టుమని పదినిమిషాలు కూచుని ఓ పని చెయ్యలేవు. నిన్ను గుమాస్తాగా యెందుకు పెట్టుకున్నామో నాకేం అర్థం కాలేదు

శివయ్య (కోపం వొచ్చి) నేను పచారుచేసినా, నడిచినా, తిన్నా, తిరిగినా, గ్రాంఫోను ముట్టుకున్నా దానితో మీకేం సంబంధం లేదు

తరుణ ఏఁవిటా పొగరుబోతుతనం? నాకేం సంబంధం లేదూ! ఈ క్షణఁవే ఇక్కణ్నుంచి గెంటేస్తాను ఈ క్షణఁవే! తెలిసిందా?

శివయ్య తమ మర్యాద నిలుపుకొని మరీ మాట్లాడుతే బాగుంటుంది

తరుణ (కోపంతో) కదలవేం? వెళతావా, వెళ్ళవా? (గుమ్మానికేసి పోతున్న అతన్ని వెంబడిస్తూ) శకునపక్షి! మళ్ళీ కనపడ్డావంటే చూడేంచేస్తానో

(శివయ్య వెళిపోతాడు)

శివయ్య · (లోపల్నుంచి) నీ మీద పరువునష్టానికి దావాపడేసి తీరతాను

తరుణ ఏఁవిటీ, మళ్ళీ వొస్తున్నావు? (తలుపు దగ్గిర వియ్యన్న పడేసిన కఱ్ఱ పుచ్చుకుని) రా చూద్దాం. (కఱ్ఱ విసురుతుంది)

(శేషశాయి ప్రవేశం)

శేషశాయి చాలా సంతోషం.

తరుణ (ఇంకా కోపంతోనే ఉన్నా, దెప్పుతున్నట్లు) పొరపాటు.

శేషశాయి · నీ అతిథి సత్కారానికి కృతజ్ఞుణ్ని

తరుణ . దీనిలో కృతజ్ఞత కేముంది? (నడచిపోతూ చుట్టూ కలయజూచి మెల్లిగా) దెబ్బ తగల్లేదుకద!

శేషశాయి పరవాలేదు. కోడిగుడ్డంత బొప్పి కడుతుందంతే!

(శేషశాయి గారొచ్చారని లోపలినించి కేకలు)

లింగమూర్తి. నా కళ్ళారా అతన్ని చూస్తాను. చెవుల పండువుగా అతని మాటలు వింటాను.

(జయశ్రీ వస్తుంది)

జయశ్రీ · వచ్చావా శాయీ! ఏం యింత ఆలశ్యఁవయింది అన్నయ్యేడీ?

| | |
|---|---|
| శేషశాయి | ఇష్టం కలిసే వచ్చాం వెనకనుంచొస్తున్నారు |
| జయశ్రీ | (ఆందోళనతో) ఏవయింది? వేలం అయిపోయిందా! చెప్పవేం? |
| శేషశాయి | (లోపల సంతోషాన్ని వెలిబుచ్చడానికి సంకోచిస్తూ మథనపడి) నాలుగ్గంటలకే అయిపోయింది మేము రైలు తప్పిపోయాం రెండోబండిదాకా ఆగి పోవలిసొచ్చింది (గట్టిగా నిట్టూరుస్తూ) ఉహ్! కళ్ళు తిరిగిపోతున్నాయి. |
| | (విరించి ప్రవేశం కుడిచేతిలో కొన్ని వస్తువులు - యెడంచేత్తో కన్నీళ్ళు తుడుచుకుంటుంటాడు ) |
| జయశ్రీ | అన్నయ్యా! యేవయింది? తొందరగా తెంచేద్దూ. |
| విరించి | (జవాబు చెప్పకుండా వియ్యన్నకేసి కన్నీళ్ళతో చూసి) ఈ పొట్లాలు అందుకో పొద్దుణ్నుంచి ఒక మెతుకైనా ముట్ట లేదు ఏవియాతనరా బాబూ! ఒళ్ళంతా హూనవై పోయింది వియ్యన్నా! కాస్త యిలారా! |
| | (ఇద్దరూ వెళ్ళి పోతారు) |
| లింగమూర్తి | అమ్మకం మాటేవిటి? వివరాలేవిటో చెప్పండి |
| జయశ్రీ | సంపెంగతోట అమ్మకవై పోయిందా? |
| శేషశాయి | ఆహా! |
| జయశ్రీ | కొన్నవారెవరు? |
| శేషశాయి | నేను |
| | (నిశ్శబ్దం కాస్సేపు) |
| | (జయశ్రీ గుండె పగిలిపోయింది పక్కన కుర్చీకనక లేకపోతే నేలమీద పడిపోవలసింది తరుణ చీరకొంగునుంచి తాళపుచెవుల గుత్తి తీసి గది మధ్యకు విసిరి వెళ్ళిపోతుంది ) |
| శేషశాయి | నేనే కొన్నాను కొంచెం నిదానించండి. అట్టే తొందర పెట్టకండి తల కొంచెం దిమ్ముగా ఉంది మాట సరిగా రాలేదు (నవ్వుతూ) మేం వెళ్ళేటప్పటికి భోగమల్లు అప్పుడే అక్కడున్నాడు విరించిగారి దగ్గర పదిహేనువందలు మాత్రమే ఉన్నాయి తాకట్టు పన్నెండువేలకి సర్కారు పాట ఐదువేలతో ప్రారంభవయింది సాహుకారు ఏడన్నాడు నేను పదన్నాను ఆయన పదిహేనన్నాడు నేను పద్దెనిమిదన్నాను ఆయన ఇరవై అన్నాడు ఇరవై రెండుకి నా పేర పాట ఖాయవై పోయింది సంపెంగ తోట నాది. (నకిలించును) తాగాననుకోండి. మతిపోయిందనుకోండి కలవరిస్తున్నాననుకోండి ఏవయితేనేం. సంపెంగతోట నాది (కాలితో నేలతన్ని) వేళాకోళం చెయ్యకండి నా తాత ముత్తాతలు మళ్ళీ ఈ లోకానికొచ్చి చూడగలిగితే ఉప్పొంగిపోతారు. పొట్ట చీలిస్తే అక్షరం ముక్క లేనివాడు శుద్ధ అప్రయోజకుడని అందరూ అనుకునేవాడు. యీ కళింగరాజ్యానికల్లా అలంకారమైన యీ తోటనేవిటి? కొనడవేవిటి? ఈ తోటలోనే నా తండ్రి తాతలు బానిసలుగా పని చేశారు. నేనిప్పుడు దీనికి యజమానిని. కలయో, వైష్ణవమాయయో, ఇతర సంకల్పార్థమో! (అని గొణుగుతూ తాళపు గుత్తి తీసి) తాళాలు విసిరికొట్టింది అంటే అర్థవేవిటి? ఈ |

యింటి మీద తన అధికారాన్ని వొదులుకుందన్న మాట (తాళపు గుత్తి నాడిస్తూ) అయితే యేం? భజంత్రీలను వాయించమనండి కొలాహలంగా వాయించమనండి మీరంతా తోటలోకి రండి నా గొడ్డలి వ్రేటుకి కొమ్మ, కొమ్మా, చెట్టు, చెట్టూ విరిగిపడుతూ ఉంటే ఆ వైభవం మీరంతా చూడాలి "కన్నులలో పాపగల ఫలంబు!" నిమిషంలో కొట్టివెయ్యడమయిపోతుంది ఆ ప్రదేశమంతా యిళ్లు లేచి అనేక కుటుంబాలకు విహారభూమి అవుతుంది మన పిల్లలు, పిల్లల పిల్లలు దేదీప్యమానమైన నూతన జీవితాన్ని చవిచూస్తారు వాయించండోయి భజంత్రీలు
(భజంత్రీల మేళం జయశ్రీ కుర్చీలో కూలబడి రోదిస్తుంది)

శేషశాయి (ఊరడింపుగా) నా మాట చెవిని పెట్టారు కాదుగదా! పాపం యిప్పుడు వగచి యేం లాభం? (కన్నీళ్ళతో) పెరిగి విరిగితి విరిగి పెరిగితి, కష్టసుఖముల పారమెరిగితి ఏమిటో యీ బ్రతుకు తీరు

లింగమూర్తి ఆమె దుఃఖం పొంగి పొరలిపోతున్నది మనం అలా వెతదాంరండి. (పక్క గదిలోకి తీసుకువెడతాడు)

శేషశాయి వాయించరేం నేటినుంచీ నే నేదంటే అది జరగాలి (దెప్పుగా) సంపెంగతోట కొత్త కామందు ఇదిగో వచ్చాడు (పక్కనున్న బల్లమీద పడి దాని మీది పూలకుండీని పడతోస్తాడు) పగిల్తే పగిలింది ఇంకోటి కొంటాను (లింగమూర్తితో వెళ్ళిపోతాడు)
(అరుణ, అనంతం ప్రవేశం)

అరుణ అమ్మా! అమ్మా! ఏమిటమ్మా యీ వెర్రితనం! మా అమ్మకాదూ! తోట పోతేపోయింది నువ్వు మాత్రం యేడవకు నిర్మలమైన నీ మనస్సు కలత పెట్టుకోకు. రా, అమ్మా! పోదాం. ఈ తోటే అన్న మాటేమిటి? ఇంకో తోట వేయిద్దాం దీనికన్నా అందంగా పెంచుదాం నువ్వే చూదువుగాని మళ్ళీ మంచి రోజులు వచ్చి తీరుతయి నీ కళ్ళల్లోకి వెనకటి ఆనందం మళ్ళీ వెతుక్కుంటూ వస్తుంది అమ్మా! అమ్మా రావూ?

(... తెర .....)

## నాలుగో అంకం

ఒకటో అంకంలోని రంగమే.

కిటికీలకి తెరలు లేవు గోడలమీద పటాలు లేవు ఒకమూల కుర్చీలూ బల్లలూ రాశిగా పడి ఉంటయి అమ్మకానికి సిద్ధపరచినట్లు.

గుమ్మాని కవతలా, రంగస్థలానికి వెనకా, పెట్టెలూ పరుపులూ ప్రయాణానికి తయారయి ఉంటయి.

ఎడంచేతివేపు గుమ్మం తెరిచే వుంటుంది. అందులోనించి అరుణ, తరుణ కంఠస్వరాలు వినిపిస్తుంటాయి. శేషశాయి నిలబడి ఉంటాడు. కొంచెం ముందుగా శివయ్య ఒక పెట్టె సర్ది తాళం వేస్తుంటాడు. రాముడు పళ్ళెంలో మంచినీళ్ళ గ్లాసులు పుచ్చుకుని ఉంటాడు. నేపథ్యాన రైతుల గొంతులు వింటాము. సెలవు తీసుకునేందుకొచ్చారు.

విరించి గొంతు : అలాగే, అలాగే మీరు పొండి

రాముడు : రైతులంతా చెప్పి పోదాఁవని వచ్చారు మంచివాళ్ళే గాని ఒక్కడికీ బుఱ్ఱ లేదు సద్దు అణిగిపోతుంది ముందునించి విరించి, జయశ్రీ వస్తారు జయశ్రీ యేడ్వటం లేదు. ఆవిడ మొహం తెల్లబడి ఉంటుంది మాటాడలేని స్థితిలో వుంటుంది

విరించి : దగ్గిరున్న డబ్బంతా రైతులకి పంచిపెట్టేశావు కాదూ! ఈ అవస్థేఁవిటి? నువ్వలా చెయ్యడఁవేఁవిటి?

జయశ్రీ : ఇంక నా సంసారానికి పొదుపేఁవిటి పోనిద్దూ

(ఇద్దరూ వెళిపోతారు)

శేషశాయి : ఎలాగూ వెళిపోతున్నారు. ఒక్కమాటిలా రండి మీ తోటలోనే కాసిని కొబ్బరినీళ్లు తాగిపోదురుగాని. ఏం? ఎవరికీ అక్కరలేదూ? ఆ సంగతి తెలిస్తే కాయలు దించక పోదును. నాకూ అక్కరలేదు. (రాముడితో) నువ్వు తాగెయ్యి

రాముడు : వెడుతున్న వారికి ఆరోగ్యం. ఉన్నవారికి ఐశ్వర్యం (తాగుతాడు)

శేషశాయి : జ్యేష్ఠమాసం దాటిపోతున్నా ఇంకా వడగాడ్పులు తగ్గనే లేదు పునాదులు వేయించటానికి యిదే మంచి సమయం. (గడియారంవంక చూసి గుమ్మం దగ్గిరికిపోయి) రైలు కింకా నలభై అయిదు నిమిషాలుంది ఇరవై నిమిషాల్లో బయలు దేరితేగాని అందుకోలేం. వేగం కానీండి

(అనంతం ప్రవేశం)

అనంతం : త్వరగా బయల్దేరాలి బళ్ళు సిద్ధంగా ఉన్నాయి. ఈ సందట్లో నా కళ్ళజోడు పారేసుకున్నాను. (తలుపు దగ్గరికి పోయి) జో డెక్కడుందో చూడు అరుణా!

శేషశాయి : వాల్తేరుదాకా నేనూ మీతోనే వస్తాను. ఒక నెల విశాఖపట్నంలో గడపాలనుకుంటున్నాను ఇన్నాళ్ళూ మీ అందరి మధ్యా కబుర్లతో కాలక్షేపఁవయి పోయింది. చేతినిండా పని లేకపోతే నాకేం తోచదు

అనంతం : ఇహ మేము వెళిపోతున్నాం. తమరు నిర్విఘ్నంగా వ్యవహారాలన్నీ లాభసాటిగా నడుపుకోవచ్చు

శేషశాయి : విద్యార్థిగారి ప్రయాణం కలకత్తాకి కాబోలు!

అనంతం : అవును. ఇవాళ మీ అందరినీ స్టేషనుకి దిగబెట్టి ఇక్కడ కొంచెం పని చూసుకుని రేపు బయలు దేరుతాను.

శేషశాయి : ఔనౌను నువ్వొచ్చేదాకా మేష్టర్లు పాఠాలు చెప్పడం ఆపేస్తారనుకుంటా.

అనంతం : ఆ గొడవంతా తమకెందుకు?

శేషశాయి : యూనివర్సిటీ ఉన్నంతకాలం నువ్వక్కడే ఉంటావు కాదూ!

అనంతం : కట్టిపెట్టండి. పాపం యెవ్వరూ నవ్వలేదు. ఇలా చూడండి ఇక మళ్ళీ మనం కలుసుకుంటాఁవో లేదో. వెళిపోయే ముందు నీ హితం కోరి చెబుతా నొక్క మాట విను. అస్తమానం భుజం అలా యెగరెయ్యడం మానేద్దూ, నీ పుణ్యఁ వుంటుంది ఈ బంగళాలు కట్టడం, దాంతో ప్రపంచమంతా మారిపోతుందని కోతలు కొయ్యడం,

అదికూడా ఒక విధంగా భుజా లెగరెయ్యడం లాంటిదే మొత్తం మీద నువ్వు స్నేహపాత్రుడివి నీది మెత్తని మనస్సు నీ చేతులు చూస్తే నువ్వే కళారాధకుడివో, చిత్రకారుడివో ననుకుంటారు.

శేషశాయి (అతన్ని కావిలించుకుని) మన స్నేహానికి కడసారి చిహ్నంగా నీ ఖర్చులకని యీ డబ్బు తీసుకోవూ?

అనంతం డబ్బా? నా కెందుకు డబ్బు?

శేషశాయి అదేంవిటి నీ దగర చిల్లిగవ్వైనా లేదే?

అనంతం లేకేం? తగుమాత్రం ఉంది ఆ పుస్తకం తప్పమాచేసిన బాపతుకొంత ముట్టింది ఇదుగో! (జేబు చూపును) (ఆదుర్దాగా) నా కళ్ళ జోడిక కనబడదేంవిటి చెప్మా

తరుణ నీ భూతద్దాలివిగో తీసుకో

అనంతం మధ్య నీ కెందుకు కోపం? (కళ్ళకి పెట్టుకుని) ఇది నా జోడే కాదు.

శేషశాయి . ఈ యేడు మూడువందల యకరాలూ కంది వేయించాను నాలుగు వేలు నికరంగా లాభంవొచ్చింది ఆ కందిచేలు పూసినప్పుడు చూడాలి, కన్నుల వైభవం! నాలుగువేలు లాభం వచ్చిందన్నాను కమా నువ్వొ నాలుగువందలు తీసుకుంటే నా కదొ లెక్కకాదు ఎందుకలా మూతి ముడుచుకుంటావు రైతుని కాబట్టి కచ్చితంగా చెయితున్నాను తీసుకో

అనంతం మీ తండ్రి రైతు నా తండ్రి ఉద్యోగస్తుడు. దానివల్ల తేలిందేంవిటి? (శేషశాయి తన జేబులోంచి పుస్తకం తీస్తాడు) ఆగాగు నువ్వు ఇరవై వేలిచ్చినా నాకక్కర్లేదు నేను స్వతంత్రుణ్ని లోకంలో పెద్దలూ, పిన్నలూ, ధనికులూ, పేదలూ, దేన్ని గొప్పజేసి ఆరాధిస్తున్నారో ఆ ధనానికి నా మీద లేశమాత్రమూ అధికారం లేదు డబ్బుకి ఖాతరీ చేసే మనిషిని కాను నేను మీ సహాయంగాని, మీ ధనసహాయంగానీ లేకుండా నేను బతగ్గలను నాకు దార్ఢ్యం ఉంది అభిమానం వుంది. మీ ప్రమేయంలేకుండా, నా జీవయాత్ర సాగించుకొగలను ఉత్తమ సత్యాన్ని, ఉత్తమ లక్ష్యాన్ని కాంక్షించే మానవజాతి పురోగమిస్తుంది ఆ సేనలో నేను అగ్రగామిని.

శేషశాయి ఆ గమ్యం యెన్నటికైనా చేరుకోగలవా?

అనంతం నిస్సందేహంగా (కాస్సేపు ఆగి) ఒకవేళ విఘ్నం కలిగినా ఇతరులకి మార్గం చూపించిన వాణ్ణవుతాను

(గొడ్డళ్ళతో చెట్లు నరుకుతున్న చప్పుడు దూరాన వినవస్తుంది)

శేషశాయి రైలుకి వేళవుతోంది ఇంతటితో విరమిద్దాం. ఇలా మనం ఒహాళ్ళమీద ఒహాళ్ళం చిర్రూ బుస్సూ మనుకుంటూ ఉంటే లోకయాత్ర సాగిపోతూనే ఉంది. ఆపకుండా గంటల తరబడి పనిచేస్తూ ఉంటే నా మనస్సు స్థిమితంగా ఉంటుంది. బతికినందుకు ఫలం యిది గదా అనిపిస్తుంది. కాని పనిచెయ్యక కొందరూ, పనిలేక కొందరూ మన దేశంలో యెందరున్నారో ఎవరి కెరుక? సరే దానికేం? అంత మాత్రం చేత ప్రపంచం నిలబడిపోదు... విరించి కేదో బ్యాంకులో పనైందిట. రెండువందలు జీతంట నిలుపుకోవద్దూ ఒళ్లువంచి పనిచెయ్యలేడు.

తరుణ గుమ్మంలోనుంచి మిమ్మల్ని బతిమాలుకుంటోంది. చెయ్యి మీద గొడ్డలి తను వెళ్ళిపోయేవరకూ వెయ్యనివ్వద్దని

అనంతం ఆపాటి మర్యాదయినా తెలియటవయ్యా నీకు?

(వెళ్ళిపోతాడు)

[illegible] ఆపించేస్తాను వెంటనే ఆపించేస్తాను కూలి వెధవలికి ఒకటే తొందర

(అనంతం వెనకనే వెళ్ళిపోతాడు)

తరుణ వియ్యన్నని ఆసుపత్రిలో చేర్పించారా?

రాముడు ఉదయం తీసికెళ్ళమని చెప్పాను ఈ పాటికి తీసికెళ్ళి ఉంటారు

తరుణ శివయ్యా నిన్ను బతిమాలుకుంటాను కాస్త కనుక్కుందూ. వియ్యన్నని ఆసుపత్రికి తీసుకెళ్ళారొలేదొ

రాముడు నేను ఉదయాన్నే చెప్పానంటూంటే అందర్నీ యెందుకమ్మా, యాభై మార్లడగడం?

శివయ్య వియ్యన్న బొత్తిగా ముసలివాడయిపోయాడు. నూరేళ్ళు నిండిన ఈ ముసలి పీనుక్కి మందులేవీ పనిచెయ్యవు. పెందరాళే పెద్దల్లో కలిపెయ్యడం మంచిది అలాటి సౌభాగ్యం నాకే పడితే యెంత బాగుణ్ను (ట్రంకుపెట్టె తీసి టోపీమీద పెడితే అది అణగారిపోతుంది) అదీ వరస! నాకు తెలుసు మళ్ళీ యేదో ములుగుతుందని

రాముడు (వెటకారంగా) తెల్లవారితే పాతిక దురదృష్టాలు నీ ఖర్మం

తరుణ (గుమ్మంలోకి వచ్చి) వియ్యన్నని ఆసుపత్రికి తీసికెళ్ళారా లేదా?

అరుణ ఆఁ తీసికెళ్ళారుట

తరుణ మరి నేను డాక్టరుకి రాసిన ఉత్తరం కూడా తీసుకెళ్ళారు కారేం?

అరుణ · ఇహ పంపించాలి

(వెళ్ళిపోతుంది)

(జానకి సామాను సర్దుతూ ఉంటుంది రాముడు ఒక్కడే ఉంటంచూసి అతని దగ్గరికి పోతుంది )

జానకి గడియలో వెళ్ళిపోతున్నావు ఒకసారి నన్ను కన్నెత్తి చూడవూ? (యేడుస్తుంది )

రాముడు ఎందుకలా యేడుస్తావు? ఇంక నాలుగు రోజుల్లో సిమ్లాలో ఉంటాను ఈ కళింగరాజ్యంలో నేను బతకలేను ప్రాణం చాలొచ్చింది ఎందుకొకటే యేడుపు? కట్టుదప్పి తిరక్కుండా ఉంటే ఏడుపే ఉండదు

జానకి (తలముడి సవరించుకుంటూ) సిమ్లా చేరగానే నాకో ఉత్తరం వెయ్యవూ? నిన్ను నే మరిచిపోలేను నా మనస్సు సుతారంవయింది తర్వాత నీదయ

రాముడు బాగుండదు. ఊరుకో, వాళ్ళొస్తున్నారు

(కూనిరాగంతీస్తూ సామాను సర్దుతుంటాడు)

(జయశ్రీ, విరించి, అరుణ వస్తారు)

విరించి : ఇహ బయలుదేరాలి. వేళ కావచ్చింది

జయశ్రీ : పది నిమిషాల్లో బళ్ళు కదలాలి (గది కలయజూసి) నేను పుట్టి పెరిగిన దివ్య సౌధం. ఇదే కడసారి చూపు. మండు వేసవి గడిచిపోయి శ్రావణ కరి వానలు కురిసేసరికి నీవిక

కనిపించవు. నన్ను నిలిపివేయ్యడు. ఈ యింటి గోడల మధ్య యెన్ని సంఘటనలు జరిగాయి కాదూ! (అరుణ తలను ఆప్యాయంగా నిమురుతూ) నా చిట్టి బంగారుతల్లీ! ఎంత పెరిగిపోతున్నావమ్మా! మరేమి చెంగలేదు కదా!

అరుణ ఏమీ లేదు. మరో జన్మ ప్రారంభమయింది.

విరించి అరుణన్నది నిజం. ఇదో కొత్త జన్మ. సంపెంగతోట అమ్మగారూ ఒకరి మొహంలోనూ కళా కాంతీ లేవు. ఆ కాస్తా అమ్మగారు పోయిపోగానే అందరి హృదయాలూ తేలికయాయి. నేనిప్పుడు బ్యాంకులో ఉద్యోగిస్తున్నా. నా చేతిలో ధనం ఉంటుంది. అనుగున తురుపాసు కలిసినట్లయింది. వెర్రి! నువ్వేమున్నా అను. వెనకటి ఉత్సాహం మళ్ళీ నాలోకి వచ్చేసింది నిస్సందేహం.

జయశ్రీ అవును. నిజమే. ఇప్పుడు నాకు నిద్దర బాగా పడుతున్నది (రాముడితో) సామాన్లన్నీ పైకి పెట్టించు. ఇక కదలకపోతే లాభం లేదు (అరుణతో) మళ్ళీ వేగం వస్తాను అరుణా! ఏమ్మా వెళ్ళిపోతున్నాను. ఋణాలు తీర్చటానికి మీ అమ్మమ్మ పంపించిన పదిహేనువందలతో యెలాగో కాలక్షేపం చేస్తాను. మీ అమ్మమ్మ పుణ్యమా అంటూ నన్ను బతికించింది. అయినా ఎన్నాళ్ళులే!

అరుణ వేగం వచ్చేస్తావు కదూ అమ్మా. నేను కష్టపడి పరీక్ష ప్యాసయి ఏదో చిన్న ఉద్యోగం సంపాయిస్తాను. నీకు సహాయంగా ఉంటాను. మనం ఇద్దరం కలిసి కూర్చుని యెన్ని పుస్తకాలయినా చదువుకుందాం. ఎన్నో కొత్త విషయాలు నేర్చుకుందాం. వేగిరం వచ్చెయ్యమ్మా

జయశ్రీ అలాగే వచ్చేస్తాను తల్లీ! (కావిలించుకుంటుంది)

(శేషశాయి వస్తాడు)

విరించి అందరూ వెళ్ళిపోతున్నారు. తరుణకూడా వెళ్ళిపోతున్నది. ఎవ్వరికీ మా జోలి పట్టినట్టు లేదు.

(లింగమూర్తి వస్తాడు)

శేషశాయి ఏమి దివ్యసుందర విగ్రహమోయి నీది!

లింగమూర్తి (ఆయాసంతో) అబ్బ! ఊపిరాడ్డం లేదు. కాసిని నీళ్ళియ్యండి బాబూ!

విరించి కొంపదీసి మళ్ళీ చేబదులడుగుతాడు కాబోలు! నా మానాన్నే పోతాను (వెళ్ళిపోతాడు)

లింగమూర్తి మీ దర్శనం చేసుకుని యెన్నాళ్ళయింది (శేషశాయితో) మీరూ యిక్కడే ఉన్నారా? ఏం గొప్ప బుర్రండీ మీది. ఇవిగో ఈ నలభై పుచ్చుకోండి. ఇంకా మీకు ఎనభై నాలుగు బాకీ

శేషశాయి (వ్యాకులపడి, భుజాలాడించి) ఇదేదో మాయగా ఉంది. ఎక్కణ్ణుంచొచ్చింది యీ సొమ్మంతా?

లింగమూర్తి అట్టే అట్టే! ఉస్. ఏమి యెండ. ఓ చిత్రమైన విషయం జరిగింది. మొన్న పొద్దున్న కొంతమంది తెల్లదొరలొచ్చి నా భూమిలో పింగాణీ సామాన్లకి పనికొచ్చే మన్నేదో మంచిదుందని కనిపెట్టారు. (జయశ్రీతో) మీ చేతి చలవ. ఇందండి మీరిచ్చిన పాతిక

రూపాయలు (డబ్బిస్తాను) మిగిలింది తరవాత దఖలుచేసుకుంటాను (మంచినీళ్లు తాగుతాడు) ఇంతకు మునుపే ఓ చిన్నవాడు రైల్లో కనపడి అన్నాడు ఎక్కడో గొప్ప గ్రంథంలో చదివాట్ట పరిగెత్తేరైలు బళ్ళల్లోంచి గెంతెయ్యడం మంచిదే అని ఒక గొప్ప వేదాంతి ఉపదేశించాట్ట "గెంతెయ్ దాంతో అన్ని చిక్కులూ తెగిపోతాయి" అరెరెరె ఏం విలవైన సలహా అండి! కొంచెం దాహాని కిప్పించండి

శేషశాయి ఆ తెల్ల దొరలెవరు?

లింగమూర్తి. భూవంతా ఇరవై నాలుగేళ్ళక గుత్తకిచ్చేశాను అదంతా విప్పి చెప్పడానికి కిప్పుడు వ్యవధి లేదు బాకీలన్నీ మెలిమెల్లిగా తీర్చుకొస్తాను మళ్ళీ లక్ష్మివారం నాటికె కలుసుకుంటాను

జయశ్రీ మేము రైలుకి వెడుతున్నాం నేను సిమ్లా పోతున్నాను

లింగమూర్తి. ఏఁవిటీ (ఆందోళనతో) ప్రయాణఁవా? ఔనౌను సామాన్లు, పెట్టెలూ, పరుపులూ, ఓహో, అదా సంగతి! (కన్నీళ్ళతో) ఏం బుద్ధిబలం ఆ తెల్లదొరలకి - సరే వెళ్ళండి శుభస్య శీఘ్రం పెరుగుట విరుగుటకొరకే పరిపూర్ణ సుఖంబు లధిక బాధలకొరకే. ఈ ప్రాణి గుటుక్కుమన్నాడని మీకు కబురందితే నా పేరు చెప్పి ఒక్క నిట్టూర్పు విడవండి. అబ్బ, ఏం ఉక్క మా అమ్మాయి మిమ్మల్ని మరీమరీ అడిగానని చెప్పమంది

(వెళిపోతాడు)

జయశ్రీ ఇహ బయల్దేరొచ్చు నా మనస్సులో రెండు కష్టాలు బాధిస్తున్నాయి ఒకటి యీ వియ్యన్న సంగతి. (చేతి గడియారం చూచుకుని) ఇంకా అయిదు నిమిషాలాగొచ్చు మనం

అరుణ వియ్యన్నని పొద్దుటే ఆసుపత్రికి పంపించారటమ్మా

జయశ్రీ రెండోది యీ తరుణ యేఁవయిపోతుందా అని రోజూ ఒకటే వరసన అదనీ ఇదనీ ఏదో పని కల్పించుకుని తిరుగుతూనే ఉండేది ఇప్పుడేం చెయ్యడానికీ తోచక అల్లాడుతోంది చిక్కి శల్యఁవైపోతోంది (కాస్సేపాగి) నీ పెళ్ళి మాటేఁవిటి శాయీ! మీ యిద్దరూ ఒక యింటివారయితే అంతకన్న కావలసిందేఁవిటి? మీరిద్దరూ కలిసి ఆ మాటేదో తేల్చుకోరేం? (అరుణ చెవిలో యేదో అంటుంది అరుణ వెళిపోతుంది) నువ్వంటే దాని కిష్టం నీకూ దానిమీద అలాగే మరి ఎందుకీ ముభావం? నాకేం బోధపడకుండా ఉంది.

శేషశాయి నాకూ బోధపడడం లేదు నాకేం అభ్యంతరం లేదు మీరు తలుచుకుంటేనే గాని ఆ మూడు ముళ్ళూ పడవు.

జయశ్రీ అయితే ఇహ లేనిదేం? ఇప్పుడే తరుణని పిలిపిస్తాను. తరుణా! వేగిరం ఇలా ఓ మాటు రా! (రాముణ్ణి తీసుకుని వెళిపోతుంది)

తరుణ . (వచ్చి సామాన్లు పరీక్షిస్తూ) చిత్రం యెక్కడా కనిపించదు

శేషశాయి ఏఁవిటి వెతుకుతున్నావు?

తరుణ . ఇప్పుడే యెక్కడో పెట్టాను. జ్ఞాపకం రాకుండా ఉంది

శేషశాయి తరుణా! ఎక్కడికి ప్రయాణమవుతున్నావ్ యివాళ?

తరుణ నేనా? సేవాసదనానికి. అక్కడ నాకు కావలసినంత పని

శేషశాయి ఓహో! పట్నంలోనా? (కాస్సేపాగి) అయితే ఈ యింట్లో పనంతా పూర్తయిపోయినట్టేనాట

తరుణ ఎక్కడ మాయమయింది చెప్మా. పెట్టెలోగాని పెట్టేనా? (శేషశాయితో) ఆఁ ఇక్కడ పనంతా అయిపోయినట్టే. ఇంకేం తరువాయి

శేషశాయి నేనూ వెళ్ళిపోతున్నాను. సొంత పని మీద. పోతివస్తు ప్రయాణాలున్నాయి. ఇక్కడున్న చక్కబెట్టుకోవడానికి శివయ్యని ఉంచిపోతున్నాను. శివయ్య కష్టపడు నా దగ్గర ఉద్యోగం

తరుణ ఎలాగా?

శేషశాయి సరిగా సిమెంటీ వేళకి కొంచెం పల్లమయింది. ఈ యెండంకా పడగాలె తగ్గలేదు. ఇంకా 120 డిగ్రీలు యెండ

తరుణ నాకు గమనం లేదు. (కాస్సేపాగి) థర్మామీటరు పగిలిపోయింది కూడాను

("శాయిగారూ" అని పిలుపు)

శేషశాయి ఇదుగో వస్తున్నాను

(మెల్లిగా వెళ్ళిపోతాడు. తరుణ పక్కనున్న మూటపై తల ఆనించుకుని కూర్చుంటుంది. రోజు పోయింది. ఏడుపు తెరుచుకుంటుంది. జయశ్రీ మెల్లిగా లోపలికొస్తుంది)

జయశ్రీ అహ్! (కాస్సేపాగి) ఇక బయల్దేరక తప్పదు

తరుణ (ఏడుపు మానేసి కళ్ళు తుడుచుకుంటూ) వేళయిందమ్మా. నేను కూడా సాయంకాలానికి చేరుకుంటాను సేవాసదనానికి బండి తప్పిపోకుండా వుంటే

జయశ్రీ (గుమ్మం దగ్గరికిపోయి) అరుణా! నీ ముస్తాబయినట్టేనా?

(అరుణ, విరించి, శివయ్య వస్తారు)

జయశ్రీ అమ్మ, ఇంక ప్రయాణం కావచ్చు.

అరుణ (ఆనందంతో) ప్రయాణం కావచ్చు!

విరించి మిత్రులారా! బంధువులారా! ఈ మందిరాన్ని శాశ్వతంగావిడిచి పెట్టి పోతున్నాంగదా! ఈ సమయంలో నా హృదయంలో పొంగిపోయే భావాలను పైకి వెళ్ళబోసుకోకుండా ఎలా వుండగలను?

అరుణ (వెంటనే) మొదలెట్టావూ మాఁవయ్యా!

తరుణ మాఁవయ్యా! అవన్నీ తలచుకొని యేం లాభం?

విరించి (విషణ్ణవదనంతో) తురుపులన్నీ పోయి పొడిముక్కలు మిగిలాయి ఇక నేను నోరెత్తవలసిన పని లేదు

(అనంతం, శేషశాయి వస్తారు)

అనంతం ఇంకా బయల్దేరరేం?

శేషశాయి శివయ్యా! నాకో టిలా తే!

జయశ్రీ ఒక్కక్షణం కూర్చుంటాను ఈ గోడలూ, కిటికీలూ కొత్తగాచూస్తున్నట్టుంది. ఎంత చూసినా తనివితీర లేదు.

విరించి	ఈ కిటికీ దగ్గరే కూర్చుని పెళ్ళప్పుడు నేను నాన్న తలపాగా చుట్టుకొని పైకెళ్ళడం చూస్తుండేవాణ్ణి

జయశ్రీ	సామాన్లన్నీ బళ్ళలో వేసినట్టేనా?

శేషశాయి	అన్నమాటే (కోటు తొడుక్కుంటూ) శివయ్యా ఇల్లంతా జాగర్తగా చూసుకో

శివయ్య	చిత్తం

జయశ్రీ	మనంవంతా వెళ్ళిపోతున్నాము ఒక్క పురుగు కూడా యిక్కడుండదు

శేషశాయి	బంగళాలు లేచిందాకా

తరుణ	ఇవిగోనయ్యా! నీ భూతద్దాలూ ఈ మూల కనబడ్డాయి

అనంతం	అమ్మయ్య! (కళ్ళకు పెట్టుకుని) రండి పోదాం

విరించి	రైలూ స్టేషనూ - కొత మీద కోత

శేషశాయి	అంతా వచ్చేశారా? ఎవరూ లోపల లేరుగద తాళాలు వేసెయ్యాలి పదండి పదండి!

తరుణ	ఈ యింటితో రుణం తీరిపోయింది ఇక్కడి బతుకింతతో సరి

అనంతం	పాతబతుక్కి భరతవాక్యం కొత్తబతుక్కి నాంది!

(అరుణతో అనంతం వెళిపోతాడు నలుమూలలా కలయజూసి తరుణ మెల్లిగా వెళిపోతుంది రాముడూ వెళతాడు)

శేషశాయి	అందరికి నమస్కారం

(వెళ్ళిపోతాడు)

(జయశ్రీ, విరించి మాత్రం ఉండిపోతారు)

(ఇద్దరూ కంట తడిబెట్టుకుంటారు)

విరించి	(కలవరపాటుతో) చెల్లీ చెల్లీ!

జయశ్రీ	నా సంపెంగతోట బంగారు పూలతోట నా యవ్వనం, ఆనందం, అన్నిటితోనూ ఋణానుబంధం తెగిపోయింది

అరుణ	(బయటనుంచి) అమ్మా!

అనంతం	(ఆనందావేశాలతో) ఏయ్యే!

జయశ్రీ	ఈ గోడలవంక, యీ కిటికీల వంక ఒక్క కడసారి చూపు! మా అమ్మ యీ గదిలో ఇటూ అటూ మెసలుతూ ఉండేది

అరుణ	అమ్మా!

అనంతం	ఏయ్యే!

జయశ్రీ	వచ్చె

(అంతా వెళ్ళిపోతారు)

(రంగస్థలం ఖాళీగా ఉంటుంది తలుపులకి తాళాలు వేసిన చప్పుడూ, ఆ తరవాత బళ్లు కదిలిన అలికిడి వినవస్తుంది నిశ్శబ్దంగా ఉంటుంది ఆ ప్రశాంతిలో యెక్కడో ఒక చెట్టును గొడ్డలితో నరికినట్లు, విషాదకరంవయిన ధ్వని ఒక్కటే వినవస్తుంది అడుగుల సవ్వడి వినవస్తుంది కుడి వైపున గుమ్మంలో వియ్యన్న కనబడతాడు గొంగళి కప్పుకుని ఉంటాడు అతనికి సుస్తీగా ఉంది

# సంపెంగతోట వివాదం గురించి

1943 44లో శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు 'నాట్యగోష్ఠి' అనే ఉద్యమంలో ఒక శాఖగా 'నటాలి' అనే నాటకసంఘం ఒకటి స్థాపించారు. అందులో నేనూ, నారాయణబాబూ కొంతకాలం పనిచేశాం. కొత్తపద్ధతుల మీద ప్రదర్శింపదగిన నాటకాలు మాచేత రాయించాలని రామకృష్ణరావుగారి ఉద్దేశం. ప్రఖ్యాతమైన పాశ్చాత్య నాటకాలను తెలుగు రంగానికి తీసుకు రావాలని కూడా ఆయన అనేవారు.

ఆ రోజులలో రామకృష్ణరావుగారూ నేనూ చెరొక స్వతంత్ర నాటకం రాయాలనుకున్నాము. చెహోవ్ నాటకం 'The Cherry Orchard' ను నారాయణ బాబూ, చెహోవ్ వ్రాసినదే ఇంకొక నాటకం Uncle Vanya ను అబ్బూరి వరద రాజేశ్వరరావూ తర్జుమా చెయ్యాలనుకున్నారు. నేను "భాగ్యలక్ష్మి" అనే నాటకం ప్రారంభించాను. నారాయణబాబు The Cherry Orchard ను అనువదించి రామకృష్ణరావుగారికి అందజేశాడు. నారాయణబాబు రాసింది ఆయనకు నచ్చలేదు.

రామకృష్ణ రావుగారూ, నేనూ కలిసి The Cherry Orchard ను తిరిగి అనువదించాలనుకున్నాము. రష్యన్ పేర్లే ఉంచి రష్యన్ వాతావరణంతో నాటకం వేస్తే బాగుంటుందని నేనన్నాను. ఇప్పట్లో ఇది అసాధ్యమని రామకృష్ణరావుగా రన్నారు. The Cherry Orchardను adapt చెయ్యడమే మంచి దన్నారు. తనకు తీరిక లేనందున ఆ భారం నా మీదనే వదిలి వేశారు.

The Cherry Orchard నూ నారాయణబాబు అనువాదాన్నీ రామకృష్ణరావుగారి సలహాలనూ తీసుకొని తెలుగు రంగానికి adapt చెయ్యడమే అప్పటి నా కర్తవ్యం. ఉద్యోగ ధర్మంగా ఆ పనికిగాను పూనుకున్నాను. అదైనా రెండు అంకాలు మాత్రమే నేను వ్రాసినవి. తర్వాత 'నటాలి'తో నాకు సంబంధం పోయింది.

నా కంటే ముందుగా నారాయణబాబు 'నటాలి' నుంచి తప్పుకున్నాడు. తన అనువాదాన్ని తనతో తీసుకుపోయాడు.

నాలుగేళ్లు గడిచాయి. ఇటీవల వరదరాజేశ్వరరావు "సంపెంగతోట" నాటకం తాను పూర్తి చేశాననీ, (సగం నా తర్జుమా కాబట్టి) నాపేరు కూడా వేసి దాన్ని ప్రకటించదలచుకున్నాననీ, బెజవాడనుంచి నాకు ఉత్తరం రాశాడు. నేను నా అంగీకారాన్నతనికి తెలియజేశాను.

పుస్తకం అచ్చయి వచ్చింది. దాన్ని చూసి నారాయణబాబు ఒళ్లు మరిచిపోయి, అనేకుల దగ్గర తన నాటకాన్ని మేము మక్కీకి మక్కీ తస్కరించి ముందుగా అచ్చు వేశామని చెబుతూ నన్నూ, రాజేశ్వరరావునూ నానా దుర్భాషలతో తూలనాడాడు. (దరిమిలాను నాతో నారాయణబాబు ఇందుకు తన విచారాన్ని వెలిపుచ్చాడు.)

నారాయణబాబును నేను ముఖస్థంగా కలిసినప్పుడడిగితే "పుస్తకం అంతా కాపీ అనలేదు. కొన్ని భాగాలు కొట్టేశారన్నా"నని అన్నాడు. "అవేవో చూపిస్తావా" అని అడిగితే ప్రస్తుతం "సంపెంగ తోట" (అచ్చు ప్రతి) తన దగ్గర లేదన్నాడు.

నారాయణబాబు అనువాదం తెనాలి నుంచి వస్తున్న "జ్యోతి" పత్రికలో ధారావాహికంగా వెలువడుతోంది. మా పుస్తకం అచ్చయి వుంది. రెండింటినీ చూచిన కుటుంబరావు వంటి వారు

[illegible] వాళ్ళని ఒకసారి చూసి మరి మాట్లాడ మంటాను

ఇప్పుడు నారాయణబాబు మా అనువాదంలో లేని 'వాక్యాలు' కొన్ని రాస్తాయనే దాకా దిగి వచ్చాడు

ఇప్పుడు ముద్రకు ఇదే 'సంపెంగతోట' కథ విషయం తెలియని వారెవరైనా వాదించవచ్చును తెలియని వారికి నచ్చచెప్పవచ్చును తెలిసి తెలియక ఎగబడే వాళ్ళని చూసి జాలి పడాలి (ఈ భావానికి నేను ధర్మహరికి కృతజ్ఞుణ్ణి)

నారాయణబాబు రచనని, [illegible] అనువాదాన్ని [illegible] ప్రచురించుకోవడమే గొప్ప అనుకునే స్థితికి నేను రాలేదు ఎప్పుడూ రాను నేను చెయ్యని పనికి నాపేరు (ఏమి అక్షరాలైతేనేం, పాడి అక్షరాలైతేనేం) వేయవిచ్చి డబ్బు చేసుకొనే నీచపు పని ఇప్పటికి లేదు ఎప్పటికీ ఉండదని ప్రతిజ్ఞ చేస్తున్నాను ఈ మాట "ట్యానర్" అనే అచ్చు తప్పు పేరిట "ట్యూనర్" అనే విమర్శకుడి ఆత్మకు శాంతి కలిగించును గాక ఇక, అసత్యారోపణలతో, అసభ్య ప్రలాపాలతో, రోగగ్రస్తమైన మనస్తత్వం వల్ల తమకంటె అధికులను తిట్టడంలోనే ఆధిక్యం ఉందని భ్రమపడేవారి రచనలతో వెలువడే కొన్ని "కుక్క కొడుకు" పత్రికలకి ప్రత్యేకంగా నేనివ్వవలసిన సమాధానం ఏదీ లేదు

'నవోదయ' వారపత్రికలో వారం -వారం శీర్షికక శ్రీశ్రీ లేఖ
ముద్రణ డిసెంబరు 1947?

★ ★ ★

## శ్రీరంగం నారాయణబాబులేఖ

తమ్ముడూ శ్రీశ్రీ,

నీవు 'నవోదయ'లో 'సంపెంగతోట' అని రాసిన శీర్షిక చదివాను. నీవు, శ్రీ వరదరాజేశ్వరరావు కలిసి నా సంపెంగతోట అచ్చు వేసిన పుస్తకం మొదట నా కంటబడిన నాటికంటె ఎక్కువ విచారపడ్డాను. ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చుదమన్న ప్రయత్నంకోసం అరవై అబద్ధాలు ఆడవలసి వచ్చింది మనిషి కనుపాపకు నల్లదనం ఉంటుంది కాని న్యాయంకంటికి ఉండదని తెలుసుకోలేకపోయావు

శ్రీ రామకృష్ణరావుగారు నా అనువాదంలో సంభాషణలు పెద్దవవటం నుంచి కత్తిరించి చిన్న మార్పులు రంగస్థలంమీద ఆడుకుందికి అనువుగా ఉండటానికని చేస్తామన్నారు. అందుకు నేను అంగీకరించాను పేర్లు మార్చి రెండంకములే మార్పులు చేశారు ఈ మార్పులు నీతో చెప్పి చేయించారు అంతేగాని అందులో నీది స్వంత అక్షరం ఒకటికూడా లేదు

నాకు Cherry Orchard అనే గ్రంథం అనువాదాని కిచ్చినప్పుడు నీకు Bread అనే నాటకం అనువదించమని యిచ్చారు నీవు దాన్ని అనువదించలేకపోయావు. నిన్ను వారు నిరోధిస్తే, మన

సాహిత్యలోకానికి ఉపయుక్తంగా లేదన్నావు అప్పుడు శ్రీ రామకృష్ణరావుగారు కథ అచ్చు తెనుగులో ఫాస్టర్ ఉన్నది వాళ్ళ ఒక అంకం నాటకంగా రాసి తక్కినది నిన్ను రాయమన్నారు అప్పుడు కూడా రాయలేనని నీ అశక్తిని వెల్లడి చేశావు నీకిచ్చిన నాటకాన్ని రాయలేని నిన్ను శ్రీ రామకృష్ణరావుగారు నా నాటకాన్ని అనువదించమన్నారు లోకం కంటిలో దుమ్ము జల్లగలవు కాని, నిన్నూ నన్నూ తెలిసిన శ్రీ రామకృష్ణరావుగారి కంటిలో జల్లగలవా?

నేను 'సవాలి' నుండి తప్పుకోక ముందే జరగవలసిన తస్కరణ జరిగింది (అప్పటికి తస్కరణ అని అనేందుకు వీల్లేదు)

సరే వరదరాజేశ్వరరావుగారు వారి పేరుతో నీ పేరుకూడా జత చేసి పుస్తకం ప్రకటిస్తామని రాశారు వారు నీ పేర రాశాక మనం యెన్నోమార్లు కలిశాం నీకంటె అన్నిట్లోనూ పెద్దవాణ్ని, సాటి రచయితనూ, సంపెంగతోటకు అధికారినని కాక పోయినా, పెద్దమనిషి తరహాకైనా నీవు నాతో అన్నావా? ఇంతకు దొంగతనం చెసె వాడు చెప్పి చేస్తాడా?

నేను ఎప్పుడూ ఒళ్ళు మరచి దుర్భాషలాడలేదు భాష వర్తనమీద ఆధారపడి ఉంటుంది నా వర్తన లొకానికి తెలుసు నీ విషయంలో విచారపడ్డాను. నీకు వచ్చిన అపయశస్సుకు తోడు హానికూడా సంభవిస్తుందని నేను తగిన చర్య తీసుకుంటానని నాతో కొందరు న్యాయవాది స్నేహితులు అనడంనుంచి, విచారపడ్డాను మెత్తపడ్డానుకూడాను నీ వర్తనకు కాదు నీలో నాలో ప్రవహించె రక్తం ఒకటై ఉండటం నుంచి

మీ పుస్తకం ప్రకటించే సరికి నా పుస్తకం 'జ్యోతి'లో ప్రకటింప బడుట జరగలేదు నేనెన్నడు నా పుస్తకాన్ని శ్రీ కుటుంబరావుగారిక్ చదివి వినిపించనూ లేదు రెండూ ఒకటి కావు అని వారు ఎల్లా చెప్పగలిగారో? బహుశా వారికి దివ్య దృష్టి ఉందేమో?

నేరానికి పరిమితి యింత అని ఉండదు శిక్షాస్మృతి కోసం ఒక పరిమితిని కల్పించారు కాని, నీవు చేసినది పరిమాణం చిన్నదే అయినా పచ్చి దొంగతనం అని పండితులు, న్యాయవాదులు, దిన, వార పత్రికా సంపాదకులు కూడా నాతో అన్నారు ఒకరు అనడమేమిటి లోకమే కోడై కూస్తూ ఉంటే.

నా రచననుండి తస్కరించినా హానిచేద్దామని తలచి చేయలేక పోయావు నీవు చేసిన దురాక్రమణ, భాషాసతిని బలిమిని చెరపట్టటం నేటివారే కాకుండా, సాహిత్యలోకంలో భావియుగం వారుకూడా చెప్పుకొంటారులే. ఇది నీకు తీరని కళంకం

ఈ గ్రంథచౌర్యం చేయడంవల్ల నీకు ముట్టినవి అక్షరాల మూడు పదులని నీవు నాతో అనలేదా?

మా లాయరుగారైన శ్రీ పూడిపెద్ది సోమేశ్వరరావుగారితో నీవు నాకు వ్రాత మూలకంగా క్షమాపణ రాసియిస్తానని ఒప్పుకోలేదా?

యిప్పటికైనా చేసిన తప్పు ఒప్పుకొని కీర్తితో మను యుద్ధంలో కోర్టులో వావి వరసలు గణనకు రావు అంటుకుంటే పరమేశ్వరుడు ఆర్పలేడు. ఆలోచించుకో

సాటి రచయిత,

నీ అన్న,

శ్రీరంగం నారాయణబాబు

ముద్రణ : నవోదయ 1948 జనవరి?

# అబ్బూరి రామకృష్ణారావుగారి లేఖ

శ్రీనివాసరావుగారూ!

మీ ఉత్తరమూ, అందుతో పంపిన సమాధానంలోని మీ సంపెంగతోట విమర్శా శ్రీ నారాయణబాబు గారిజవాబూ - అన్నీ శ్రద్ధతో చూశాను. Speak out the truth - Give the facts అని మీరు వ్రాశారు. నా వద్దనుంచి మీకు సత్యమే కోరడం బాగానే వుంది కాని, యీ సత్యవాక్యం యిలాంటి వివాదంలో పడి స్వరూపం కూడా గోచరం కాకుండా నలిగిపోవడం పరిపాటి. మన మందరమూ తలపెట్టిన నాటకాలేవీ కొనసాగకపోగా తుదకీ వీధినాటకంలోకి దిగవలసివచ్చింది కదా అని విచారిస్తున్నాను.

మనం ముగ్గురమూ ఒకప్పుడు స్నేహభావంతో కలిసిమెలిసి పనిచేసిన వాళ్ళం కాబట్టి, రామప్పంతులన్నట్లు "అతని పిలక నేనూ, నా పిలక అతనూ లాగినా పర్వాలేదు" అనే దృష్టితో యీ వాదం పరిష్కారం చేసుకోవాలని నా సలహా. కాని గ్రంథ చౌర్యంమాట మాత్రం చాలా అసంబద్ధం.

ఎందుకంటే, అసలీ అనువాదానికి కారణం "నటాలి" ప్రోద్బలం. ఎలాగైనా యీ నాటకాన్ని ప్రయోగించటానికి యోగ్యంగా తయారుచేయటమే అప్పటి మన లక్ష్యం. నాచే నియుక్తులై యీ లక్ష్యం సాధించడానికి పూనుకొన్న వారందరూ దీనికి కర్తలే అనాలి. ఈ విధంగా నలుగురూ కలిసి చేయదలచిన పనిలో చౌర్యాని కవకాశం యెలా వుంటుందో నాకర్థం కావటం లేదు.

మీ "సంపెంగతోట" అనే గ్రంథనామమూ, వివిధ పాత్రలకు పెట్టిన తెలుగు పేర్లూ, కొన్ని సన్నివేశాలలో చేసిన మార్పులూ - ఇందులో యేవీ నారాయణబాబుగారు కూర్చినవి కాదుకదా! పైగా యీ విషయాలను గురించీ, అనుసరించ వలసిన అనువాద పద్ధతిని గురించీ, మనలో తర్కవితర్కాలు జరిగిన తరువాతనే కదా వారి అనువాదం ప్రారంభమైనది.

వారి అనువాదం నాకు నచ్చకపోయిన మాట నిజమే. అంత మాత్రాన వారి గౌరవానికిగాని, వారి రచనా ప్రాశస్త్యానికిగాని యేమీ లోటు రాబోదు. నా పోరు పడలేక అతి వేగంగా వ్రాయటంగాని, వారన్నట్లు సంభాషణలు బిగువుగా లేకపోవడం గాని, వారి రచనలోని సౌందర్యాన్ని ఆస్వాదించగలిగిన సహృదయత నాలో లేక పోవడంగాని నాకు నచ్చకపోవడానికి కారణం కావచ్చు. ఏది యెలా ఉన్నా ఆ అనువాదాన్ని సంస్కరించడానికి - పోనీ - మార్చడానికి మీరూ నేనూ రెండు, మూడు రోజులు ప్రయత్నం చేశాం. ఆ ప్రయత్నం ఫలప్రదం కాదని తోచి మిమ్ములను స్వయంగానే అనువాదం చేయమన్నాను. మీరలా చేసి అసంపూర్ణంగా విడిచిన వ్రాత ప్రతి మొన్న మొన్నటిదాకా -వరద రాజేశ్వరరావు పూర్తిచేసి ప్రకటించటానికి తీసుకుపోయే వరకూ - నా దగ్గరనే భద్రంగా ఉంచాను.

ఇక్కడ ఒక మాట చెప్పాలి. తమ ఉద్యోగానికి సంబంధించిన నిర్దిష్టధర్మం గానూ, మన నలుగురి సంప్రదింపుల ఫలితంగానూ నెరవేర్చిన శ్రీ నారాయణబాబుగారి అనువాదం 'నటాలి' సొత్తే అయినా, వారు తమపేర ప్రకటించుకో దలుచుకొంటే నా కభ్యంతరం లేదని మాట మాత్రం యిచ్చాను.

ఇంతకూ ఈ అనువాదాల స్వభావాన్ని పరిశీలిస్తే ఒక విషయం విశదమవుతుంది. మూలం ఒకటే అయినప్పుడు భిన్న భిన్న అనువాదాలలో పదాలలో వాక్యాలలో యేమీ భేదం లేకుండా

నిష్పక్షపాతంగా బయటపడుతుంది Ibsen నాటకాల ఆంగ్లానువాదాలను చూడండి William Archer చేసిన మొదటి అనువాదానికి తక్కిన వాటికి యెలాటి సామ్యం వుందో తెలుస్తుంది ఈ పోలికలను గ్రంథ చౌర్యమని యెవరైనా అనగలరా?

కర్తగారి ఉపకర్తగారి స్వతంత్ర రచనలను ఆశ్రయించి వుంటుంది ఈ అనువాదాన్ని గూర్చిన వివాదం చాలా చిల్లర విషయం ఇంత రాద్ధాంత మెందుకు? పైగా యీ శుష్కవివాదాన్ని "భావియుగంవారు కూడా చెప్పుకుంటారు" అనుకోటం ఒక విచిత్రమైన భ్రమ

మీరన్నా నారాయణబాబుగారన్నా నాకు సమానమైన స్నేహభావమే కాని సాహిత్యదృష్టిలో మీ రచనలంటే నాకెక్కువ అభిమానం మీ కవితాభావం ఎలా ఉన్మీలితమయినదీ యేవిధంగా పరిణతి పొందుతూ వచ్చినదీ నేను బాగా యెరుగుదును దానికి కొంత దోహదం నేను కూడా చేశాననుకుంటాను మీ రచనలలో ఉన్న సంస్కారమూ పుష్టి అనేకులలో మృగ్యం నేటికాలపు వాఙ్మయంలో మీ కృతులు ఉత్తమోత్తమ శ్రేణికి చెందినవని నా అభిప్రాయాన్ని అడిగిన వారికీ అడగనివారికీ చెబుతూ వచ్చాను అలాంటి మిమ్మును Krishon వ్రాసిన Bread అనే నాటకాన్నిగాని, యే యితర గ్రంథాన్నిగాని అనువాదం చేయుటానికి నియోగించి అందువల్ల నేను అసంతృప్తి చెందటంగాని, మిమ్ములను నిరోధించటం గాని యెలా జరుగుతుంది? మీ సామర్థ్యాన్ని శంకించటానికి నేనెంతటి వాణ్ణి? నిజానికిఆరోజులలో అనేక యితర వ్యాపకాలలో మునిగి ఉండడం చేత మీ వల్లా శ్రీ నారాయణబాబుగారి వల్లా పొందవలసిన సహాయాన్ని పొందలేకపోయాను

అనవసరంగా కలహాన్ని పెంచవద్దని నా మనవి నారాయణబాబుగారు "అనేకుల దగ్గర" యేవన్నారో నేనెరుగను వారం వారంలో మీరు వ్రాసిన వ్రాత కొంత దూకుడుగా ఉండటం వల్ల వారికింత కోపం వచ్చి ఉంటుందనుకుంటాను

*ముద్రణ నవోదయ 1948 ఫిబ్రవరి 8*

పునర్ముద్రణ· 1970 శ్రీశ్రీ సాహిత్యం (రెండు) వచన విభాగం

★ ★ ★

## అబ్బూరికి శ్రీశ్రీ లేఖ

Madras
22-1-48

Dear Master garu,

I have shifted from 528 Parry's Road to Adyar . Hence this delay in replying your two letters. I am giving you my present address overleaf I shall be glad if you send me the into mss.

I have given your letter to be published in toto. I myself have refrained from ssuing any statement, in the hope that your letter is sure to have a medicinal effect on NB. He is at present in Vizianagaram. I don't know when he'll be coming here.

Hoping this letter will find you & yours in good cheer

Yours Sincerly
SriSri

# అమ్మ

రచన

కారల్ చాపెక్



# రెండవ ముద్రణకు తొలిపలుకు

అమ్మ అనే ఈ నాటకాన్ని రచించిన కారల్ చాపెక్ సుప్రసిద్ధ చెకొస్లొవాక్ రచయిత మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత అతడు దీనిని రచించాడు రెండవ ప్రపంచ యుద్ధానికి ముందే ప్రచురించాడు ఇంగ్లీషులోనికి అనువదించబడిన ఈ నాటకాన్ని చదివిన వెంటనే దీనిని తెనిగించాలన్న ఉత్సాహం నాకు కలిగింది ఒక కథగాని, గీతంగాని నాటకంగాని ఎంతగానో నన్ను ఆకర్షిస్తేనే తప్ప దాన్ని నేను అనువదించను అంతగానూ తెలుగు పాఠకుల నది ఆకర్షిస్తుందని నా విశ్వాసం ఎందుచేతనంటే దీని ఇతివృత్తం చెక్ దేశానికిగాని ముప్పది నలుబదేళ్ళనాటి కాలానికిగాని పరిమితమైనదికాదు అందువల్లనే ఇందలి పాత్రలన్నిటినీ తెలుగు పేర్లతో పరివర్తన చెయ్యటం నాకు సాధ్యమయింది పేర్లను కూడా మార్చి చేసే అనువాదం అనుసరణ మాత్రమే అవుతుంది అలా చేస్తే మూల గ్రంథంలోని వాతావరణాన్ని కూడా మార్చవలసి వస్తుంది ఈ విధమైన ఇబ్బంది నాకీ గ్రంథంలో కలగకపోవడానికి కారణం ఇందలి బలిష్ఠమైన సార్వకాలికమైన ఇతివృత్తమే!

ఈ నాటకం రంగస్థలంమీద రక్తికడుతుందనడానికి నాకెట్టి సందేహమూ లేదు అయితే దీన్ని ప్రదర్శించడానికి ఆధునిక సాంకేతిక సదుపాయాల అవసరం చాలా ఉంది అవి ప్రతిపట్టణంలోనూ లభ్యమయే పరిస్థితులింకా మనకు ఏర్పడలేదు. ఈ ఒక్క నిదర్శనమే చాలు సామాజికంగా మనం ఎంత వెనుకబడి ఉన్నామో చాటిచెప్పడానికి. ఈనాటి మన నాటకరంగాన్ని చూస్తే, ఇంకా మనం ఇరవయ్యో శతాబ్దంలోనికి ప్రవేశించడానికి ఎంతకాలం పడుతుందో అని ఆవేదనగా ఉంది

ఫరవాలేదు ఇది చదువుకొని అయినా తెలుగువారు సంతోషిస్తే అది చాలు నాకు మన నటీనటుల నటనాసామర్థ్యంలో నాకు అకుంఠిత విశ్వాసం ఉంది కాని ఆ సామర్థ్యాన్ని తెలుగులోనికి తెచ్చే ఆధునిక నాటకరంగం రూపుదాల్చలేదనే నేను పరితపిస్తున్నాను

ఈ నాటకాన్ని యెప్పుడైనా, ఎవరైనా ప్రదర్శించవలసిన విధంగా ప్రదర్శిస్తే ఒక్క విషయాన్ని మాత్రం గుర్తుంచుకోవాలి ఇది నేను కోరుకున్నది కాదు. ఒక చిన్న ఉపోద్ఘాతంలో, చాపెక్ స్వయంగా దీన్ని స్పష్టీకరించాడు అదేమంటే : ఇందులో బ్రతికున్నవారూ, చనిపోయినవారూ రంగంమీదకి వస్తారు. అయితే చనిపోయినవారు దయ్యాలుగానీ, ప్రేతాత్మలుగానీ కారు `అమ్మ'' దృష్టిలో వారంతా బ్రతికే ఉన్నారు. అమ్మ రంగస్థలంమీద ఉన్నప్పుడే వాళ్లూ వస్తారు మామూలు మనుష్యుల్లాగే వస్తారు. అమ్మ కాక మరే బ్రతికున్నవాళ్ళు రంగంమీద ఉన్నా వాళ్ళుండరు ఆమె హృదయంలో వాళ్ళు జీవించే ఉన్నారని దీని అర్థం

ఈ నాటకాన్ని ప్రదర్శించదలచిన వాళ్ళెవరూ నా అనుమతి తీసుకొనక్కర లేదు ఫలానా చోట, ఫలానాపూట ప్రదర్శిస్తున్నామని తెలియజేస్తే సంతోషిస్తాను నా చిరునామా

శ్రీశ్రీ, 11, కెనాల్ బ్యాంక్ రోడ్డు, రాజా అన్నామలై పురం, మద్రాసు - 28

చాలా కాలం క్రిందట అరుణ రేఖా పబ్లికేషన్సువారు ముద్రించగా, చాలాకాలం నించీ out of print గా ఉండిపోయిన ఈ నాటకాన్ని మళ్ళీ సోషలిస్ట్ ప్రచురణాలయంవారు ప్రకటిస్తున్నారు వారికి నా కృతజ్ఞత.

విజయవాడ,
10-9-1966

శ్రీశ్రీ

*ప్రథమ ముద్రణ 1952*

*ద్వితీయముద్రణ, సోషలిస్టు పబ్లికేషన్సు ఏప్రిల్ 1967*

# అమ్మా

(శాస్త్రిగారి గది కిటికీలన్నీ బాగా తెరుచుకొని ఉంటాయి. సుబేదార్-మేజర్ యూనిఫారంలో శాస్త్రిగారి చిత్తరువు ఎదురుగుండా గోడమీద వేలాడుతూ ఉంటుంది. దానికి ఇటుపక్కలా ఈటెలూ, కత్తులూ, తుపాకులూ ఏర్పాటైన పెద్ద పులుల తలలూ, ఏనుగుల తలలూ జింక తలలూ ఉంటాయి. మిగిలిన గోడలకి మేకేసుంటూ తివాసీలూ పులి చర్మాలూ మాదిలా ఉంటాయి. మొత్తంమీద గది అంతా మొగాళ్ళ వస్తువులతో క్రిక్కిరిసి ఉంటుంది. ఒక రాతి బల్లమీద నిఘంటువులు, ఒక భూగోళం, పైపులు, పేపర్ వెయిట్లు మొదలైనవి ఉంటాయి. ఒక సోఫా, మూడు నాలుగు రకాల కుర్చీలు పొట్టి బెంచిలూ, దానిమీద చదరంగపు బల్ల, ఇంకో చిన్నబల్లా దానిమీద గ్రామఫోను పెట్టె, బట్టల బీరువా దానిమీద మిలిటరీ టోపీలూ, శిరస్త్రాణాలూ అక్కడక్కడ చెదురుగా నీగ్రో శిల్పపు బొమ్మలు, కాలనీలనుంచి తెచ్చిన రకరకాల వింత వస్తువులు కాని, చూడగానే గదిలోని వస్తువులన్నీ పాతకాలపు సామగ్రులని తెలుస్తుంది. ఇదేదో మ్యూజియంలా వుంది గాని యిందులో ఎవరూ నివసించేటట్టు లేదు.

ఆఖరికొడుకు సింహం (చిట్టి) సోఫామీద పడుక్కొని కాలి ముణుకులమీద గడ్డం ఆనించి ఒక పెద్ద పుస్తకాన్ని పాదాలకి దన్ను పెట్టి దానిమీద ఒక కాగితంవుంచి ఏదో రాస్తూ వుంటాడు. రాసింది తగ్గుస్థాయిలో చదువుతూ ఒక చెయ్యి గాలిలో లయ వేస్తూ వుంటాడు. తల ఊగించి రాసిందాంట్లో కొంత కొట్టి వేసి మళ్ళీ రాసి పాడుతాడు.)

సింహం — సుహాసినీ
అజ్ఞాత విలాసినీ
అంధకార గుహాంతరాళ నివాసినీ
(రామన్న ఈలవేస్తూ ప్రవేశిస్తాడు)

రామన్న — చిట్టీ? ఏమిటి తెగ రాసేస్తున్నావ్? (నిర్లక్ష్యంగా రాతబల్లదగ్గరకు నడచి గ్లోబ్‌ను తిప్పుతూ తనలోతాను ఒక పాటను ఈలతో పాడుతూ ఉంటాడు)

సింహం — ఏమిటన్నయ్యా!

రామన్న — ఆ రాస్తున్నది కవిత్వమేనా? ఏది ఇలాతే!

సింహం — ఉహు! నే నివ్వను (కాగితాన్ని పుస్తకంలో దాచేస్తాడు.) నేనేదో రాసుకుంటున్నాను నీ కెందుకూ?

రామన్న — పోనీ! నా కెందుకులే. (పంట్లాం జేబుల్లో చేతులు పోనిచ్చి నిర్లక్ష్యంగా ఈలతో పాడి తమ్ముణ్ణి దీక్షగా చూస్తూ) ఇవ్వవు కదూ చూపెంచవూ?

సింహం — ఊరుకుందూ! ఏముందిక్కడ? నేనేమీ రాయలేదు.

రామన్న — పిచ్చిరాతలు (సింహం జుట్టుపట్టుకొని తల ఊపి వదులుతూ) సరే దాచుకో పెద్ద కవివి బయల్దేరావు. (టేబిలు దగ్గరకు వెళ్ళి తన పైపులో పొగాకు కూరుతాడు) అంతకన్న మంచి పనేదీ చేతకాదట్రా నీకు? (ఒక డ్రాయరు తెరుస్తాడు)

సింహం — నువ్వు చేస్తున్న ఘన కార్యం యేమిటో చెబుదూ నన్నంటావు మహా!

రామన్న : ఏం చెప్పన్రా? సమయం వచ్చినప్పుడు తెలుస్తుంది (డ్రాయరు లోంచి ఒక పాత పుస్తకం తీసి పేజీలు తిరగేస్తాడు) ఊరంతా చుట్టబెడుతున్నాను ఒక్క నిమిషం ఓపికపట్టలేవు వస్తుందిలే మన సమయం దగ్గర్లోనే ఉంది (చదరంగపు బలం ఉన్నటేబిలు దగ్గరకు నడుస్తాడు) చూడ్రా చిట్టీ! నాన్న సగం సగంలో ఈ చెస్ ప్రాబ్లం వదిలేశాడు ఎలా ఆట కట్టించాలో తెలిసినట్టు లేదు నాన్నకి చూడు దీన్ని సాధిస్తానేను (బలం పేర్చి పుస్తకంలోని ఒక బొమ్మతో సరిపోల్చి చూసుకుంటాడు ఆలోచిస్తూ ఈలవేస్తూ ఉంటాడు)

సింహం : (సందేహంగా) ఒరే అన్నయ్యా నిన్నొకటి అడగాలనుకుంటున్నాను

రామన్న : (పరధ్యానంగా) హూఁ?

సింహం : చిన్నన్నయ్య సంగతి

రామన్న : నాకేం తెలుసునని? నన్నెందు కడగడం?

సింహం : ఇవాళ విమానంమీద ఏదో రికార్డు బ్రేక్ చేస్తా నన్నాడురా?

రామన్న : ఆ ఘోషంతా నీ కెందుకు?

సింహం : నిన్న సాయంత్రం నాతో అన్నాడులే సరిగ్గా ఇవాళ మూడుగంటలకి దేవుణ్ణి ప్రార్థించమన్నాడు ఏదో పెద్దపని పెట్టుకున్నట్లు మాట్లాడాడు

రామన్న : మూడు గంటలకా? (చేతి గడియారం చూస్తాడు) మూడు కావచ్చిందిప్పుడు మాతో ఏ సంగతీ చెప్పలేదే? (చదరంగపు బలంలో అక్కడ తీసి ఇక్కడా, ఇక్కడ తీసి అక్కడా పెడుతూ ఈలవేస్తూ ఉంటాడు) బహుశా అమ్మకి తెలియ కూడదని వాడి ఉద్దేశం కాబోలును విమానం మాటంటేనే అమ్మకి చెడ్డ భయం నారాయణ సంగతి అమ్మముందనకేం? తర్వాత నీ యిష్టం! (మొదట పుస్తకం, తర్వాత చదరంగబలం చూస్తాడు) ఐదింట మంత్రి, ఐదింట మంత్రి, నాన్న పుస్తకంలో రాసుకున్నాడు ఐదింట మంత్రిని కదల్చడం మొదటి ఎత్తని కాని ఆ ఎత్తు పనికొస్తుందని తోచదు చూడు. చిటీ! నాన్నకి మన్యపుదేశాల్లో ఊసుపోయేది కాదనుకుంటాను అందుకే చదరంగం ఆడుకొనేవాడు

సింహం : నీకూ ఊసుపోకుండా వుందా?

రామన్న : మెల్లిగా అడుగుతున్నావా? ఇంతపాడుకాలం ఎన్నడూ ఉండబోదు (గిర్రున తిరిగి) ఇదిగో చిట్టీ? వేషాలు వెయ్యక ఆ పద్యం ఇలా చూపించు.

సింహం : వీల్లేదు

రామన్న : ఎంచేత?

సింహం : మొదటి కారణం అదింకా పూర్తికాలేదు.

రామన్న : (సింహాన్ని సమీపించి) ఫర్వాలేదు. నా చిట్టివి కావూ?

సింహం : (కాగితం తీసి ఇస్తూ) బాగులేదని నన్ను తిట్టొద్దు

రామన్న : (కాగితం తీసుకొని) స్పెల్లింగు తప్పులెన్ని వున్నాయో చూసి ఇచ్చేస్తాను (శ్రద్ధగా చదువుతూ వుంటాడు.)

(తుపాకీతో లక్ష్మన్న ప్రవేశిస్తాడు రామన్నా లక్ష్మన్నా కవలలు)

---

లక్ష్మన్న ఇక్కడా ఉన్నారూ మీరిద్దరూ! (తుపాకిని ఒడిపట్ మోపేస్తూ) ఎంత బల్లెం పెట్టింది! ఏ కిలుకాకిలు ఊడదీసాను ఇప్పుడు ఫస్టుగా ఎసిపేస్తుంది (తుపాకిని గోడకు తగిలిస్తాడు) ఒరే రామా! మనం ఓస్కొకమాదు ట్రై చెయ్యాలి ఇక్కడేం చేస్తున్నారిద్దరూ? ఏదో గూడుపుఠాణీ! (ఇంకో తుపాకిని తీసి పరీక్షిస్తాడు)

సింహం (ఆదుర్దాగా రామన్నను చూస్తూ లక్ష్మన్నతో) ఏం లేదన్నా ఏం లేదు

రామన్న ఇటు చూడు చిట్టీ! ఈ రెండో పాదంలో యతి వుందొద్దూ?

సింహం ఏ పాదం? ఏదీ. ఇలా తే!

రామన్న అజ్ఞాత విలాసినీ! అన్న పాదం

లక్ష్మన్న (తుపాకిని తాటిస్తూ) అహో! కవిత్వమే! మన బాలకవి సార్వభౌముడికి మళ్ళీ యతిప్రాసల దరిద్రం పట్టుకుందీ!

(తుపాకిని టేబిలుమీద పెట్టి సొరుగులోంచి మెరుగుపెట్టే సామానులు తీస్తాడు)

రామన్న ఎవర్రా తమ్ముడూ ఈ అజ్ఞాతవిలాసిని?

సింహం (దిగ్గున లేచి కాగితం లాక్కోబోతాడు) నా కాగితం నాకుతే పాటంతా పాడుచేశారు తే, చింపేస్తాను

రామన్న లేదబ్బీ, నిజంగా తెలియకే అడుగుతున్నాను. చెప్పొద్దూ! ఈ పాట చాలా బాగుంది

సింహం హాస్యాని కంటున్నావ్?

రామన్న నిజం ప్రమాణపూర్తిగా! నామట్టుకది చాలా బాగుంది పెద్దయితే నువ్వు ఆస్థానకవివైపోతావు

సింహం అయితే పోల్చుకో చూద్దాం అజ్ఞాత విలాసిని అంటే ఎవరో?

రామన్న "మృత్యువు" అని నీ వుద్దేశంలా కనబడుతుంది (కాగితం ఇచ్చేస్తాడు )

సింహం అయితే మళ్ళీ నన్నెందు కడగడం?

రామన్న ఏం లేదు మృత్యువుమీద పద్యం ఏమిటా అని! ఇంత చిన్న తనంలోనే మృత్యువునింత ప్రేమగా పిలుస్తున్నావేమని!

లక్ష్మన్న (టేబులుమీద తుపాకిని పెట్టి శుభ్రపరుస్తూ) చిన్నతనం కాబట్టే పెద్ద కబుర్లు. కవిత్వాని కర్థమేమిటి తమ్ముడూ! అజ్ఞాతవిలాసిని! హా! హా! హా! (నవ్వుతాడు ) మృత్యువులో నాకే ఆకర్షణా కనబడదు. అంటే ఒక రకం తప్ప -

రామన్న అంటే ఒక గొప్ప ఆశయం కొసం చచ్చి పోవడంలో అంతే కాదూ!

లక్ష్మన్న సెబాస్! అందుకున్నాడండి అర్థం! కాని గొప్ప ఆశయం అంటే ఏమిటో! వెదురుకర్రకి చుట్టిన ఎర్రగుడ్డ పీలిక కోసమా? ఎంత ఉన్నతాశయం! వీధుల్లో పోరాటం! స్లోగన్లకోసం చావు! వీరస్వర్గం చూరగొనడం! అంతేనా?

సింహం . (గద్గదస్వరంతో) ఊరుకో అన్నయ్యా! మళ్ళీ మొదలుపెడుతున్నారు మీ యుద్ధం

రామన్న (చదరంగం బల్లపక్క కూర్చుంటూ) భయంలేదు రా చిట్టీ. పోట్లాడుకోంలే! ఎవడు లక్ష్యపెడతాడీ నాయనమ్మగాడిని. నాకన్న అరగంటముందు పుట్టాడండీ ఈ పెద్దమనిషి! అంచేత మా యిద్దరిమధ్యా ఒక పెద్ద అగడ్త ఏర్పడింది ఒక తరానికీ ఇంకో తరానికీ

ప్రపంచమంతా ఎవరాలిలవు కాలాన్ని" రంగంమీదకి ఒక కొత్తరకం దిగుతోంది వెనకటి ఉదంతకర్తే ముప్పయి నిమిషాలు పెస్తది (మంత్రిని కదుపుతాడు) ఐపింట మంత్రి ఐపింటు మంత్రి నాన్న ఉనుకున్న ఎత్తుతో ఈ ఆటకడుతుందని తోచదు (మంత్రిని యథాస్థానంలో పెడతాడు )

లక్ష్మన్న  చిట్టీ! ఏదీ నీ కవిత్వం అన్నయ్యకి చూపించవూ?

సింహం  ఉండు దీన్నింకా కొంత చిత్రిక పట్టాలి

రామన్న  (వేళ్ళు తుడుచుకుంటూ) అలాగే ఉంచేస్తే మంచిది బాగు చెయ్యబోయినకొద్దీ మరింత పాడుచెయ్యడమే అవుతుంది ఇలాతే. కాగితం!

సింహం  (కాగితం ఇస్తాడు) వెక్కిరించకూడదు మరి ఏం అన్నయ్యా?

రామన్న  (చదరంగం బల్లపట్టి) పర్వాలేదు చిట్టీ పోలీసుద్యోగి ఎవ్వరినీ వెక్కిరించడు నీ పద్యం జాగ్రత్తగా పరిశీలిస్తాడు విద్రోహకరణు లున్నాయేమో అని. యతిప్రాసలు లేకపోవడం వాడి దృష్టిలో విప్లవం

సింహం  నేను రాసింది పాటకాని పద్యం కాదు అంత్యప్రాసలు పాటించాను

రామన్న  అంచేత బతికిపోయావు లేకపోతే దేశద్రోహం చేశావన్న నేరం మోపుతాడు నీమీద మూరావూ? అసలులోపున్న వ్యాపిస్తేక అద్దు చెప్పకూడదు ఆ బెడదంతా నాకు వదలిపెట్టు ఈ యింట్లో నేను ప్రజాపలసనవాణ్ణి కాను - ఈ శకటం కదిపితే ఏమవుతుందో? (తల ఊపుతాడు). ఊహూ పార్శ్వం బలహీనమయి పోతుంది తెల్లబలం దాడిచేస్తుంది ఉండుండు సుహాసినీ! అజ్ఞాత విలాసినీ! చల్లగా మెల్లగా సాగిరావమ్మ!

సింహం  అన్నయ్యని చదవనియ్యి ఆ పాట!

రామన్న  క్షమించు పైకి ఆలోచించుకుంటున్నాను ఉపన్యాసా లిచ్చేవాడికిదే చిక్కు

లక్ష్మన్న  (కాగితం కిందపెట్టి) కంపు కొడుతోంది

సింహం  అంత బాగులేదూ?

లక్ష్మన్న  . అఘోరించినట్టుంది ఒరే రామూ! చిట్టిగాడు కవి కావడానికి వీల్లేదు. మనం మిలిటరీ ఆఫీసరు కొడుకులం ఈ వంశం ఏ విధంగానూ, ఎప్పుడూ వేలెత్తి చూపించుకొలేదు చిట్టిగాడికి నాలుగు తగలనివ్వనా?

సింహం  (సరదాగా) అయితే నా పాట బాగుందన్న మాట

లక్ష్మన్న  (సింహం జుత్తు లాగి సరదాకి తల ఊగిస్తూ!) పరీక్షలు దగ్గర కొస్తున్నాయి కదా ఏం కవిత్వాలివి చెప్పు? అయినా నువ్వింకా చాలా నేర్చుకొవాలరా చిట్టీ! అప్పకవీయాన్నీ. చిన్నయసూరినీ చదువు అదొహటిన్నీ, చావు గురించి ఎప్పుడూ రాయకు కుర్రాడివి. అలాంటి విషయాలు నీకెందుకు? పాటలు రాయవలసివస్తే బతుకు గురించి ఎందుకు రాయకూడదూ?

సింహం  పాటలు రాయొచ్చుకాదూ నువ్వు కోప్పడవుకాదూ?

లక్ష్మన్న  (మళ్ళీ తుపాకిని శుభ్రపరుస్తూ) ఈ కుటుంబంలో ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్క పిచ్చి ఉంది ఏదో శాపం అనుకుంటాను

సింహం	చిన్నన్న ఇవాళ విమానంమీద రికార్డు బ్రేకింగ్‌కి ప్రయత్నిస్తున్నాడు తెలుసునా?

లక్ష్మన్న	నారాయణా? ఎవరన్నారు?

రామన్న	చిట్టిగాడితో నారాయణే చెప్పాడట

లక్ష్మన్న	(కిటికీలోంచి బైటికి చూస్తూ) మేఘాలు లేవు కొద్దిగా అదృష్టం కూడా కలిసొస్తే బాగుంటుంది

సింహం	ఏం రికార్డురా?

రామన్న	ఆల్టిట్యూడ్

లక్ష్మన్న	బరువుకూడా వేసుకొని (తుపాకి తోముతూ ఉంటాడు)

సింహం	ఆకాశంలో ఎవరూ ఎగరనంత ఎత్తుకి ఎగరడం మజాగా వుండదూ? చుట్టూ వినీలాకాశం మధ్య విమానంలో ఒంటరిగా నువ్వు ఇంకా ఇంకా పైపైకి పైపైకి వెళ్ళాలని ప్రయత్నం! ఏం మజాగా వుంటుంది

రామన్న	చలి దంచేస్తుంది చేతులు పట్టు తప్పిపోతాయి

లక్ష్మన్న	పందెం వేస్తాను నారాయణ ఎప్పుడో ఒకప్పుడు రికార్డు బ్రేక్ చేసి తీరుతాడు అచ్చంగా వాడిది నాన్న పోలిక

సింహం	ఎందులో?

రామన్న	(చదరంగంలో మునిగిపోయి) సాహసంలో పట్టుదలలో

లక్ష్మన్న	ధర్మం నిర్వహించడంలో అను రామన్నా!

సింహం	మీరంతా నాన్నని చూశారు నేనే చూడలేదు ఆదిమూర్తి అన్నయ్యకూడా నాన్న పోలికేనా?

లక్ష్మన్న	ఆహా! అందుకే విదేశాలకు వెళ్ళిపోయాడు

సింహం	మరి నువ్వో అన్నయ్యా!

లక్ష్మన్న	నాన్న అడుగుజాడల్లో నడుచుకోవాలని శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తూ ఉంటాను.

సింహం	రామన్న సంగతేమిటి!

లక్ష్మన్న	ఈ వంశంలోకల్లా నాన్న గుణాలు పట్టుపడనివాడు వీడొక్కడే

రామన్న	నేనా? ఓరిబేకూ! చూడు ఎంత కష్టపడి చదరంగం చిక్కు విప్పుతున్నానో?

లక్ష్మన్న	అదొక్కటైతే సరిపోయిందేమిటి? అన్నివిధాలా నువ్వు నాన్నకి చుక్కెదురు. నిన్ను చూస్తే నాన్న గుండెబాదుకుంటాడు. పటాలంలో సుబేదార్ మేజరు నాన్న నువ్వేమో విప్లవం వర్ధిల్లుగాక అని అరుస్తావు భూమి తలకిందులు జేసేస్తానన్నట్లు మాట్లాడుతావు మన వంశానికంతా అప్రతిష్ట తెస్తున్నావు (ఆగి) నాన్న తుపాకులన్నీ వేగిరం తుప్పట్టిపోతా యెంచేతో?

రామన్న	: తుపాకులమాట అటుంచవోయ్. ఎక్కడ భూమి కదిలిపోతూ వుంటే అక్కడ నాన్న వుండేవాడు. ఆ పోలికలతో నేను పుట్టేను (ఎత్తువేస్తాడు) అంచేత ఎర్ర బంటు ముందుకి కదుల్తుంది. తెల్లరాజు పగలో పడతాడు.

లక్ష్మన్న	తెల్లరాజుకి పగా? ఏదీ చూదాం. (చదరంగం దగ్గరికి వెళతాడు).

---

రామన్న   ఎర్రబలం దాడిచేస్తుంది తెల్లబలం తెల్లమొగం వేస్తుంది. ఎర్ర శకటు పొడిచి రాజు రాజు తప్పించుకో బోతాడు ఇట్నుంచి ఇంకో ఎర్రబంటు తోసి రాజు! ఆటకట్టు!

లక్ష్మన్న   నాన్సెన్స్! నీ ఆటంతా తప్పు (పుస్తకాన్నీ చదరంగం బల్లనీ చూస్తూ) నాన్నయితే మంత్రిని కదుపుతాడు అయిదింట మంత్రి అయితే - (మంత్రిని తియ్యబోతాడు)

రామన్న   నా ఆటలో నువ్వు వేలు పెట్టకు

లక్ష్మన్న   ఇది నాన్న ఆట! చూడు (విజయవంతంగా) మంత్రితో మొదలెడితే తెల్లబలం మూడో ఎత్తుకి గెలుస్తుంది

రామన్న   అదే నాకిష్టంలేదు తెల్లబలం ఓడిపోవడం నాకు కావాలి. అందుకోసం ఎర్రబంటు కత్తిపట్టుకొని తెల్ల గుర్రాలని తగిలివెయ్యాలి

లక్ష్మన్న   ఇదేదో తమాషాగా ఉందే ఏదో పొరపాటున్నట్టు కూడా కనబడుతోంది ఈ సమస్య ఇచ్చినవాడికి ఎర్రబలం గెలవ్వచ్చునని తెలియనే తెలియదని తోస్తుంది.

రామన్న   అదీ కథ! ఈ సమస్యను రెండువిధాలా పరిష్కరించ వచ్చునని తాత్పర్యం!

లక్ష్మన్న   . మొదటిది నాన్న పంథా!

రామన్న   రెండోది విప్లవ పంథా! అడుగునపడ్డ ఎర్రపిక్కల్లారా! పదండి ముందుకు తెల్లకోటని ముట్టడించండి. తెల్లబలం ఆటకట్టించండి

లక్ష్మన్న   ఒరే! రామన్నా! నీకు మతిపోయిందేమిటి? ఆ యెర్రబంటుని అక్కడుంచు ఆటంతా ధ్వంసం చేస్తున్నావు

రామన్న   ఏ ఆట?

లక్ష్మన్న   · నాన్న ఆట! నాన్న మంత్రితో మొదలు పెడతాడు వెధవబంటూ నువ్వూ! అక్కడుంచు

రామన్న   ఎందుకని?

లక్ష్మన్న   నాన్న ఎత్తుతో ఈ ఆట ఎలా కడుతుందో చూడాలి

రామన్న   ఇప్పుడు మనం ఆడుతున్నది నాన్న ఆటకాదు. ఇది వేరే ఆట! ఇది మన ఆట తెల్లగుర్రాలతో లాభంలేదు. ఎర్రపిక్కల పురోగమనాన్ని ఎవ్వరూ ఆపలేరు చూశావ్! ఈ ఎర్రబంటు మరి రెండెత్తులతో ఎర్రమంత్రి అయిపోతుంది - అయితే దాన్ని మేము మరో పేరుతో పిలుస్తాం

లక్ష్మన్న   · ఏమిటా పేరు?

రామన్న   (హఠాత్తుగా ఉద్రేకించి) మరో ప్రభుత్వం! లచ్చీ! ఎర్రబలాల రాజ్యం! చూస్తూంటేనే వచ్చేస్తుంది!

లక్ష్మన్న   : మరేం ఫర్వాలేదు తమ్ముడూ! మనదో చిన్న ఎత్తుంది మరచిపోకు.

రామన్న   : ఏమిటో అది?

లక్ష్మన్న   ఇది! (చేతి విసురుతో బలాన్ని తిరగదోస్తాడు)

రామన్న   : ఓహో! పశుబలం ప్రయోగిస్తారన్నమాట (నిలబడతాడు) సెబాస్! దాన్ని ఎదుర్కోడంకూడా మాకు తెలుసు (లాల్చీ జబ్బమీదికి ఎగదోస్తాడు)

సింహం   (సోఫాలో చదువుకుంటున్నవాడు తలయెత్తిచూసి దిగులుగా అరుస్తాడు) చాలించండ్రా. మీరూ మీ రాజకీయాలూ! తల బద్దలవుతోంది!

లక్ష్మన్న బెదిరిపోతున్నావేం? ఇదంతా వేళాకోళానికి' అంతేకాదుర్రా తమ్ముడూ' ఇది ఉత్తుత్తి యుద్ధం

సింహం కాదు గొప్పలడాయి మీమీ మనస్సుల్లో ఏ మాలోచిస్తున్నారో నాకు తెలుసు

రామన్న సింహం గాడన్నది రైటు' చావో రేవో తేలిపోవాలిప్పుడు ఇది పాత ప్రపంచానికీ కొత్త ప్రపంచానికీ మధ్య యుద్ధం నీకేం భయంలేదురా చిట్టీ' పీడసంగతి తేల్చేస్తానెక్కడ (ఒక శిరస్త్రాణంతీసి ధరిస్తాడు)

లక్ష్మన్న (తానొక హెల్మెట్ ధరించి) తయార్ ! (రెండుకత్తులు తీసి) నీకేదికావాలో తీసుకో

రామన్న (ఒక కత్తితీసుకొని వంచి చూచి) ఇది బాగుంది (ఇద్దరూ యుద్ధ సంసిద్ధులుగా ఉన్నట్లు నిలబడతారు) ఒరే చిట్టీ నువ్వు మధ్యవర్తివి

సింహం (తలపుస్తకంలో దాచి, రెండుచేతులతొ చెవులు మూసుకొని) నేను భరించలేను భరించలేనంటే వినరు మీరు

లక్ష్మన్న సైయేనా?

రామన్న : (సిద్ధంగా) సై! ప్రజాశత్రువులు నశింతురుగాక (ఇద్దరూ కత్తి సాము చేస్తారు. వేళాకోళపు యుద్ధం)

లక్ష్మన్న ఓరీ దుర్మార్గుడా! ఇదే నిన్ను సంహరించువాడ' ఈ ఆగ్నేయాస్త్రమును కాచుకొనుము

రామన్న ఏడిశావ్ లేవోయ్! ఇదిగొ వారుణాస్త్రం! దీనితో మాదే పై చెయ్యి

లక్ష్మన్న . నీదా పైచేయి? రాజద్రోహీ! చచ్చితివి (కత్తి రామన్నకి తగులుతుంది గాభరాపడి) ఒరే తమ్ముడూ! దెబ్బ తగల్లేదుకద?

రామన్న . ఆటలో అరిటిపండు! (సిద్ధంగా) సై! (ఇద్దరు కత్తిసాముతో కుర్చీలూ బల్లలూ తిరగదోస్తారు)

లక్ష్మన్న ఈ దెబ్బతో నీపని సరి!

రామన్న ఎవరికి దెబ్బ తగిలింది? దెబ్బతిన్నా ఎవరింకా యుద్ధం చేస్తున్నారు?

సింహం (అరుస్తాడు) ఆపండర్రా పోట్లాట! ఆపుతారా! ఆపరా?

రామన్న అయిపోవచ్చింది తోసిరాజు! ఆటకట్టు! హాహా! పాత ప్రపంచం కూలిపడిపోతోంది

లక్ష్మన్న . (రామన్నమీద కలియబడి చిత్తుచేసి గుండెలమీద కత్తి ఆనించి నిలువబడి) గుండెలో దూసుకపోయింది కత్తి.

రామన్న · (లేచి నిలబడి కత్తి పారేసి మిలిటరీశాల్యూట్ చేస్తూ) సంతోషం నేను చచ్చిపోయాను.

లక్ష్మన్న . (కత్తిపారేసి శాల్యూట్‌తో) నాతమ్ముణ్ణి నాచేతుల్తో చంపుకున్నందుకు విచారిస్తున్నాను. (వాళ్ళ అమ్మ ప్రవేశిస్తుంది గది తలుపువద్ద నిలబడుతుంది)ఏమిటా అల్లరీ?

రామన్న . ఏంలేదమ్మా! (తొందరగా కత్తులుతీసి గోడకి తగిలించి) అన్నయ్య ఇప్పుడు నన్ను సంహరించాడు. కత్తి సరిగా గుండెలోకి దూసుకుపోయింది.

అమ్మ . ఈ కవలవపిల్ల లెప్పుడూ దెబ్బలాడుకోవడమే మరీ కిందా మీదా ఉండకుండా వున్నారు! చూడండీ! ఇలాగేనా ఇల్లుతీసి పందిరి వెయ్యడం? మళ్ళీ మీ నాన్నగారి గది కూడాను

రామన్న ఒప్పి మామూలుగా సర్దేస్తామమ్మా! కొప్పడకు రారా! అన్నయ్యా! (ఇద్దరూ కలిసి సామాను కుర్చీలూ పక్కలూ సర్దుతూ ఉంటారు)

అమ్మ చాలైంది అవన్నీ అలా ఉండనియ్యండి మీ సర్దడమంతా నాకు తెలుసు సర్దబోతున్న కొద్దీ మరింత ధ్వంసం చేస్తారు

లక్ష్మన్న (నాలుగుకాళ్ళ జంతువులా మోకరించి తివాసీని సర్దుతూ) అమ్మ చెప్పింది నిజం! సర్దడం ఇక చాలించు

రామన్న (నాలుగు కాళ్ళమీద జంతువులా మోకరించి లక్ష్మన్నను తోసేస్తూ) నువ్వే చాలించు. (ఇద్దరూ కుస్తీపట్లతో నేలమీద దొర్లుతారు)

రామన్న కొడతాను కాబోలుమరి!

లక్ష్మన్న (ఎగ ఊపిరి తీసుకుంటూ) కొట్టడం కొనితేవాలి

రామన్న సరే చూపిస్తానుండు! (ఇద్దరూ దొర్లుతారు)

అమ్మ బాగుంది వాలకం! ఇకచాలు! ఎప్పుడో ఒకప్పుడు ఇక్కడున్నవన్నీ నాశనంచేసి తీరుతారు. ఎన్నేళ్ళొచ్చినా ఇంకా సిగ్గులేదూ? మిమ్మల్నిచూసి చిట్టిబాబు ఏమనుకుంటాడు?

లక్ష్మన్న (రామన్నను వదలి) రారాచిట్టీ! ఈ కుస్తీపట్లు నేర్చుకుందువుగాని

సింహం నాకొద్దు నేను రాను

అమ్మ నువ్వు వాడికేమీ కుస్తీపట్లు నేర్పనక్కర్లేదు ఊఁ ఇక మీరిద్దరూ ఇక్కడనించి నవడండి చిట్టీ వీళ్ళిద్దరూ ఎందుకు దెబ్బలాడు కుంటున్నారు?

సింహం చిన్నన్న అయిదింట మంత్రిని చెయ్యనంటాడు

లక్ష్మన్న (నేలమీదపడ్డ చదరంగం బలాన్ని పోగుచేస్తూ) చూశావే అమ్మా! నాన్నయితే ఆ యెత్తు వేస్తాడు మన కుటుంబపు సంప్రదాయాలు నిలబెట్టాలంటున్నాను నేను

రామన్న పచ్చి అబద్ధం అమ్మా! ఈ సమస్యని రెండువిధాల పరిష్కరించ వచ్చు

లక్ష్మన్న (చదరంగం బల్లమీద బలాన్ని పేర్చుతూ) అయితే నాన్న పద్ధతి ప్రకారం ఎందు కాడకూడదూ?

రామన్న ఇంకో పద్ధతి ప్రకారం ఎందుకాడకూడదూ? ఇప్పుడు నాన్న ఉంటే నే నాడుతున్నట్టే ఆడుతాడు

అమ్మ చాలింక కట్టిపెట్టండి మాటకిమాట తెగులు నీటికి నాచు తెగులు! ఇంక వెళ్ళండి ఈ గదంతా ఎత్తిపెట్టాలి నేను.

లక్ష్మన్న మేం సాయంచేస్తాం.

అమ్మ ఓ! గొప్ప సాయమే! ఇల్లు ఎలా సర్దాలో మీకేమేనా తెలిస్తే కాదూ?

లక్ష్మన్న తెలుసు. ఎక్కడుండే వస్తువుని అక్కడ ఉంచడం.

రామన్న కాదు ఎక్కడ ఉండవలసిన వస్తువుని అక్కడ ఉంచడం.

అమ్మ అబ్బేబ్బే! అదేంకాదు! ఎక్కడ ఏవస్తువుంటే సుఖంగా ఉంటుందో అక్కడ ఆ వస్తువుని ఉంచడం! కాని, ఇదేమీ మీ కర్థంకాదు ఊఁ చలోజావ్ వెళ్ళండి మీరిద్దరూ. ఈ గదిలోంచి అవతలికి.

లక్ష్మన్న  రారా! రామన్నా! తోటలోకి వెళ్ళి ఈ తుపాకి సంగతి చూద్దాం

రామన్న  అలాగే కానియ్యి! ఏభయి గజాల దూరంనుంచి ఎవరు సీసా పడగొట్టగలరో చూదాం! అంతేనా?

అమ్మ  ఎప్పుడూ ఏదో ఒకటి పడగొడుతూ ఉండకపోతే మీకు తోచదన్న మాట

రామన్న  మాతో వస్తావురా, సింహం?

అమ్మ  చిట్టిబాబు మీతొ రాడు తుపాకీ ఆటలంటే మా బాబుకి అసహ్యం! అంతేకాదూ సింహం?

రామన్న  సింహం కాదు చిట్టెలుక! చిట్టెలుకకి చెప్పరానంత భయం అసలు సంగతదీ

అమ్మ  వాడికా భయం? మీకు వాడి సంగతే తెలియదు వాడు మీకు అర్థం కాదు మీరంతా ఒక రకం వాడొక్కడూ ఒక రకం

లక్ష్మన్న  మే మంతమందిమీ తలో రకం!

అమ్మ  . మీ రనుకుంటున్నంతగా కాదు ఊ< ఇక వెళ్ళండి ఎద్దు మొద్దు స్వరూపాలు.

లక్ష్మన్న  . (తల్లి చెయ్యిని భుజంమీద వేసుకొని) అమ్మా! ఇంకా మామీద కోపమేనా?

రామన్న  (ఆమె రెండో చెయ్యి భుజంమీద వేసుకొని) అమ్మకా కోపం? ఈపాటికి అలవాటయి పోయుంటుంది అమ్మకి

అమ్మ  (ఇద్దరినీ వదలించుకొని) నారాయణ ఎక్కడి కెళ్ళాడో మీకెవరికేనా తెలుసునా?

రామన్న  ఏమో! ఎక్కడికి వెళ్ళుంటాడో, నీకేమేనా తెలుసునురా చిట్టీ?

సింహం  నాతో ఏం చెప్పాడంటే - (సగంలో మాట మార్చి) ఎవరినో కలుసుకోవడానికి వెళుతున్నానన్నాడు.

అమ్మ  · (సందేహంగా) ఎవరిని కలుసుకోడానికి?

రామన్న  బహుశా ఎవరో అజ్ఞాతవిలాసిని అయ్యుంటుంది (కవల లిద్దరూ నిష్క్రమిస్తారు)

అమ్మ  : నువ్వేం చేస్తున్నావిక్కడ చిట్టీ!

సింహం  ఏంలేదు. ఊరికేనే చదువుకుంటున్నాను.

అమ్మ  . నాన్నగారి పుస్తకాల్లోదేనా?

సింహం  . ఔను. విదేశీయాత్రల్ని గురించిన గ్రంథం.

అమ్మ  . నువ్వెప్పుడూ దూరదేశాల్ని గురించే ఆలోచిస్తూ వుంటావు. అదేమీ లాభంలేదు చిట్టీ! నువ్వెప్పుడూ దూరప్రయాణాలు పెట్టుకోవుకాదూ? (గదికి అడ్డుగా నడిచి వస్తువులు సర్దుతుంది).

సింహం  విదేశాలకి బహుశా నేను వెళ్ళనుగాని అక్కడ ఎలా వుంటుందొ వూహించుకోగలను.

అమ్మ  ఎక్కడ?

సింహం  : ఎక్కడా? ఏమో! సరీగా చెప్పలేను కాని స్పష్టంగా కనబడుతోంది. ఒక పెద్ద మైదానం! ఎత్తుగా పెరిగిన గడ్డి! ఇంతట్లోకే హఠాత్తుగా ఎన్నెన్నో లేళ్ళ గుంపులు! అమ్మా! లేళ్ళనెందుకు వేటాడుతారే? వాటిని చంపడాని కెవరికేనా యెలా చేతులొస్తాయే?

అమ్మ  : మీనాన్న లేళ్ళని వేటాడేవారు. నీకు మాత్రం వేటంటే ఇష్టంలేదు కాదూ! (చుట్టూ చెయ్యివేసి) నువ్వెప్పుడూ ఇప్పుడున్నట్టే ఉండాలని నాకోరిక. ఎవరో ఒకరు ఇంటిపట్టున

ఉండాలిరా బాబూ. లేకపోతే ఇల్లనేదే వుండదు (తలనిమిరి) ఇక వెళ్ళి ఆడుకో! నాకు బోలెడంత పనుంది

(సింహం నిష్క్రమిస్తాడు)

అమ్మ (చప్పుడు చెయ్యకుండా సామాన్లు సర్దుతూ) చిట్టిబాబు పద్ధతే వేరు వాడి రక్తమే వేరు అందరిలాంటివాడు కాడువాడు కాకూడదు వాడు. వాడిపద్ధతి వేరు వాడి రకం వేరు (నాన్నగారి చిత్తరువు ముందు నిలబడుతుంది బొమ్మకళ్ళల్లోకి చూస్తుంది లాభంలేదన్నట్టు తలా, భుజాలూ ఒళ్ళూ ఊగించికిటికీల తెరలు ఒక్కొక్కటే దించుతుంది గదిలో క్రమంగా వెలుతురు తగ్గిపోతుంది అమ్మ నాన్న గారి బొమ్మ దగ్గరకి మళ్ళీ వెళ్ళి దానికెదురుగా వున్న ఒక దీపం వెలిగిస్తుంది) నా పిల్లల్ని మీ దగ్గరకి లాక్కుంటున్నారు అలా వాళ్ళనెందు కాకర్షిస్తారండీ? అది నాకిష్టంలేదని మీకు తెలియదూ? ఆఖరికి మన చిట్టిగాడుకూడా మీరెవరో తెలియదు కదా - వాడికి మిమ్మల్నెప్పుడూ చూడలేదుకదా వాడు - వాడు సహా వీలయినప్పుడల్లా ఈ గదిలోనే తచ్చాడుతాడు మీకు న్యాయమేనా చెప్పండీ! నన్నెందుకిలా ఏడిపిస్తారు? వాళ్ళ నెందుకిలా ఆకర్షిస్తారు? ఎప్పుడూ ఇలా మీ దగ్గరికి వాళ్ళని లాక్కుంటూ వుంటే నేనొప్పుకోను.

నాన్న (చీకటి కోణంలోంచి నింపాదిగా ముందుకివస్తాడు. బొమ్మలోవున్న యూనిఫారాన్నే ధరించి బొమ్మలోలాగే వుంటాడు) వాళ్ళని నేనెందు కాకర్షిస్తానే పిచ్చిదానా? వాళ్ళంతట వాళ్ళే నావేపుకి వస్తున్నారు చిన్నప్పుడు వాళ్ళిక్కడ వస్తువులతో ఎలా ఆడుకునేవాళ్ళో నీకే తెలుసుగద! ఇప్పుడు వాళ్ళేంచేస్తే మాత్రం నీకెందుకే ఆశ్చర్యం?

అమ్మ (ఏమాత్రమూ గాభరా లేకుండా భర్తవైపు తిరిగి, మామూలుగా బతుకుతున్న వాళ్ళతో మాట్లాడుతున్నట్టే) మీకేం చెబుతారు ఎదిగిన పిల్లలు కదా ఇంకా ఏం చిన్నతనం? వీటితో ఆడుకొనే వయస్సా? అయినా ఎందుకో వాళ్ళు ఇక్కడికే వస్తారు. మీ దగ్గరకే వస్తారు.

నాన్న ఎందుకొస్తారో చెప్పనా? చిన్నప్పటి జ్ఞాపకాలవల్ల వస్తారు పోనీ ఈ జ్ఞాపకంచేసే చెత్తంతా తుడిచి పారెయ్యకూడదూ? ఎందుకు చెప్పూ ఈ దిక్కుమాలిన సామాన్లు?

అమ్మ దిక్కుమాలిన సామానులా? మీ వస్తువులన్నీ చెత్తా? వీటిని నేను పారెయ్యాలా - పారెయ్యగలనా? ఎంతమాట! ఇక్కడ ప్రతి వస్తువూ మీది! ప్రతీ వస్తువూ నాది! ఎలా పారేస్తాను! ఇవన్నీ నాకోసం ఇక్కడ వుండవలసిందే! (కుర్చీలో కూర్చుంటుంది) ఈ గదిలో ఉండి మన పిల్లలు ఎప్పుడు వెళ్ళిపోయినా వాళ్ళ వెనక ఏదో పరిమళం వదిలిపోతున్నట్లు నాకు కనిపిస్తుంది అప్పుడు నాకు మీరే ఇక్కడున్నారనిపిస్తుంది

నాన్న (ఒక కుర్చీమీద కూర్చుండి) వాళ్ళు వొదిలిపోయేది పరిమళం కాదు! వొట్టి పొగాకువాసన!

అమ్మ పొగాకువాసనకి ప్రాణం లేదు బతికున్న పరిమళమేదో ఈగదంతా నిండిపోతుంది! ఒక్కసారి కళ్లు మూసుకుంటే చాలు. అన్నీ జ్ఞాపకం వస్తాయి! మా ఆయన వచ్చే వేళయింది! మా ఆయన వస్తున్నారు! మా ఆయన - ఏమో! ఈ గదంతా మీతోనే నిండిపోయిందండీ! ఇప్పటికీ, ఎప్పటి! ఇదంతా పాత సామానంటారేం? ఇదే మీరు?

ఇందులో ప్రతి వస్తువూ మీదు! ఈ గదంతా మీరు (క్షణం ఆగి) నా పిల్లల్ని మీరు బాగా చెడగొట్టేస్తున్నారు

నాన్న ఏడిసినట్టే ఉంది! నేనా చెడగొడుతున్నాను? నేనెలా చెడగొట్టగలనే పిచ్చీ! అదీగాక నేను - ఎన్నేళ్ళయిందిప్పటికి?

అమ్మ మీకు తెలియదూ? పదహారేళ్ళు

నాన్న పదహారేళ్ళయిందీ? చూశావా మరి! పదహారేళ్ళాయి చచ్చిపోయిన వాడి కింక మిగిలేదేముంది? ఏదేనా ఉంటుందే అనుకో! ఆ కాస్తాకూడా నానాటికి హరించుకుపోతుంది.

అమ్మ అదంతా అనవసరం! మీరు వాళ్ళ మీద ఏదో మత్తుమందు జల్లారు అందుకే వాళ్ళకెప్పుడూ ఇక్కడతప్ప మరోచోట కాలు నిలవదు మా నాన్న గొప్ప సిపాయి అని వాళ్ళ బడాయి! అందులో ఎంత ఆకర్షణ వుందో నేనెరుగుదును మిలిటరీ ఉద్యోగంలో ఎప్పుడూ ఉంటుందా ఆకర్షణ!

నాన్న అసలు వాళ్ళ సంగతి నా దగ్గర నువ్వెప్పుడూ ఎత్తకుండా వుంటే బాగుండేది! ఎంత పొరపాటు చేశావు?

అమ్మ పొరపాటా? బాగానే అన్నారు! మీ వూసు కాకపోతే మరేముంది నాకు చెప్పుకొనడానికి? మీరు పోయినతర్వాత నాకు మిగిలిందల్లా మీ జ్ఞాపకాలూ, మీరిచ్చిన పిల్లలూ! ఇంతకన్న నా బ్రతుక్కి ఇంకో హాయి ఏముంది? మిమ్మల్ని పెళ్ళాడడం నా అదృష్టం! మీలాంటి తండ్రి దొరకడం నాపిల్లల అదృష్టం! మీరంటే మన పిల్లలెంత పొంగిపోతారో మీకు తెలుసునా? మీ ఊసులు వినడమంటే వాళ్ళ కెంత యిష్టమని! వాళ్ళ సరదా పాడు చెయ్యమనా మీ ఉద్దేశం!

నాన్నా నువ్వు గోరంతలు కొండంతలు చేస్తున్నావే పిచ్చిదానా! నేనేదో ఆకాశం నుంచి ఊడిపడ్డవాణ్ణని నువ్వనుకుంటున్నావు. ఇలా అన్నానని నొచ్చుకోకేం! ఈ విషయంలో మాత్రం ఇంతవుంటే అంత చెబుతావు నువ్వు! నేనేమీ వీరుణ్ణికాను. నేను చేసిన యుద్ధాలేవీ చెప్పుకోదగ్గవి కావు కొండదొరల పితూరి అణచడానికి వెళ్లాం మేము, మమ్మల్ని ముప్పుతిప్పలూ పెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగించారు వాళ్ళు. ఇందులో వీరత్వం ఏముందో నువ్వేచెప్పు!

అమ్మ . ఎప్పుడూ మీరు ఇలాగే అంటారు కాని మీరు చచ్చిపోయిన తర్వాత నాకు వచ్చిన ఉత్తరంలో చూడండి "వీరాధివీరుడు నీ భర్త! అత్యంత ప్రమాదకరమైన పరిస్థితుల నెదుర్కొని .."

నాన్న : వీరకస్వర్గ మలంకరించాడు! స్వర్గంలో సాక్షాత్తూ ఇంద్రుడే స్వాగత మిచ్చాడు. ఎందుకొచ్చిన కబుర్లివి? నీ మొగుడు చచ్చాడన్న చావుకబురు చల్లగా చెప్పిందా ఉత్తరం! గొప్ప వీరుణ్నే! ఎవరో ఒకరు తెగించాలి! నేను కాకపోతే ఇంకోడు! అంతకన్న మరేంలేదు.

అమ్మ : ఆ తెగించే యింకోడికి అయిదుగురు పిల్లలుండక పోవచ్చును కాదూ?

నాన్న ఆంపాత వాళ్ళు చావనెయ్యకూడదా నేనెందుకు ముందుకు వెళ్ళాలనా అంటావు? పిల్లలున్నంతమాత్రంచేత పిరికితనం చూపించాలా? నేను చేసింది పెద్ద ఘనకార్యమేమీ కాదు! ఎలా బోధపర్చను నీకిది? యుద్ధరంగంలో కాలుపెట్టిన తర్వాత మా ఊహలన్నీ మారిపోతాయి ఇదేమీ నీకర్థం అయ్యేటట్టు చెప్పలేను కూడా! చూడూ! నా విధిని నేను నిర్వహించడం ఘనకార్యమా? ఇతరుల కదో ఘనకార్యంలా కనబడవచ్చునుగాక! అక్కడ ఆ క్షణంలో నా పని నేను చేశానంతే! ధైర్యం అను, సాహసం అను, ఘనకార్యం అను! ఆ సమయంలో ఆ పని చెయ్యక తప్పదు! చేశాను అది నా ధర్మం! ఎడమతట్టున కొండకనుమని రక్షించాలి మా కున్న బలం చాలలేదు ఉన్న బలం తీసుకొని నన్ను వెళ్ళమన్నారు వెళ్ళాను ఇంతా చేస్తే యాభై నలుగురం చచ్చిపోయాం అదో పెద్ద లెక్కకి రాదు

అమ్మ యాభై నలుగురే! వెళ్ళిన వాళ్ళెందరు?

నాన్న వెళ్ళినవాళ్ళెందరు? యాభై నలుగురు! ఎందరం వెళ్ళామో అందరం చచ్చిపోయాం! అయితే ఆ లోయని ఆరురోజులు కాపాడగలిగాం! దానికేంగాని అబ్బ! అప్పుడెంత దాహం వేసిందని! ఎక్కడా ఒక్క నీటిచుక్క దొరకలేదు. ఏమని చెప్పనా దాహం? ఎండిపోయాయి మా గొంతుకలు! అదొహటన్నీ పైగా నాకు ఒళ్ళుతెలియని కోపం వచ్చింది

అమ్మ కోపం ఎందుకు?

నాన్న ఎందుకా కోపం! అనవసరంగా మమ్మల్ని తగిలాడు నేను చెబుతూనే ఉన్నాను అది పద్ధతికాదని నా పై అధికారికి బుర్ర చెడిపోయింది! ఘోరమయిన పొరపాటు చేశాడు మొదట్నుంచీ చెబుతూనే వున్నాను సైన్యాన్ని కొండ దిగువనే ఉంచమని! లోయలోకి రెండువందలమందిని పంపించమని! రెండు వందల మందిని! ఫిరంగులసాయంతో! లేకపోతే లాభంలేదని ముందే నాకుతెలుసు చిలక్కి చెప్పినట్టు చెప్పాను. వింటాడా? పై పెచ్చు గుడ్లుమిటకరించి నాతో ఏమన్నాడో తెలుసా? "సుబేదార్ మేజర్ సాబ్! డర్తేహైం క్యా ఆప్?" అన్నాడు కాళ్ళు వొణుకుతున్నాయా అని అడిగాడు

అమ్మ అందుకని మీరు ముందుకురికా రన్నమాట!

నాన్న ముఖ్యంగా అందుకనే! వాడు తప్పు, నేను రైటు అని ఋజువు చెయ్యడానికి, వాడో గాడిదని అందరికీ తెలియడానికి, మన్యపు దొరలపాటి తెలివి లేక పోయింది వాడికి!

అమ్మ ఇంకొకడి తెలివితక్కువవల్లనా - ఇంకొకడి పొరపాటు వల్లనా మీరు -

నాన్న ఇదంతా అసందర్భంగా కనబడవచ్చు నీకు. సైన్యంలో దీన్ని ఇజ్జత్ అంటారు దాని ముందు ఇంకోపని యేది చేసినా తప్పే

అమ్మ ఈ సంగతి నాకిదివరకెప్పుడూ చెప్పేరు కారేం? పై అధికారి పొరపాటా మీ చావుకి కారణం?

నాన్న అప్పుడప్పుడిలాంటివి జరుగుతూ వుంటాయిలే! ఏం చెయ్యగలం; కాని నా మాట

నెగ్గింది. అదే నాక్కావలిసింది! చచ్చిపోయానంటావా? దానికేం? సాధించాను ఆఖరికి!

అమ్మ : అంతేనన్న మాట! చచ్చిపోయేటప్పుడు మీ రనుకున్న దంతా మీ పంతం నెగ్గిందని మాత్రమేనా? మా వూసే లేదన్నమాట! అప్పుడు మీ దృష్టిలో మేం లేనేలేం కదూ? పోనీ ఇది చెప్పండి. చిట్టిబాబు నా కడుపున పడ్డాడన్న సంగతి ఒక్కమారేనా జ్ఞాపకం తెచ్చుకున్నారా?

నాన్న : పిచ్చిదానా, లక్షసార్లు! ఎందుకు జ్ఞాపకం వుండవూ ఇలాంటి సంగతులు? యిక చావక తప్పదని తెలిసిపోయినవాడి కింతకన్న వేరేయేం ఆలోచనలుంటాయి? మాటవరసకి, గుర్రం ఎక్కి పోతూవుంటాను. మీరు జ్ఞాపకం వస్తారు. ఇంకో మూడు నెలలు. మూడు నెలలలో నాకు సెలవు దొరుకుతుంది. ఇంటికొస్తాను. అప్పటికి పిల్లపుట్టి ఉండాలి. ఇంట్లో కత్తులూ కటార్లూ అజాగ్రత్తగా పడెయ్యకూడదు. పెద్దవాడు సరిగ్గా మిలిటరీ శాల్యూట్ చెయ్యడం నేర్చుకున్నాడా? నారాయణ నేను రాగానే యేం చేస్తాడు? ఏదో ఒకటి కొత్తగా తయారుచేశానని చెప్పి చూపిస్తాడు. కవలలో! ఎవరు ముందుగా నా దగ్గర కొస్తారో అని యిద్దరూ పాకుతూ పాకుతూ కాట్లాడుతూ వస్తారు. "ఎందుకు దెబ్బలాడుకుంటార్రా? ఈ తొడలమీద ఇద్దరికీ కావలసినంత స్థలం ఉంది!" అంటాను. మరి నా భార్య! ఆర్నెలలయింది దాన్ని చూసి! ఆర్నెల్లకి పైగానే అయుంటుంది. నేను ముట్టుకోగానే నా చేతుల్లో కరగిపోతుంది కాబోలు! నన్ను చూడగానే దాని కళ్ళల్లోకి నీళ్ళొస్తా యనుకుంటాను! పిచ్చిపిల్ల! (నిలబడి) ఊఁ సరే ఈ పురాణాలకేంలే! ముందు నీ సంగతి చెప్పు! ఇన్నాళ్ళాయి ఎలా వున్నావు నువ్వు?

అమ్మ : (కళ్ళు మూసుకొని) ఎలా వుండడానికేం వుంది? మీకోసం కనిపెట్టుకొని వున్నాను. మీకింకో కొడుకుని కన్నాను. బక్కపలచగా తయారయాడు. అందరిలాగా బలంగా ఈ ఆఖరివాడెందుకు లేడో? బహుశా వాణ్ణి మోసినన్నాళ్ళూ నేను ఏడుస్తూ వుండేదాన్ని కాబట్టి!

నాన్న : ఎదిగినకొద్దీ పుష్టిచేస్తాడు లెద్దూ! నాలుగు రోజులు వోపిక పడితే అన్నలకన్నా బలంగా తేలుతాడు! చూస్తూవుండు. వాడు వీరాధివీరు డవుతాడు.

అమ్మ : (దిగ్గున మండిపడి) నా చిట్టిబాబు వీరుడు కానక్కరలేదు. నాకు మొగం మొత్తిపోతోంది. మీరు వీరాధివీరులై నాకెంత ఒరగబెట్టారో చూస్తూ ఇంకా నా పిల్లల్ని కూడా ఎందుకు వీరుల్ని చెయ్యడం? అఖ్ఖర్లేదు. కట్టుకున్నవాడు కనబడకుండా పోతే ఆడదాని అవస్థ యెలా వుంటుందో తెలుసా మీకు? మీరు పోయినతర్వాత నేను ఉండలేనట్టే ఉంది. ఎందుకండీ నా గొంతుక ఇలా కోసేశారు? ఎవడో వెధవకి బుద్ధి లేకపోతే ఎందుకు మీరు నిష్కారణంగా చచ్చిపోయారండీ?

నాన్న : నన్నేం చెయ్యమన్నావు చెప్పు! ఆ గాడిద నన్ను పిరికిపంద అన్నాడు. లేకపోతే, కాళ్ళు వొణుకుతున్నాయా అని అడుగుతాడా? అందులోకీ సాటి ఆఫీసర్ల ముందు? అంచేత వెళ్ళక తప్పింది కాదు. పోనీగాని, అప్పుడు నువ్వు నా పక్కనిఉంటే

ఇంతమాట వాడన్న తర్వాత నాకేం సలహా ఇచ్చేదానివి?

అమ్మ : (నిలబడి, నెమ్మదిగా) వెళ్ళమనే దాన్ని వాడినలా మాట్లాడనివ్వకండనేదాన్ని "వెళ్ళండి! చూస్తారేం? మనవంశం యెప్పుడూ మాటపడి యెరగదు" అనేదాన్ని వాడికి బుద్ధివొచ్చేటట్లు మీ చేతికి కత్తిఇచ్చి పంపించేదాన్ని.

నాన్న చూశావా మరి సరిగ నేనెలా అనుకున్నానో నువ్వూ అలాగే అనుకొనేదానివి

అమ్మ . ఔను మీమీద నాకెంతో అపేక్ష మీరే నా ప్రాణం. అంచేత పోనిద్దురూ, ఆడదాని ప్రేమకి అర్థం యేమిటి? మీరంటే నాకెందుకంత ఇష్టం? ఏమో? ఎందుకు మిమ్మల్ని చూస్తే ప్రతి ఆడదీ పడిచస్తుంది? ఏమో! పోనీ నా మాటో? మీలో ఏం చూచుకొని ప్రేమించాను? మీ ఒడ్డూ పొడుగూ, మీ మిలిటరీ వేషం, మీ ధైర్యం, మీ అమాయకత్వం, మర్యాదకోసం ప్రాణానికయినా తెగించడం, దేన్నీ లక్ష్యం చెయ్యకపోవడం! ఏమో ఇవన్నీ కారణం కావచ్చును లేదా నేను వెర్రిదాన్నై మీకు లోబడిపోయి ఉండవచ్చు. మీరు దగ్గర లేకపోతే నాకొక్కక్షణం కూడ తోచకపోయేది మతిపోయినట్టుండేది. ఏమయినా ఇప్పటికీ మీకు అమర్యాద జరుగుతుందంటే నేను సహించలేను. అందుకే మిమ్మల్ని వెళ్ళమనేదాన్ని

నాన్న . చూశావా మరి! అప్పుడు తక్షణం నేను బయల్దేరి ఉండకపోతే -

అమ్మ బతికిఉందురు! ఎంత బాగుండేదప్పుడు మర్యాద దక్కదంటారా? మీ ఉద్యోగం పోయేదంటారా? పోతే పోయింది! నే నున్నాను మీ పిల్లలున్నారు. అందరం కలసి ఈ కొంపలో పడివుందుము అదే అలవాటయ్యేది మీ ఉద్యోగం పోయిందని నేనేమైనా చులకనగా చూస్తానా? ఒక్కనాటికీ అలా తలచకండి పిసరంతయినా మీమీద నాకున్న గౌరవం తగ్గదు. పెద్ద ఉద్యోగం పోయినప్పుడు మాకు బాధగానే ఉండవచ్చు. కాని అన్నిటికీ అలవాటు పడిపోతాం. మీరెప్పుడూ మా దగ్గరే ఉంటారు మీకు నేను సంరక్షణ చేస్తూ -

నాన్న . ఇరుగు పొరుగిళ్ళకేనా వెళ్ళకుండా, ఎవరి ముందూ తలెత్తుకొని తిరగలేకుండా ఎప్పుడూ ఇక్కడే నేనుండాలి. అవునా? అప్పుడు నువ్వు చాలా సంతోషిస్తావు కాదూ?

అమ్మ : సంతోషం లేకపోవచ్చు. సంతృప్తిగా ఉండేది. ఎక్కడికక్కడే నేను తృప్తిపడతానని మీకు తెలుసు. ఇప్పటిదాకా కూడా ఈ సంసారం ఎలా ఈదుకొస్తున్నానో మీకు తెలుసు.

నాన్న . పాపం! ఔను. నా ఫించనురాళ్ళు తప్ప యింకేముంది నీకు? ఇంత సంసారాన్నీ ఒక్క చేతిమీదుగా ఎత్తుతున్నావు.

అమ్మ · అయిదుగురు పిల్లలు! ఈ చేతుల్తో పెంచుకొచ్చాను. ఇప్పుడు చూడండి వీళ్ళని! ఇంకో పెద్దదిక్కులేని యిల్లు! ఇంకో మనిషి సాయంలేదు. వంట చెయ్యడం దగ్గరనుంచీ అన్నీ నేనే! ఇవన్నీ మీ మొగాళ్ళకెలా బోధపడతాయి? క్షమించండి. ఇవన్నీ వెళ్ళబోసుకో కూడదు గాని - యెన్నని చెప్పను? పిల్లలికి లాగులూ, చొక్కాలూ, పది గంటలు దాటకుండా వంటా! ఇస్కూలు జీతాలూ! ఏడాది

తిరక్కుండానే ఇట్టే యెదిగిపోతున్న పిల్లలకి మళ్ళీ లాగులూ. మళ్ళీ చొక్కాలూ, అంట్లూ ఎంగిళ్ళూ, నెలనెలా ఇస్కూలుజీతం? ఎక్కడనుంచి తెచ్చేది? ప్రతి దమ్మిడీ లెక్క చూచుకోవాలి! ఉన్నదాంట్లోనే సరిపుచ్చుకోవాలి! ఇవన్నీ మీకో లెక్కకి రావు ఇందులో నేను చేసిన ఘనకార్యం యేమీ లేదు యుద్ధరంగంలో మీ ధర్మం మీరు నిర్వహించినట్టే ఇంట్లో ఇదీ నా నిరవాకం! అదేమిటండీ అలా చూస్తున్నారు నా వేపు! (తలవంచి) చూశారా నే నేస్థితికొచ్చానో

నాన్న ఎంత అందంగా కనబడుతున్నా విప్పుడు! ఇదివర కెప్పుడూ నువ్వింత అందంగా కనబడలేదు నాకు.

అమ్మ (సిగ్గుతో) చాల్లెద్దురూ ఊరుకోండి! ఏళ్ళు పైబడ్డకొద్దీ బతికున్న వాళ్ళు భయంకరంగా మారిపోతారు మీలో పిసరంతకూడా మార్పులేదు మీ యెదుట ముసిలవ్వలాగ కనబడడం నాకెంతో సిగ్గేస్తోంది. అబ్బా! నావేపు చూడకండి. ఈ మొండిప్రాణం ఎప్పటికీ పోదేం? ఏం సుఖపడ్డానని ఇన్నాళ్ళూ? మీరు పోయిన తర్వాత ఎలాగో ఈ బొందెనిమాత్రం ఈడ్చుకొస్తున్నాను

నాన్న : పాపం. నేనున్నప్పుడు మాత్రం నిన్నేం సుఖపెట్టగలిగాను?

అమ్మ : మీరంటూ వుండడమే నాకు కొండంత ధైర్యంగా వుండేది. పిల్లలు పెద్దవాళ్ళయి చెయ్యి దాటిపోతున్నకొద్దీ మీరు లేని లోపం మరీ స్పష్టంగా కనబడేది. మీరు మరోలా అనుకోకండి నా పిల్లలు నాకెప్పుడూ ఎదురుతిరగలేదు ఆదిమూర్తి, నారాయణ, కవలపిల్లలు అంతా నేను చెప్పినట్లు వినేవాళ్ళు. కాని అంతమందీ పెద్దవాళ్ళవుతున్న కొద్దీ నాకు దూరమయిపోతున్నారు వాళ్ళ చేతలు బోధపడకపోతున్నాయి. వాళ్ళ మాటలు బోధపడకపోతున్నాయి. మళ్ళీ యెంత మప్పితంగా పెరిగిన బిడ్డలు! చిత్రంగా లేదూ? వాళ్ళ సంగతి నాకేమీ బోధపడకుండా వుంది! వాళ్ళ మాటలు నాకన్నా మీకెక్కువ బోధపడతా యనుకుంటాను.

నాన్న : నాకంతా మరీ గొడవగా వుంటుంది. వెర్రిభ్రమ! ఆదిమూర్తి డాక్టరు. వాడి భాషే వేరు నారాయణ విమానాలను గురించి మాట్లాడుతాడు. మా రోజుల్లో విమానాలంటేనే విడ్డూరం! ఇక ఈ కవలపిల్లలున్నారా? వీళ్ళ అభిప్రాయాలేమిటో, ఎందుకలా ఎప్పుడూ కీచులాడుకుంటారో నా కర్థం కాదు. అయినా వాళ్ళు మాట్లాడేది దేన్నిగురించి?

అమ్మ : రాజకీయాలు!

నాన్న . ఔ నా మరి! అవంటేనే నాకు తలనొప్పి. నేను వొఠి సిపాయిగాణ్ణి.

అమ్మ : కాని మన పిల్లలందరూ మిమ్మల్నే ఎప్పుడూ తలుచుకుంటూ వుంటారు. పెద్దయాక వాళ్ళనికూడా మిలిటరీలో ప్రవేశపెట్టడమే మీ వుద్దేశమని నాకు తెలుసు. కాని మీరు చచ్చి పోయినతర్వాత ఇక వాళ్ళని సేనలోకి పంపించకూడదని నిశ్చయించాను. మిలిటరీ కాలేజిలో వాళ్ళకి డబ్బు పుచ్చుకోకుండా చదువు చెబుతారు గాని నేనే ఎలాగో కిందా మీదా పడి వాళ్ళకి చదువు చెప్పించాలని స్థిరం చేసుకున్నాను. డాక్టరు చదువుగాని, ఇంజనీరింగు కాని మరేదయినా సరేగాని, మిలిటరీలోకి మాత్రం

వాళ్ళను పంపకూడ దనుకున్నాను లోకానికి పనికొచ్చే పని యేది చేసినా చాలు. చచ్చిపోకుండా మాత్రం వుండాలి అనుకున్నాను వాళ్ళ చదువులకోసం నే నెన్ని తిప్పలు పడ్డానో మీకెలా చెప్పేది! ఇప్పుడు చూడండి మన పిల్లలెలా తయారయ్యారో!

నాన్న : వాళ్ళకేం! లక్షణంగా వున్నారు! లేరనా నీ వుద్దేశం?

అమ్మ : ఏమో నాకు తెలియదు నా కడుపున సింహాలూ, పెద్దపులులూ పుట్టినట్లనిపిస్తుంది అలా అనుకోడం తప్పని ఒక్కొక్కప్పుడనుకుంటాను వాళ్ళ బతుక్కి అడ్డు రాకూడదనుకుంటూ వుంటాను మాతృత్వం సిద్ధించగానే ఆడది ఎలా మారిపోతుందో మీకు తెలియదండీ! ఆమె స్వభావమే పూర్తిగా మారిపోతుంది ఒకప్పుడెంత గర్వంగా తిరిగేదాన్ని నేను! మీకు జ్ఞాపకం లేదూ మన పెద్దవాడు పుట్టిన కొత్త రోజుల్లో!

నాన్న : ఎన్నాళ్ళయిపోయింది?

అమ్మ : నాకింకా నిన్న కాక మొన్నలాగుంది మనం వేరింటి కాపురం పెట్టాలని మిమ్మల్ని వేధించాను నగలన్నీ అమ్మేస్తానన్నాను. నా ప్రాణం యిచ్చేస్తానన్నాను! ఇప్పుడో? నాకివ్వడానికేమీ లేదు మొదట మిమ్మల్నిచ్చేశాను తర్వాత నా పెద్దకొడుకు నిచ్చేశాను. ఇక నేను త్యాగాలేవీ చెయ్యలేను నా పిల్లలు నాకు దక్కితే చాలును. వాళ్ళు వీరులు కానక్కరలేదు ఘనకార్యాలు చెయ్యనక్కర లేదు చేసిన ఘనకార్యాలు చాలును. నా బతుకు నాశనంచేసి పోయారు! మొదట మీరు! ఆ తర్వాత నా పెద్దకొడుకు!

నాన్న : ఆదిమూర్తికేం! అమోఘమైన మరణం వాడిది మానవ సేవలో ప్రాణం వదలడం అమోఘం కాదూ?

అమ్మ : ఏం అమోఘమో? ఏదో ఒక ఆశయం పేరిట చచ్చిపోతే అదో గొప్ప అనుకుంటారు మీరు కాని మీ వెనక యెవరిని దిగవిడిచి పోతున్నారో ఆ సంగతేమీ మీ కక్కరలేదు పోనీ మీ మాట అలా వుంచండి సైన్యంలో వున్నారు కాబట్టి చచ్చిపోవడం మీకు విధాయకమే. కాని నా పెద్దవాడెందుకు చచ్చిపోవాలి? చెట్టంత ఎదిగినవాడు డాక్టరు పరీక్ష ప్యాసయినవాడు. పదిమంది ప్రాణాలు రక్షించవలసినవాడు. నలుగురిలో గౌరవంగా బ్రతకవలసినవాడు నాకొడుకెందుకు చచ్చిపోవాలండీ?

నాన్న : డాక్టర్లకి సహా మరణం తప్పదు. మా పటాలంలో ఒక డాక్టరిలాగే హఠాత్తుగా చచ్చిపోయాడు ఎంత మంచివాడని! మేం తరుచూ చదరంగం ఆడుతూ వుండేవాళ్ళం ఉభేత్తుగా ఒక రోజు మన్యపు జ్వరం వచ్చి తెల్లారేసరికి కొట్టేసింది

అమ్మ : నా కొడుకుని ప్లేగు తినేసింది. పరాయిదేశంలో ప్రాణాలు వదిలి పెట్టాడు నా కొడుకు! ఇదంతా మీరు చేసిన పనే!

నాన్న : నేనా? నీకేం వెర్రెత్తిందేమిటి? నేను చచ్చిన పది సంవత్సరాలకి కదూ ఆదిమూర్తి విదేశాలకి వెళ్ళాడు?

అమ్మ : ఔనుగాక, ఆదిమూర్తి చావుకి మీరే కారణమంటాను ఎప్పుడూ వాణ్ణి మీరు ఈ గదిలోకి, మీ దగ్గరకి లాక్కునేవారు! ఎప్పుడూ వాడు ఇక్కడే చదువుకునేవాడు.

గంటలతరబడి యీ గదిలోనే వుండిపోయేవాడు అటూ యిటూ పచార్లుచేస్తూ, సిగరెట్టు తెగపీలుస్తూ! అదేదో దేశంలో అమ్మా నాకు పెద్ద ఉద్యోగం అయిందన్నాడొకరోజున! అంతదూరం వెళ్ళొద్దన్నాను నేను ప్రపంచాన్ని చూడాలని ఉందన్నాడు ప్లేగుతో పోరాడడానికి వెళుతున్నాడని నాకేం తెలుసును? మీరంతా యింతే. ఏ సంగతీ నాకు నిజం చెప్పరు. ఇదుగో వస్తున్నానని వెళ్ళిపోతాడు మరి తిరిగిరాడు నా కొడుకు నాతో చెప్పకుండా నా బతుక్కి ఆరని అగ్నిహోత్రం అంటించిపోయాడు.

(ఒక మూల చీకటిలో నుంచి ఆదిమూర్తి ప్రవేశిస్తాడు డాక్టర్ల తెల్లని అంగరఖా ధరిస్తాడు )

ఆదిమూర్తి - అమ్మా! వెళ్ళుతున్నానని నేను చెప్పలేదే నీకు? మనం ఎంత వాదించుకున్నామో నీకు తెలియదూ? ప్లేగుమాట చెప్పలేదు. బెంగ పెట్టుకుంటావని. అంతే

అమ్మ - అంతేనన్నమాట! నాకు చెప్పనక్కర లేదనుకున్నావు ఆ వ్యాధి నీకే అంటుకొవచ్చునని ఒకనాటికి నువ్వనుకోలేదు. కాని చెబితే నేనుకుందును అదే నా భయం

ఆదిమూర్తి - అందుకే నేను చెప్పలేదు చెప్పాననుకో నువ్వు వెళ్ళవద్దనే దానివి అయినా యెలాగూ నేను వెళ్ళేవాణ్ని

అమ్మ నిజంగా వెళ్ళేవాడివా? చూడు నాయనా! నా వేపు చూడు నువ్వెప్పుడూ నా మాట జవదాటలేదు ఎంతో మప్పితంగా పెరిగినవాడివి నాన్నగారు పోయింతర్వాత సంసారం బరువంతా నీ నెత్తిమీద వేసుకున్నావు నువ్వు లేకపోతే నా గతి యేమయిపోతుందో అనుకునేదాన్ని ఇంతట్లో హఠాత్తుగా వెళ్ళిపోయావు చెప్పకుండా చెయ్యకుండా వెళ్ళిపోయావు అక్కడ చచ్చిపోయావు ఎంత పని చేశావురా నాయనా? ఎందుకంత పని చేశావు

నాన్న · ఏడవడం మాని యిటుచూడవే వెర్రిదానా! డాక్టర్లకి కూడా కొన్ని విధులుంటాయి. రోగుల్ని కాపాడడం వాళ్ళ వృత్తి ధర్మం! అంతేకాదురా ఆదిమూర్తీ!

అమ్మ · ప్లేగు వ్యాధి! దాని జోలి కెందుకు వెళ్ళాలి? ఈ వూళ్ళో మందులిచ్చుకుంటూ బతక్కూడదూ? ఆ సహాయం ఏదో యిక్కడి రోగులకే చెయ్యరాదూ?

ఆదిమూర్తి అది కాదమ్మా! అక్కడ యేటేటా వందలకొద్దీ ప్రజలు ప్లేగుతో చచ్చిపోతున్నారు నేను ప్లేగును గురించి ప్రత్యేకంగా చదువుకున్నాను. దానితో పోరాడకపోతే నా చదువెందుకు? కాల్చనా? నా ధర్మం నేను నిర్వహించాను అంతే!

అమ్మ . అది ప్రత్యేకం నీ ఒక్కడి ధర్మమేనా?

ఆదిమూర్తి అది సైన్సు ధర్మం సైన్సు మానవులకి సహాయపడాలి. నువ్వొకసారి ఆ చచ్చిపోతున్న జనాన్ని చూశావంటే "వెళ్ళరా నాయనా వెళ్ళు, వాళ్ళను రక్షించు" అని నువ్వే నన్ను పంపించేదానివి. ఇది నిజంగా గడ్డు సమస్యమ్మా! యెవరో ఒకరు సాహసించి తీరాలి.

అమ్మ . అయితే యెవ్వరినో సాహసించనివ్వక నువ్వే ఎందుకు వెళ్ళాలంటాను?

నాన్న ఎందుక్కూడదూ? ఆదిమూర్తి తెలివైనవాడు. దేనికైనా తెలివైన వాళ్ళే ముందుగా తెగించాలి. మనదగ్గర వున్న కోళ్ళన్నిట్లో మంచిదాన్నే అమ్మవారికి బలి వేస్తామని మరిచిపోకు.

అమ్మ   మంచి మనుషుల్ని కూడా బలి యిచ్చెయ్యవలసిందేనా?

నాన్న   సమయం వచ్చినప్పుడు తప్పదే పిచ్చిపిల్లా! లోకంపోకడే అంత! ముందుగా మంచివాళ్ళే ఆహుతై పోతూవుంటారు నువ్వేమీ ఇదవకురా ఆదిమూర్తీ! పసందైన పనిచేశావు నువ్వు!

అమ్మ   ఇంతే మొగాళ్ళంతా యింతే నాతో వాదించవలసి వచ్చినప్పుడు మీరంతా ఒక్కటైపోతారు పసందైన పని చేశాడని మీకేం, మీరనేస్తారు ఆ టెలిగ్రాము చూసినప్పుడు నా గుండె లాగిపోయాయంటే నమ్మండి కళ్ళు చీకట్లు కమ్మిపోయాయి "మీ అబ్బాయి ప్లేగు వ్యాధితో పోరాడుతూ వీరోచితంగా మరణించాడు నిజమైన సైంటిస్టుగా చనిపోయాడు!"

నాన్న   అదీమాట! నా కొడుకు వీరుడు! నువ్వు వీరమాతవి హీరోలాగ చచ్చిపోయాడని వుంది కాదూ టెలిగ్రాములో! యువర్ సన్ డైడ్ ఎ హీరో ఇన్ ది కాజ్ ఆఫ్ సైన్స్!

ఆదిమూర్తి   దానికేంలే నాన్నా! నేనేమీ హీరోనుకాను. ప్లేగువ్యాధికి మూలం కనుక్కోవడం మాత్రమే నాక్కావలసింది సైంటిస్టన్నవాడెప్పుడూ మూల కారణాలకోసం వెదుకులాడుతూ వుంటాడు అదొక్కటే అతని ఆసక్తి ఇక హీరో కావడమంటావా అదంతా వొట్టి ఆర్భాటం! కొత్త సంగతి కనిపెట్టడం గొప్ప సంగతి అదెంత చిన్నదైనాసరే చాలా అమోఘమైనది.

అమ్మ   : అయితే నువ్వేదేనా కొత్త సంగతి కనిపెట్టగలిగావా?

ఆదిమూర్తి   నేను కనిపెట్టలేకపోతే నేమమ్మా ఇంకోళ్ళిద్దరు కనిపెట్టగలిగారు ఒకడు పంజాబీ, మరోడు అరవాయన

నాన్న   అరవ్వాళ్ళంటే నాకిష్టంలేదు. నువ్వు కనిపెట్టలేక పోయినందుకు నాకు కష్టంగా ఉంది

అమ్మ   ఎందుకు నాయనా ఈ కనిపెట్టడాలు? ఏం లాభం వీటివల్ల? అనవసరం కావూ ఇవన్నీ?

ఆదిమూర్తి . అబ్బ! నీ కదంతా తెలియదు. ఊరుకో, అమ్మా!

అమ్మ   . ఔను. నాకేమీ తెలియదు నాకేమీ అర్థంకాదు మీరెవ్వరూ నా కర్థం కారనుకుంటాను నారాయణకూడా ఇలాగే అంటాడు కవలలూ ఇలాగే. "ఊరుకోవే అమ్మా! నీకేం తెలియదు" నాకేం తెలియదు భగవంతుడా! ఇంక కొన్నాళ్ళుపోతే నా సంగతే నాకేమీ తెలియకుండా పోతుంది! నా కడుపున పుట్టిన పిల్లలు! నా రక్తమాంసాలు పంచుకు పుట్టినవాళ్ళు మీరే అంటున్నారు నాకే సంగతీ తెలియదని! ఏదీ, ఇది చెప్పు నాయనా! ఏమిటి మీలో వుంది నా కర్థం కానిది? ఎందుకు మీరు నాకింత దూరమై పోతున్నారు? వేరైపోతున్నారు? నాకు మీరర్థం కానట్లు చేస్తున్న ఆ విచిత్రమైన విషయమేమిటో చెప్పు నాయనా వింటాను.

ఆదిమూర్తి : (ఆమెను సమీపిస్తూ) అదుగో! అమ్మా! నువ్వలాగ ఉద్రేకం తెచ్చుకుంటే దడపుడుతుంది అసలే నీ గుండె గట్టిది కాదు. ఏదేనా ప్రమాదం రావచ్చు.

అమ్మ ఉండు! నన్ను మాట్లాడనియ్యి నేను చెప్పదలచుకున్నది చెప్పనియ్యి! ఇంతింత చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు మీరెంతో బాగా అర్థమయేవారు నాకు జ్ఞాపకం వుందీ నీకు? ఇంట్లో వొండుతూ వుండేదాన్ని నేను వీధిలో బుగ్గిలో ఆడుతూ వుండేవాళ్ళు మీరు మీలో ఎవరైనా పడిపోయి దెబ్బ తగుల్చుకున్నారంటే ఎంత దూరాన వున్నా తెలిసిపోయేది నాకు దబ్బున పరుగెత్తుకొని వచ్చేదాన్ని. నా చుట్టూ మిమ్మల్ని పెట్టుకొని, మీ అందరికీ అన్నం కలిపి తినిపించుతున్నప్పుడు ఎందుకో నా ఒళ్ళంతా ఒక్కసారి ఉప్పొంగిపోయేది! వీళ్ళు నా పిల్లలు! నావాళ్లు! నా కళ్ళు! వీళ్ళే నేను! నేనే వీళ్ళు! అప్పుడు మీరు నాకంత బాగా అర్థమయేవాళ్ళు! ఇప్పుడో, నీకేం తెలియదే! నువ్వూరుకోవే అమ్మా! ఇదీ వరస ఏమండీ మీరు చెప్పండీ! ఎందుకు వీళ్ళంతా యిప్పుడిలా మారిపోయారు? ఎంచేత నా పిల్లలే నాకు కానివాళ్ళయిపోతున్నారు? చెప్పండి మిమ్మల్ని బతిమాలుకుంటున్నాను!

నాన్న చెప్పడానికేముంది! పిల్లలెదిగి పెద్దవాళ్ళయారు! ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క గొడవల్లో పడుతున్నారు ఎవళ్ళ గొడవలో వాళ్ళు అంతే కాదూ?

అమ్మ అంతేనా? నా గొడవమాత్రం ఎప్పుడూ వాళ్ళతోనేకదా! వాళ్ళు తప్ప నాకింకో లోకం లేదుగదా! మీ కందరికీ ఏవేవో పెద్ద పెద్ద పనులుంటాయి! పెద్ద పెద్ద ఆశయాలుంటాయి! పెద్ద పెద్ద ఆలోచనలుంటాయి! ఏమేనా అంటే నా కవేమీ అర్థం కావంటారు కాని నా ఆలోచనలన్నీ మీమీదే! నా తాపత్రయాలన్నీ మీ కోసమే! ఇందులో గొప్ప చెప్పకోవడానికేమీ లేదులెండి మీ క్షేమం కోరడం! మీరేమై పోతారో అని బెంగపెట్టుకోవడం! ఏముంది ఇందులో గొప్ప! కాని, నా అయిదుగురు పిల్లలకీ అన్నం పెడుతున్నప్పుడు ఏ దేవుడి గుడిలోనో అభిషేకం చేయిస్తున్నట్లు అనిపించేది నాకు! నాయనా పెద్దవాడా! నువ్వు లేకపోవడం ఈ యింటికెంత వెలితిగా ఉందిరా!

ఆదిమూర్తి నేనేం చెయ్యను! చెప్పు! నాకూ విచారంగానే ఉందే అమ్మా!

అమ్మ ఔను కాబోలు! నువ్వన్నదే సరికావచ్చునని తోస్తుంది! ఔను. బుద్ధిలేనిదాన్ని! నాకేమీ అర్థం కాలేదు మాటవరసకి మీ నాన్న మనుష్యుల్ని చంపడానికి వెళ్ళి చచ్చిపోయారు. నువ్వు వెళ్ళి మనుషుల్ని బతికించబోయి చచ్చిపోయావు ఔనిది తెలివితక్కువదాన్ని నాకేమర్థమవుతుంది! ఇద్దరూ ఒకరు చేసినదానికి సరిగ్గా వ్యతిరేకమైన పని చేస్తారు. ఇద్దరూ ఘనకార్యాలు చేశామంటారు మీ ఉన్నతాశయాలు నాకేమీ అర్థంకావంటారు మీలో ఒకరు ఏదైనా పెద్ద యిల్లు కడతారు రెండోవారు దాన్ని నేలమట్టం చేస్తారు. ఇద్దరూ వచ్చి నా దగ్గర అంటారుకదా! "ఔనమ్మా! ఇవి చాలా ముఖ్యమైన పనులు. మా ప్రాణాలు ధారపోసి అయినాసరే ఇవి మేము చెయ్యక తప్పదు. ఇవేమి నీకు బోధపడవు. వూరుకోవే అమ్మా" అంటారు మీకేం పోయింది. మీరెంతో సులభంగా చెప్పేస్తారు మాటలు! చచ్చిపోవడం సులభమే ఔనుగాక! మొగుణ్ణి పోగొట్టుకోవడంలాంటిది, కొడుకుని పోగొట్టుకోవడం లాంటిదిమీ కెవరికైనా, ఎప్పుడైనా సంభవిస్తే అప్పుడు మీకు తెలుస్తుంది నా క్షోభ!

ఆదిమూర్తి ఆ మాటమాత్రం నిజమే సుమీ!

అమ్మ . నిజమైతేనేం అబద్ధమైతేనేం మీరింక నాకు మళ్ళీ దక్కనప్పుడు? ఎందుకు చచ్చిపోయావురా నాయనా! ఎంత మంచివాడివి నువ్వు! ఎంత జాగ్రత్త పరుడివి! నీ పెళ్ళి కూడా నిశ్చయమయిందని మరచిపోయావా? పెళ్ళి చేసుకోవలసింది నువ్వు! అప్పుడు నువ్విక్కడే వుండేవాడివి! అంతేనంటావా?

ఆదిమూర్తి (తల వంచి) అంతే కాబోలును

(తోటలోంచి రెండుగుళ్ళు పేలిన చప్పుడు)

నాన్న (నాన్న తలయెత్తి) ఏమిటా చప్పుడు?

అమ్మ ఏంలేదు గురిచూసి కొడుతున్నారు కవలవాళ్ళ కదో ఆట!

నాన్న సెబాస్! సెబాస్! చాలా బాగుంది గురిచూసి కొట్టలేనివాడు ఎందుకూ పనికిరానివాడన్నమాట

అమ్మ చిట్టిగాడికి తుపాకులంటే అసయ్యం! ఆ జోలికిపోడు! ఆదిమూర్తి కూడా అంతే! ఔను కాదూ? నువ్వెప్పుడూ నీ పుస్తకాలేవో నీ చదువేదో అంతేకాదూ! ఇప్పుడు నీలాగే తయారవుతున్నాడు చిట్టిబాబు

ఆదిమూర్తి కాని చిట్టిబాబు విషయంలో పుస్తకాలొక వ్యసనంలాపట్టుకున్నాయి. అవి చదువుతూ వాడు ప్రపంచాన్నే మరచిపోతాడు అదేమంత మంచిదంటావా నువ్వు?

అమ్మ అయినా ఇంకా వాడికి కుర్రతనంకదా!

ఆదిమూర్తి . ఎన్నేళ్ళొచ్చినా వాణ్ణిగురించి ఎప్పుడూ నువ్విలాగే అంటూ వుంటావు.

అమ్మ . వాడు వొట్టి అర్భకుడు

నాన్న . ఏదేనా ఒక తగినదారిలో పెట్టాలి నువ్వు వాడిని.

అమ్మ . అక్కర్లేదు మీరందరూ చూసుకున్న దారులు చాలును! ఈ యీడున వాడికి ఏ బుద్ధులూ పుట్టనక్కరలేదు. మీరు వాడి తలలో లేనిపోని ఊహ లెక్కించి చెడగొడతారు. చిట్టిగాణ్ణి యికమీద ఇక్కడికి రానివ్వను.

నాన్న . ఎంచేత?

అమ్మ : ఎంచేతనా? వాణ్ణి మీరు వశం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు కాబట్టి నాకు తెలుసు వాడి చెవులో రహస్యంగా ఊదుతారు. "లేవరా సింహం! ఏదీ నీ మగతనం! ఏదైనా గొప్పపని చేసిచూపించు. లే! నీ ప్రాణాలని ఆహుతి యియ్యి! కీర్తికోసం, గౌరవంకోసం, సత్యంకోసం నీ ప్రాణాలని సమర్పించు'.' నాకక్కర్లేదు. వీల్లేదు, ఒప్పుకోను, తెలిసిందా! నా సింహం జోలికి మీరెవ్వరూ వెళ్ళడానికి వీల్లేదు

నాన్న . అదేమిటే అలా అంటావు? చిట్టిగాడు వొట్టి దద్దమ్మ కావడం నీకిష్టమన్నమాట!

అమ్మ . చిట్టిగాడు నన్ను వదలకపోవడం నాకు కావాలి. వాడిమీద మీకెటువంటి అధికారమూలేదు. మీరు చచ్చిపోయినతర్వాత వాడు పుట్టాడు వాడు నావాడు. నా సొంతం మరొహళ్ళకి వాడిమీద హక్కులేదు. చూస్తానుగా. ఇకమీద వాడీ గదిలోకి ఎలా వస్తాడో?

నాన్న : మనతో కూడితే ఎప్పుడూ వోడిపోతాననుకుంటున్నావా అమ్మా!

అమ్మ : ఔను తప్పకుండా! ఎందుకంటే మీరు చచ్చిపోయినవాళ్ళు వాడు బతకవలసినవాడు (తోటలో మళ్ళీ చప్పుడు)

ఆదిమూర్తి : అమ్మా! మమ్మల్ని చూసి జడుసుకుంటున్నావటే?

అమ్మ : జడుపా మీ దగ్గర నాకు జడుపెందుకు? ఇలా దగ్గరగా రారా అబ్బాయీ ఎన్నాళ్ళయింది నిన్ను చూసి! ఎంత బాగున్నాయో నీకీ డాక్టరు దుస్తులు! నీ చేతులమీదిగా వెళ్ళిపోతాననుకున్నానురా బాబూ! ఇలా అవుతుందనుకోలేదు

ఆదిమూర్తి : ఊరుకో అమ్మా! నువ్వు నూరేళ్ళు బతుకుతావు నీకు చావే వుండదు ఎప్పుడూ నువ్విక్కడే వుంటావు

నాన్న : మనందరికన్నా గట్టిప్రాణం మీ అమ్మది ఆ సంగతి వాడికి తెలియదు (చదరంగప్పలకం వున్న టేబిలు దగ్గరకు నడిచి) ఎవరిక్కడ బలం పేర్చారు?

అమ్మ : కవలలు! ఇంతసేపూ ఒకటే కొట్లాట మీ పుస్తకంలోదే ఏదో సమస్యట!

నాన్న : ఔనౌను జ్ఞాపకం వచ్చింది ఇదెప్పుడో నేను మొదలుపెట్టి వదిలేశాను అప్పను చాలా గమ్మత్తయిన సమస్య!

అమ్మ : ఇద్దరూ ఏం దెబ్బలాడుకున్నారని! అయిదింట మంత్రి అంటాడు లక్ష్మన్న! అలా పనికిరాదంటాడు రామన్న!

నాన్న : లక్ష్మన్న అన్నదే రైటు! ఏమయినా నేను వేసే ఎత్తు అదే!

అమ్మ : కాని ఇంకేదో పద్ధతి కూడా వుందంటాడు రామన్న వాళ్ళ కొట్లాటలు మీకు తెలియవ్వ కనకనా? వీడు యతీ అంటే వాడు ప్రతీ అనక తప్పదు

నాన్న : (పరధ్యానంగా) ఇంకో పద్ధతా? ఏమిటి చెప్మా ఆ పద్ధతి! బహుశా యిప్పుడు చదరంగం యింకో రకంగా ఆడుతున్నారనుకుంటాను బహుశా యీ బంటును యిలా కదుల్చుతారు కాబోలును . అరే తమాషాగా వుందే! ఇదేదో కనిపెట్టవలసిందే! రామన్న అన్నదాంట్లో కూడా యేదో వున్నట్టుంది.

(వైమానిక దుస్తులు ధరించి చడీచప్పుడు లేకుండా తలుపు తీసుకుని నారాయణ ప్రవేశిస్తాడు)

నారాయణ : వచ్చేశానే అమ్మా! ఇదుగో నాన్నకూడా యిక్కడే వున్నాడు! ఆదిమూర్తికూడాను! నమస్కారం నాన్నగారూ! బాగున్నావురా అన్నయ్యా?

నాన్న : నారాయణకాదూ? ఎంత పొడుగు ఎదిగాడో!

ఆదిమూర్తి : బాగానే వున్నాను నువ్వో?

అమ్మ : ఇంత పెందరాళే వచ్చావేమిరా నాయనా? రోజూలాగ విమానం వేసుకొని వెళ్ళలేదూ?

నారాయణ : ఎందుకు వెళ్ళలేదూ? ఎంత బాగుందనుకున్నావు ఇవాళ ఆకాశం!

అమ్మ : ఏమయితేనేం యింటిపట్టు చేరుకున్నావు అదే చాలు నాకు నువ్వు విమానం ఎక్కావంటే నాకు చెడ్డ భయం పోనీలే! పెందరాళే ఇంటికొచ్చావు చాలు!

నారాయణ ఏముందమ్మా! ఎప్పుడూ చెప్పగా నీ దగ్గరకే వస్తానమ్మా!

నాన్న చూడే ముందువని! ఈ దుస్తుల్లో వీడెంత బాగా వున్నాడని! గంధర్వ రాజులా వున్నావురా అబ్బాయీ!

అమ్మ (నిర్ఘాంతపోయి దగ్గర నిలబడుతుంది) ఏమిటి? నాన్నా, అన్నయ్యా కనపడుతున్నారా, నీకు నారాయణా?

నారాయణ ఆదేమిటమ్మా అలా అడుగుతావు? అదుగో నాకు కనబడుతూంటేనే?

అమ్మ అరె, వాళ్ళెప్పుడో చనిపోయారు! ఎలా కనబడుతున్నారు నీకు? ఎలా మాట్లాడగలుగుతున్నావు వాళ్ళతో?

నారాయణ (నింపాదిగా) ఎలాగంటావా? కోప్పడవుకద. చెబుతాను కోప్పడకేం! ఆకాశం నడుమని నా విమానం అల్లరి పెట్టింది అంతే!

అమ్మ అంటే మరేం ప్రమాదం నీకు .

నారాయణ మరేంలేదమ్మా! సునాయాసంగా పడిపోయాను విమానం కుడిరెక్క వూడిపోయింది కోప్పడకేం! నేను నేను

అమ్మ నారాయణా! నువ్వు నాదగ్గర ఏమిటో దాస్తున్నావు

నారాయణ మరి నువ్వు కొప్పడకూడదు విమానం కూలిపొయి నేను చచ్చిపోయాను

అమ్మ ఏమిటీ నువ్వు నువ్వు

నారాయణ అమ్మా! నువ్వు గాబరాపడకూడదు

అమ్మ. (వేలితో చూపుతూ) నువ్వు చచ్చిపోయావన్న మాట!

నారాయణ ఔనమ్మా! లోకం నేను చచ్చిపాయాననే అంటుంది

అమ్మ (ఏడుస్తుంది) కొడుకో! అయ్యో నా కొడుకు! నా నారాయణ!

నారాయణ. ఏడవకమ్మా! ధైర్యంగా ఉండాలి మరి

అమ్మ ఎంతపని చేశావురా నాయనా! ఇలా వెళ్ళావు, ఇలా చచ్చిపోయావు! ఇక నిన్నెక్కడ వెతుక్కొనురా బాబూ!

నాన్న ఊరుకోవే పిచ్చీ! నారాయణ వీరోచితంగా ప్రాణాలు విడిచి పెట్టాడు! అమోఘమైన మరణం!

అమ్మ నన్ను తగలేసిన మరణం! నాకెందుకురాదీచావు? చావును మెచ్చుకుంటారేమిటండీ, తెలివితక్కువ కాకపోతే!

నారాయణ నిజం అమ్మా! ఇందులో ఎవరి తప్పులేదు నేను చిన్నస్టంటు వెయ్యబోయాను ఇంజను చెడిపోయింది నిజం అమ్మా! ఇప్పటికీ నాకు సరిగా తెలియదు ఎందుకు విమానం కూలిపోయిందో!

అమ్మ కొడుకో! (అని కేకవేసి కుర్చీలో కూలబడి ఏడుస్తూ ఉంటుంది)

ఆదిమూర్తి అలాగే ఉండనీ అమ్మని! కొంతసేపట్లో అంతా సర్దుకుంటుంది (ఆమె పక్కనే నిల్చుంటాడు)

నాన్న (నారాయణని ఒక పక్కకి తీసుకువెళ్ళుతూ) ఏమిటిరా అబ్బాయీ ఈ కొత్త స్టంటు?

నారాయణ మరేంలేదు నాన్నా! అల్టిట్యూడ్ రికార్డు బరువు వేసుకొని పదిహేనువందల కిలోగ్రాంల బరువు

నాన్న అలా కొత్త రికార్డు స్థాపించడంవల్ల ఏమైనా ప్రయోజనం ఉంటుందంటావా?

నారాయణ ఎందుకుండదూ? యుద్ధంలో మన విమానాలు ఎంతెంతో ఎత్తుగా ఎగురుతాయన్నమాట! పదిహేనువందల కిలోగ్రాంల బరువుగల బాంబులను తీసుకెళ్ళగలుగుతాయన్నమాట

నాన్న ఔను సుమా! అది చాలా గొప్ప సంగతే!

నారాయణ ఆకాశ ప్రయాణం అతి సులభమవుతుంది. నేను వెళ్ళిన ఎత్తున మేఘాలూ, తుపానులూ ఉండవు ఎంత లాభమో అది ఆలోచించునాన్నా!

నాన్న నువ్వెంత ఎత్తుకి వెళ్ళావురా బాబూ!

నారాయణ అరవై వేల అడుగుల ఎత్తు దాటిపోయాను ఇంతట్లోకే ఇంజన్ ఇబ్బందిపెట్టడం మొదలెట్టింది

నాన్న అయితే నువ్వు కొత్త రికార్డు స్థాపించినట్టా? లేనట్టా?

నారాయణ ఈ విమానానికీ, ఈ పరిస్థితులకీ నాది కొత్త రికార్డే!

నాన్న భేష్! నాకు చాలా సంతోషమయిందిరా బాబూ!

నారాయణ అయితే నేనీ రికార్డు స్థాపించినట్టు ఎవరికీ తెలియదు. విమానం నుగ్గు నుగ్గయిపోయింది ఆల్టిమీటరు పాలికలేకుండా ధ్వంసమయింది ఇందుకు నాకు చాలా విచారంగా వుంది

నాన్న ఎందుకూ విచారం?

నారాయణ ఆల్టిమీటర్ ఉంటే నేనెంత ఎత్తుకి ఎగరగలిగానో తెలిసేది ఇప్పుడెవరికీ తెలియదు

నాన్న తెలియకపోతేనేం? అరవై వేలు దాటావు అదీ ముఖ్యమైన సంగతి

నారాయణ ఎవరికీ తెలియని సంగతివల్ల ఏం లాభం నాన్నా?

నాన్న నువ్విది సాధించగలగడమే గొప్ప సంగతి ఇంతవాడివి నువ్వవుతావని ఎవరనుకున్నారు? నిజంగా నిన్ను చూసి గర్వపడుతున్నానురా బాబూ!

అమ్మ . (ఏడుస్తూ) నారాయణా! నాయనా! నా చిన్ని నాయనా!

ఆదిమూర్తి ఊరుకో, అమ్మా! ఊరుకో.

నాన్న ఏడుస్తావేమిటే! ఈ చావు వృథా కాదు. ఏడవకు మరి! చూడూ! ఇక మీద చెయ్యవలసిన దెంతో ఉంది

నారాయణ నన్ను వాళ్ళిక్కడికి తీసుకొచ్చి నప్పుడు నావేపు చూడకూడదు సుమా! వాళ్ళు తెచ్చేది నా కట్టెను మాత్రమే. నేనెప్పుడూ ఇక్కడే ఉంటానమ్మా నీ కెప్పుడూ ఇలాగే కనబడతాను.

అమ్మ · ఎందుకు వెళ్ళావురా బాబూ! ఎందుకు నాతో చెప్పావు కావు? అంత యెత్తు ఎగురుతానంటే నిన్ను వెళ్ళనిచ్చేదాన్ని కాను

నారాయణ లాభం లేదమ్మా! నేను వెళ్ళడం విధి.

అమ్మ ఏం పూజారులా నవి! ఎంత మందిక వెళ్ళకపోతేనేం?

నారాయణ ఎంత మంచి విమానం ఉంటే ఎవరైనా సేవ చేసినట్టే చేస్తారు కాని ఇదంతా నీకు బోధపడటంలేదే అమ్మా! అసలు సంగతేమిటంటే (వెలుపల నుంచి తలుపుతట్టిన చప్పుడు)

నాన్న (తన బొమ్మకింద దీపం ఆర్పుతాడు రంగమంతటా చీకటి) వస్తున్నట్టున్నారు నువ్వు గొడవ చెయ్యకూడదు

అమ్మ నా నాయనా! నారాయణా! చెట్టంత కొడుకు! నాకేం దారి! ఎందారి! (మళ్ళీ తలుపు తట్టిన చప్పుడు)

ఆదిమూర్తి (మెల్లగా) గాభరా వద్దు ధైర్యంగా ఉంటావు కాదూ?

నాన్న మరి మేం వెళుతున్నాము (మళ్ళీ చప్పుడు)

అమ్మ (లేచి నిలబడి) రండి లోపలికి!

(లక్ష్మన్న తలుపు తెరచి గుమ్మం మీద నిలుచుంటాడు రంగస్థలం మీదికి వెలుతురు ప్రసరిస్తుంది)

లక్ష్మన్న అమ్మా! ఇలా వస్తావా?

అమ్మ (ధైర్యంగా ముందుకి నడిచి) ఏం?

లక్ష్మన్న ఏం లేదు ఇప్పుడే కబురొచ్చింది నారాయణకి ప్రమాదం విమాన ప్రమాదం భయపడకూడదు నువ్వు

అమ్మ నాకేం భయంలేదు

లక్ష్మన్న నారాయణ మరి - అమ్మా! అమ్మా! అప్పుడే తెలిసిందేమిటే నీ కీ సంగతి?

(తెర)

★ ★ ★

# ద్వితీయాంకము

*(అదే గది కొత్తగా ఒక రేడియోసెట్టు మాత్రం వుంటుంది)*

సింహం *(రేడియోముందు మోకాళ్ళమీద వంగి మీట తిప్పుతూ వుంటాడు మిలిటరీ మార్చి వినబడుతుంది అసహ్యించుకుంటున్నట్లు మొగం పెట్టి మళ్ళీ తిప్పుతాడు ఎనౌన్సరు గొంతుక వినిపిస్తుంది)*

ఎనౌన్సరు గొంతుక . జాగ్రత్తగా వినండి. చాలా ముఖ్యమైన విషయం.

శాంతి భద్రతలను నెలకొల్పడానికి పౌరులందరూ తోడ్పడాలి. నగరంలో ప్రజలెవ్వరూ గుంపులుగా గుమికూడరాదని హెచ్చరిక. ఇందుకు విరుద్ధంగా ప్రవర్తించే గుంపుల మీద కఠినంగా చర్య తీసుకోవలసిందని పోలీసులకీ మిలిటరీకీ ప్రభుత్వం ఉత్తరువు.

సింహం అబ్బే! *(అసహ్యంతో మీట తిప్పుతాడు. దూరపు పాట వినబడుతుంది. నేలమీద మోకరిల్లి వింటూవుంటాడు చేతితో లయవేస్తూ)*

*(లక్ష్మన్న ప్రవేశం)*

లక్ష్మన్న   ఒరే సింహం! ఊరుకోబెట్టు రేడియోని అమ్మకి నువ్వు రేడియోతో చెలగాటలాడటం ఇష్టం లేదు. నారాయణ జ్ఞాపకం వస్తాడు అమ్మకి

సింహం   వినరా అన్నయ్యా! బాగులేదూ సంగీతం?

లక్ష్మన్న   బాగానే వుంది కాని సంగీతాల కిది సమయంకాదు ఆపెయ్యి దాన్ని! దుర్భరంగా వుంది

సింహం   (ఆపివేస్తూ) నీ యిష్టం! లక్కో అనుకుంటాను అందుకే సంగీతం ఉద్యానవనాల్లోంచి వచ్చినట్టు-

లక్ష్మన్న   ఊరుకోవోయ్ గోల! లక్కో లేదు గిక్కో లేదు నీ మతి భ్రమ! *(సిగరెట్టు వెలిగిస్తాడు విసుగ్గా పచార్లుచేస్తాడు)* ఇంట్లో చిక్కుకుపోయాను ఏం దారి? *(రిస్టువాచి చూసుకుంటాడు)* కూలీ వెధవల ఊరేగింపు బయల్దేరే వేళయింది! ఏదో పుట్టి ముంచుకు రాక తప్పదు నే నక్కడ వుండి తీరాలి. *(కిటికీ దగ్గర నిలబడి వింటూ వుంటాడు)*

సింహం   . ఒరే, అన్నయ్యా!

లక్ష్మన్న   . ఏం సంగతి?

సింహం   రామన్న సంగతి, ఏంచేశారు వాణ్ణి!

లక్ష్మన్న   ఏమో నాకేం తెలుసును? అరెస్టుచేసి తీసుకపోయారు కలుగ జేసుకోవడం వాడిది తప్పు

సింహం   నువ్వు కలుగజేసుకుంటున్నావు కావూ?

లక్ష్మన్న   ఔను అయితే నాది ప్రభుత్వ పక్షం ధర్మపక్షం అదే భేదం వాడికీ నాకూ

సింహం   . ఎలాగో ఆ భేదం?

లక్ష్మన్న   శాంతిభద్రతల స్థాపనకి, దేశక్షేమానికి మేము పాటుపడతాం. వాడుకోరేది అరాజకం కుర్రాడివి నీ కివేవీ బోధపడవు అదృష్టవంతుడివిలే బోధపడక పోవడమే మంచిది

సింహం   రామం అన్నయ్య మాత్రం దేశక్షేమం వద్దంటున్నాడా? అయినా వాణ్ణి పట్టుకున్నారు.

లక్ష్మన్న   పట్టుకోరూ మరిక? ఈ కూలీ వెధవలా రాజ్యం యేలుతారు? కూలీ రాజ్యం! వాళ్ళకి తెలిసినదంతా ఒకటే! గొంతు చించుకుని కేకలు వెయ్యడం. వీలయితే లూటీలు చెయ్యడం *(సిగరెట్టు నలిపివేస్తాడు)* వీళ్ళ చేతిలో పడితే ఇక దేశం బాగుపడ్డట్టే

సింహం   . లూటీలు మీరు అణచలేకపోయారు. రామన్న వచ్చి చెప్పిన తర్వాత కదా సద్దణగింది?

లక్ష్మన్న   వాడెవడంటా? ఇలా అలగా జనాన్నంతా పోగుచేసి నాయకుణ్ణి కావాలని వాడి వుద్దేశం. అధికారం అప్పుడు తమ చేతిలోకి వస్తుందనుకుంటున్నారు వాళ్ళు. ఒక్కనాటికీ అది సాగనియ్యం మేము.

సింహం   : మేం అంటే?

లక్ష్మన్న   · మాపక్షం! మేమేదేశం! వాళ్ళంతా దేశద్రోహులు దురభిప్రాయాలను ప్రచారం చేసి దుర్మార్గుల రాజ్యం స్థాపించాలని చూస్తున్నారు. వాళ్ళకి కావలసింది పరిపాలన కాదు. రక్తపాతం. వర్గసామరస్యం కాదు. వర్గ కలహం! దేశం వీళ్ళ చేతిలో పడితే ఇంకేమేనా ఉండునా? అందుకే ఒక్క పురుగేనా లేకుండా వీళ్ళ నిలా నలిపి పారేస్తాం! వీళ్ళూ వీళ్ళ ఉపన్యాసాలూనూ! గొంతుకలు ఇలా నొక్కేస్తాం. *(అభినయిస్తాడు)*

సింహం (తల నిలువు) ఒకే కాని అన్నయ్యా! ఇది చెప్పు

లక్ష్మన్న ఏమిటి?

సింహం రామన్నయ్యని యేం చేస్తారు?

లక్ష్మన్న (బుజాలు విరుపుతూ) ప్రస్తుతం మట్టుకు మేం చేసేదేమీ లేదు కనిపెడుతున్నాం అంతే మా మనుష్యులు వాళ్లే పట్టేశారు జైల్లో కూలబోశారు

సింహం నేరంచేసిన ఖైదీలా?

లక్ష్మన్న ఖైదీకాదు హామీ! బెంగపెట్టుకోకు. జైల్లో వాళ్లేమీ చెయ్యరు ఊరేగింపులో దెబ్బలాటలు జరగాలి అప్పుడు చూడాలి

సింహం రామన్నని ఉరితీస్తారు కాదూ?

లక్ష్మన్న అంతదాకా రాకూడదు కాని వీడు అంతర్యుద్ధాన్ని ప్రేరేపిస్తున్నాడు ఎందుకు చెప్పు వీడికీ రంధి? వాళ్ళ తాహతేమిటి వీడి తాహతేమిటి? కుళ్ళు వెధవలతో కూడి చెడిపోయాడు విషమించిపోతే యేమవుతుందో చెప్పలేను వాళ్ళలో కొంతమంది తుపాకులూ, పిస్తోళ్లూ జాగ్రత్త చేశారట మర్యాదగా ఆయుధాలన్నీ మా వశం చేసి ఎవరి పనుల్లోకి వాళ్ళుపోతే యే ఖైదీలు ఉండరు. అప్పుడు అందరితోబాటు రామన్నని కూడా వదలిపెడతాం

సింహం (కళ్ళు పెద్దవి చేసుకొని) ఖైదులో రామన్నయ్యకి సంకెళ్ళు కూడా వేశారు కాబోలు! గది తలుపుల తాళం ఎప్పుడు విడుతుందో అని ఎదురుచూస్తూ ఉంటాడు ఏం ఆలోచించుకుంటూ ఉంటాడో ఆ కొట్లో!

లక్ష్మన్న ఉండు ఊరుకో *(వింటాడు)* యేమీ వినబడదు తుపాకులు పేలలేదు మంచిదే ఒక్క గుండు పేలిందా సరి మంటలంటుకున్నాయన్నమాటే మా వాళ్ళు సర్వసిద్ధంగా ఉన్నారు ఒక్క పిసరు కనికారం చూపించరు. ఊచకోత కోసిపారేస్తారు *(ఆగి)*లో ఊరేగింపు గొడవ లేకుండా పోయినట్టుంది పిరికి వెధవలు ఇలాంటి వాళ్ళతో రామన్నగాడి సావాసం! ఒక్క మరఫిరంగితో ఎక్కడివాళ్ళక్కడ చెల్లాచెదరయి పోతారు నీకేమయినా వినపడుతోందీ? పిసరంత చప్పుడు లేదు. బహుశా రాజీకి దిగుతున్నారనుకుంటాను అయినా ఈ బందిపోటు దొంగలతో రాజీయేమిటి నా మొహం

సింహం అన్నయ్యా! చేతులు వెనక్కి విరిచి కడతారు కాదూ?

లక్ష్మన్న . ఏమిటి నీ ప్రశ్న? ఎవరిని? ఎప్పుడు?

సింహం ఎవరినైనా ఉరి తియ్యడానికి తీసుకు వెళ్ళేటప్పుడు

లక్ష్మన్న ఔను లేకపోతే పువ్వులదండలు వేసి తీసుకు వెళతారనుకున్నావా? ఎందుకలా అడుగుతున్నావు?

సింహం *(వెనక్కి చేతులు విరిచి కట్టినట్టుగా ఉంచి)* ఇక చావక తప్పదనుకున్నవాడు ఉరికొయ్య ఎక్కుతున్నప్పుడు ఏమనుకుంటాడో? తెల్లవారు జామున చలిగాలి వాడి మొహంమీద రివ్వన వీస్తూ వుండగా శూన్యంలోకి చూస్తూ, కానియ్యండి మీ పని,

అంటాడు కావాలు ఏకేం కావాలని మరమిగుతాడు సిగరెట్టు కావాలా? వేడి పాలు కావాలా అని అడుగుతాడు ఇంకో నాలుగు నిమిషాలు బలకొచ్చునని వేపి వేడిపాలు ఊదుకుంటూ తాగుతాడు వాడు లేకపోతేక కోపంతో "నాకేం వద్దు వెధవల్లారా పొండి" అని కసిరేస్తాడు

లక్ష్మన్న ఏమిటా పేలాపన చిట్టీ?

సింహం *(గిరుక్కున తిరిగి అరుస్తాడు)* ఫో! వెధవా! నువ్వూ వెధవ్వి! చెవల వెధవ్వి! *(ఏడుస్తూ మోకాళ్ళమీద పడిపోతాడు)*

లక్ష్మన్న (రెండు భుజాలు పట్టుకొని గుంజుతూ) లే! వెర్రెత్తినట్టు యేమిటా అరుపులు? కవిత్వం రాయడంవల్ల మెదడు చెడిందా, లేక మెదడు చెడడం వల్ల కవిత్వం రాస్తున్నావా?

సింహం · *(రెండుచేతుల్లో కళ్ళు కప్పుకుని లేచి గద్గదస్వరంతో)* అన్నయా! అన్నయా! మనుషుల్లో మనుషులకింత పడకపోవడం ఏమిటి? ఒక మనిషి ఇంకొకణ్ణి ఇంత అసహ్యించుకోవడం ఎందుకు?

లక్ష్మన్న ఎందుకా? నీకింకా చిన్నతనం. ఇవేమి బోధపడవు. హరిమీద గిరిపడ్డా ఒక ఆదర్శంకోసం నిలబడి పోరాడడం అంటే ఏమిటో నీకు తెలియదు. తనకోసం చెయ్యని పనులు, ఊహించని పనులు ఆశయంకోసం చేస్తారు ఊహిస్తారు నీతో వచ్చిన చిక్కేమిటంటే అన్నిటికీ నువ్వదరిపడతావు అమ్మ నిన్ను పూర్తిగా చెడగొట్టింది

సింహం ఎలాగ?

లక్ష్మన్న బాగా ముద్దుచేసి నిన్ను పాడుచేసింది అమ్మ. ఇంకా కొంత కాలం ఇలాగే సాగితే నువ్వింక ఆదర్శాలమాటే ఆలోచించవు. ప్రపంచశాంతి! విశ్వమానవ సోదరత్వం! ఎంత పెద్ద పెద్ద పేర్లు! కాని ఈ క్షణంలో మనకి కావలసినవి ఇవేవీ కావు! అంటుకుంటున్న మంటల్ని చల్లార్చడానికి సిద్ధపడాలి. రామన్న కేమైనా అయితే అమ్మతో చెప్పకేం! అరెస్టు చేశారని చెబుదాం అంతే చూడూ! ఊరేగింపు చెదిరిపోయినట్టుంది. వెధవలు లొంగిపోయారనుకుంటాను. నువ్వెక్కడికీ కదలకూడదు సుమా, చిట్టీ!

సింహం . మరి నీ మాటో?

లక్ష్మన్న (భుజాలు కదుపుతూ) నిజంగా నేనిప్పుడు వీధిలోకి వెళ్ళవలసి వుంది మావాళ్ళ పక్కని నిలబడాలి పోరాటం ప్రారంభమయితే నేనిక్కడ నిమిషం ఆగలేను. ఇంట్లో ఇరుక్కుపోవడం నాకు సుతరామూ ఇష్టంలేదు. అయితే ఒక చిక్కొచ్చిపడింది. నువ్వొకడివీ వున్నావు అగ్గి అంటుకుంటే మాత్రం - అమ్మది చాలా నీరసపు గుండె ఒకసారి చెలరేగితే ఈ గుంపులు ఎంతకైనా తెగిస్తారు చెయ్యిమీరిపోతే చేసేదేమీ వుండదు అంచేత నిన్నొకకంటితో ఇక్కడ కాపాడుతూ ఉండాలి. (సింహంవైపు వీపుపెట్టి, డ్రాయరులోంచి ఒక రివాల్వరుతీసి, మందు కూరి, మళ్ళీ దాన్ని లోపల పెట్టేస్తాడు) నేను అవతలకి వెళ్ళవలసిన అవసరం ఎంతైనా వుంది కాని అంత ముంచుకొచ్చిందన్న సంగతి అమ్మకి తెలియకూడదు సరే, ఏమయితే అయింది నీకోసం, అమ్మకోసం ఇక్కడే ఉంటాను.

(అమ్మ ప్రవేశం)

అమ్మ : లక్ష్మిగా! రామన్న ఏడిరా? ఇంటికి రాలేదేం? పొద్దున్నేకాదూ నువ్వంటున్నావు ఏదో పొరపాటు జరిగిందని సాయంత్రానికి వదలిపెట్టేస్తారన్నావు కాదూ? ఏమిటిరా నేనంటున్నదేమీ చెవిని పెట్టడంలేదూ?

లక్ష్మన్న : వినమ్మా వదిలెయ్యాలి మరి అయితే అదంత చప్పున జరిగిపోయే పనికాదు చూశావా. వాళ్లు వందలకొద్దీ జనాన్ని పట్టుకున్నారు ఒక్కొక్కడి సంగతే ఆలోచించొద్దూ? అంచేత ఎలాగూ ఒక వారంరోజులు పడుతుందనుకొంటా

అమ్మ : వారం రోజులే! ఏం చేశాడని నా కొడుక్కీగతి? వెళ్ళి ఆ సంగతేదో చూసివస్తాను

లక్ష్మన్న : వీల్లేదమ్మా! నిన్నసలు ఆ యిరుపంచలకి రానివ్వరు

అమ్మ : రానివ్వరు! ఎందుకు రానివ్వరూ? రామన్నకి చాకంటి బట్టలూ, ఇంత భోజనం తీసుకవెళతాను అందుకెవరు అడ్డు పడగలడు? ఎంత జైలైనా కొడుక్కి తిండి తీసుకెళ్ళే హక్కు తల్లికిలేదూ?

లక్ష్మన్న : నువ్వు తొందరపడి లాభం లేదమ్మా! చూడూ ప్రస్తుతం వీధులన్నీ మిలిటరీ కాపలాలో ఉన్నాయి ఊరిమధ్య కెవ్వరినీ వెళ్ళనియ్యరు

అమ్మ : తల్లుల్ని కూడా ఆటకాయిస్తారా? నా కొడుక్కి యేదో తీసుకెళ్ళుతున్నానని చెబుతాను రామన్నని నేను చూసితీరాలి వాడెలా వున్నదీ కనుక్కోవాలి ఏం నేరం చేశాడని వాడికి జైలు శిక్ష? చూస్తూ వుండు అందర్నీ దులిపి వదుల్తాను "నా కొడుకుని ఖైదులో పెట్టే హక్కు మీకులే" దని వాళ్ళ మొగంముందే అంటాను

లక్ష్మన్న : అది సరేలేవే అమ్మా! ఆ హక్కు వాళ్ళకి తప్పకుండా వుంది

అమ్మ : ఎందుకని? ఏం తప్పుచేశాడు రామన్న? ఎవరికైనా ఇంత పిసరైనా హాని చేశాడా వాడు?

లక్ష్మన్న : అలాగని ఎవరన్నారమ్మా? రామన్న నేరం చేశాడని ఎవరన్నా ఎందుకంటారు?

అమ్మ : అనరుకదా! అయితే ఇక వాణ్ణెందుకు నిర్బంధించడం?

లక్ష్మన్న : అమ్మా! ఇవన్నీ నీకు అర్థం కావు సుమా.!

అమ్మ : నాకు తెలుసు! నాకు తెలుసు చిట్టీ! నువ్వలా వెళ్లు! వీడి సంగతేదో తేలుస్తాను ఈ ముసలిదాని చాదస్తం నువ్వేమీ వినక్కర్లేదు

(సింహం ఇష్టంలేనట్లుగా నిష్క్రమిస్తాడు)

అమ్మ : అంతా అర్థంచేసుకోవాలనే ప్రయత్నిస్తున్నానురా నాయనా! ఏ తప్పూ చెయ్యనివాడి కెందుకో శిక్ష? అదొక్కటే నా కర్థం కాకుండా వుంది

లక్ష్మన్న : చాలా విచారంగా వుందమ్మా నాకు! వచ్చిన చిక్కేమిటంటే దేశంలో ఇప్పుడొక పెద్ద అంతర్యుద్ధం చెలరేగుతోందని నువ్వు గుర్తించినట్టు లేదు!

అమ్మ : అయితేనేం? అసలీ అంతర్యుద్ధానికేం అవసరమొచ్చింది?

లక్ష్మన్న : వచ్చింది మరి! దేశం రెండు పార్టీలుగా చీలిపోయింది ఎవరో ఒకరే పరిపాలించాలి! ఎవరిది రాజ్యం అనే సంగతి ఇక ఆయుధ బలంవల్లనే నిర్ణయం కావాలి

అమ్మ : ఇందుకా ఈ నెత్తుటి వరదలు?

లక్ష్మన్న    అంతేనమ్మా, మరి గత్యంతరం లేదు

అమ్మ    లేదూ? ఇంతమంది చచ్చిపోయిన తర్వాత ఎవరు పరిపాలిస్తేనేం? ఈ పోరాడుతున్న వాళ్ళెవరికీ ఇళ్ళూ సంసారాలూ లేవూ? సంసారాలను పట్టించుకోకుండా వీధుల్లోపడి తన్నుకు చస్తున్నారా?

లక్ష్మన్న    సంసారాలేనా సమస్తమూ అమ్మా?

అమ్మ    నా మట్టుకు నా సంసారమే నా సమస్తమూ! దానికేంగాని ఇది చెప్పూ? ఎవరిని పరిపాలించ దలచుకున్నాడు రామన్న? వాణ్ణి నేను పూర్తిగా ఎరుగుదును. ఒకరి జోలి కెప్పుడూ వెళ్ళడు వాడు చీమ మీదనైనా చెయ్యి వెయ్యడు ఇంకా నీ మాట చెప్పు నీ కధికారం చెలాయించడం ఇష్టమేమో? రామన్న మాత్రం అలాంటివాడు కాదు. ఒకడిమీద అధార్టీ చెయ్యడం వాడి స్వభావంలోనే లేదు

లక్ష్మన్న    వాడిలో లేకపోతే సరా? వాడిపక్షం ఉందే అది అధికారం కోసం ఎగబడుతోంది. ఇష్టంవచ్చినట్లు మార్చెయ్యదలచుకున్నారు వాళ్ళు! ఎంత పుపద్రవం అప్పుడు? దేశం అంతా ధ్వంసమయిపోవడం తప్ప మరేమైనా మిగులుతుందా? వాళ్ళంతా దొంగలు, పచ్చి దొంగలు. దేశద్రోహులు దేశాన్ని నట్టేట్లో ముంచి దొరికిందంతా దోచుకోవాలని చూస్తున్నారు

అమ్మ    ఏం మాటలురా ఇవి! రామన్నని నేనెరగనూ? అలాంటివాళ్ళతో వాడెప్పుడూ కూడడు నువ్వూ అలాంటి సావాసాలెప్పుడూ ఎరగవు నాకు తెలుసు దొంగలతోనూ, ద్రోహులతోనూ ఎవరు చేరుతారురా?

లక్ష్మన్న    . అందర్నీ గుడ్డిగా నమ్ముతాడు అదీ రామన్నలో పెద్దలోపం

అమ్మ    . పసితనం పాపం! నువ్వు మాత్రం చాలా గడుసువాడివిరా నాయనా? ఎవరినీ నమ్మవు అందర్నీ ఎడంగా వుంచుతావు. అయితే రామన్న ఎప్పుడూ చెడ్డ సావాసం చెయ్యడు.

లక్ష్మన్న    : అంటే నేను చేస్తానన్నమాట. అంతే కాదూ? ఒకటే వాడూ వాడి పక్షం రైటు, లేదా మేము ఇద్దర్లో ఎవరో ఒకరు ఘోరమైన దుర్మార్గాన్ని కొడిగడుతున్నారు

అమ్మ    : నీలో దుర్మార్గంలేదని నాకు తెలుసు! చాలా సున్నితమైన మనస్సుంది నీకు. మంచి హుందాతనం వుంది. ఎన్నడూ నువ్వు నీచపుపని చెయ్యవు అప్రతిష్ట తెచ్చేపని ఎన్నడూ చెయ్యవు. అది నాకు బాగా తెలుసును.

లక్ష్మన్న    : చాలా సంతోషమమ్మా! నువ్వలా అనుకుంటున్నందుకు! రామన్నదీ వాడి పక్షానిదీ అధర్మమని నిష్కర్షగా చెబుతున్నాను నమ్ము. శాంతిభద్రతల పేరిట వాడి పక్షాన్ని పూర్తిగా తుడిచిపెట్టక తప్పదు!

అమ్మ    · బాగానేవుంది గాని నాయనా! శాంతిభద్రతల పేరిట రామన్నని నిర్బంధించవలసిందేనా?

లక్ష్మన్న    : ఔనమ్మా! ఈ వ్యవహారంలో వాడు కలుగజేసుకున్నాడు కాబట్టి.

అమ్మ    : ఎంత సిగ్గుచేటు? రామన్నని ఖైదు చేసిన వాళ్ళది ధర్మపక్షం కానేరదు!

లక్ష్మన్న    నువ్వలా అంటున్నావు సరే! వీలు చిక్కితే రామన్న నన్ను జైల్లో తోయించేవాడే!

అమ్మ    · రామన్నా!

లక్ష్మన్న  అంటే వాడిపక్షం ఉన్నమాట

అమ్మ  తెలివితక్కువ పెద్దమ్మలైతే అలా చేస్తారు నీకేమీ దురుద్దేశాలు లేవు అలాంటప్పుడు నిన్నెందుకు నిర్బంధించాలి? అదీ అన్యాయమే! రామన్నని జైల్లో వెయ్యడం ఎంత అన్యాయమో నిన్ను వేసినా అంతే! దుర్మార్గులురా నాయనావాళ్లంతా! దుష్టులు! వొట్టి పశువులు! శనిగొట్టు, నాశనగొట్టు పీనుగులు! వాళ్ళ మొగం తగలెయ్యా!

లక్ష్మన్న  అమ్మా! అమ్మా! అంత ఒళ్లు మండించుకోవద్దు

అమ్మ  (సంబాళించుకొని) రామన్ననలా వదలిపెట్టడానికి వీల్లేదు నాతో రావాలిరా నువ్వు! ఎలాగైనా వాణ్ణి చూడాలి ఇంకా చాలా రోజు లుంటాడని కాదూ అన్నావు?

లక్ష్మన్న  ఏమో చెప్పలేం. ఎప్పుడైనా వదలిపెట్టడం ఖాయం బైట ఇప్పుడు గొడవంతా సద్దుకున్నట్టుంది. బహుశా రేపటితో అంతా పైసలా కావచ్చును

అమ్మ  . అప్పుడు నాతో వస్తావా రామన్నని తీసుకురావడానికి?

లక్ష్మన్న  తప్పకుండా.

అమ్మ  . ఇవాళమట్టుకి వాడికేమైనా తీసుకువెళితేనేం?

లక్ష్మన్న  . ఇవాళకేమీ లాభం లేదమ్మా!

(దూరంలో తుపాకి మ్రోతలు, రంగస్థలంలో వెలుతురు తగ్గిపోతుంది)

అమ్మ  . ఏమిటా చప్పుడు?

లక్ష్మన్న  (ఇబ్బందిగా) ఏమీ లేదు ఏదో వీధిలో ఎక్కడో దూరంగా! అమ్మా, చూడు! ఈ యింట్లోంచి ఎవ్వరూ కదలకూడదు

అమ్మ  పాపం, రామన్నమాట?

లక్ష్మన్న  ఎప్పుడూ రామన్నమాటే నీకు! మిగిలినవాళ్ళ సంగతే ఆలోచించవు!

అమ్మ  అంటే నీకో, చిట్టిగాడికో ప్రమాదం రావొచ్చుననా?

లక్ష్మన్న  మా ఘోష కాదమ్మా! నీకేమీ తెలియదు నేనాలోచిస్తున్నది దేశం గురించి

(దూరంలో మళ్ళీ కాల్పులు)

అమ్మ  . రామన్న కేం ప్రమాదం వస్తుందో అని నా బెంగ

లక్ష్మన్న  (కిటికీ దగ్గర వింటూ) దేశానికేం ప్రమాదం వస్తుందో అని నా బెంగ! ఊరినిండా మెరికల్లాంటి సైన్యాలు సిద్ధంగా ఉన్నాయి. వాటి అవసరం వచ్చిందనుకుంటాను న్యాయంగా నేను వాళ్ళ పక్కనే ఉండవలసింది. నా కోసం చూస్తూ ఉంటారు. కాని నేనిక్కడ ఉండక తప్పదు ఏమైనా జరిగితే మాత్రం యెవరో అక్కడ ఉండాలి (గట్టిగా అరుస్తాడు) ఊఁ కానియ్యండి చూస్తారేం?

అమ్మ  అదేమిట్రా ఆ అరుపులు?

లక్ష్మన్న  ఏం లేదమ్మా! భయపడకు. ఇక్కడే ఉంటాను నిన్నూ, చిట్టి గాణ్ణి చూస్తూ! వీధుల్లో అల్లర్లయితే చండాలపు వెధవలంతా ఎగబడతారు. భయం లేదమ్మా! నేనిక్కడే ఉంటాను.

(తుపాకులు వేలాడదీసిన చోటువైపు నడుస్తాడు)

అమ్మ ఏమిటి వెదుకుతున్నావు?

లక్ష్మన్న నాన్నగారి తుపాకి. మన్యాల్లో నాన్న వాడుతూ ఉండేది. దాన్ని ప్రస్తుతం తోమవలసిన పని పడింది

(తుపాకీ తీస్తాడు)

అమ్మ రోజూ నేను దాన్ని తోముతూనే ఉంటానే!

లక్ష్మన్న నీకు తెలియదమ్మా! తుపాకీకి తోమడం ఒక్కటే చాలదు అప్పుడప్పుడు దాన్ని పేలుస్తూండడం అవసరం (తల్లి భుజంమీద చెయ్యివేసి) గాభరా పడకమ్మా! అంతా అదే సర్దుకుంటుంది

అమ్మ రామన్న ఇంటికొస్తాడా?

లక్ష్మన్న వస్తాడమ్మా! వస్తాడు

(నిష్క్రమిస్తాడు)

అమ్మ (అతని వెనక వెళ్లుతూ) అబద్ధం! అబద్ధం! నాకు తెలుసు నువ్వంటున్నది నిజంగాదని (గదికి అడ్డంగా నడిచి అక్కడక్కడ వస్తువులను సర్దిపెడుతుంది. దూరంలో తుపాకి మోతలు)

అమ్మ ఒక్కమారు రామన్న నా కళ్ళబడితే బాగుండును! (కుర్చీలో కూలబడి చేతులు జోడిస్తుంది) రామయ్య తండ్రీ! నా కొడుకుని రక్షించు! సీతమ్మ తల్లీ! నన్ను క్షమించి నా పిల్లణ్ణి కాపాడు! వీళ్ళిద్దరూ నీ కుశలవులలాంటి వాళ్ళమ్మా! కంచి కామాక్షీ! మధుర మీనాక్షీ! నా పిల్లలకి హాని కలగకుండా రక్షించరూ? ఏడుకొండల వాడా తండ్రీ! నా బిడ్డను దగ్గరికి పంపించవూ! నువ్వేనా చెప్పవమ్మా అలిమేలు మంగమ్మా!

(రామన్న నిశ్శబ్దంగా గుమ్మంవద్ద వచ్చి నిలుచుంటాడు. షరాయిలోనికి దోపిన చొక్కా చిరిగిపోయి ఉంటుంది. గుండీలు లేవు. మెడ నలుపుకుంటూ ఉంటాడు. రంగస్థలమంతా చీకటి)

అమ్మ · (దిగ్గునలేచి) వచ్చావా నాయనా! అప్పుడే నిన్ను వదలిపెట్టేశారా?

రామన్న . వాళ్ళెక్కడ వదలిపెడతారమ్మా! వదలిపోయింది. శని విరగడై పోయింది.

అమ్మ (అతనివైపు వెళ్ళుతూ) ఎంత బెంగపెట్టుకు పోయానురా బాబూ! నీ కోసం! రా నాయనా! ఇలా దగ్గిరగా రా!

రామన్న . (దూరంగా తప్పుకుంటూ) వద్దమ్మా! నన్ను ముట్టుకోవద్దు అక్కడే నిలబడు!

అమ్మ · (చేతులు జాస్తూ) అదేమిట్రా అబ్బాయీ! ఏమొచ్చిందిప్పుడు? నీ కోటేంజేశావు?

రామన్న · (దూరంపోతూ) ఉందిలే! ఉందిలే! భద్రంగా నీకు పంపిస్తారు. కోటు తతిమ్మా సామగ్రీ! అన్నీ యథావిధిగా, ప్లాను ప్రకారం జరిపించడంలో వాళ్ళు మొనగాళ్లు.

అమ్మ : ఎవళ్ళు?

రామన్న : వాళ్ళే, తెల్లబలం! ఇంకా దీపం వెలిగించకమ్మా? ఏడుపొస్తోంది నాకు, ఐనా నీకో సంగతి చెప్పక తప్పదు. అందుకే తిన్నగా ఇక్కడకే వచ్చేశాను. నీ దగ్గరికి! బహుశా నేనే చెప్పేస్తే మంచిదనుకుంటాను.

అమ్మ ఏమయిందిరా రామూ! ఏమయింది? (చేతులూపుతూ) ఇలారా నా దగ్గరికి!

రామన్న (దూరంగా పోతూ) మరి నువ్వు కోప్పడకూడదు నేనేం చెయ్యను చెప్పూ! ఆమాటకొస్తే అన్నయ్య మాత్రం ఏం చెయ్యగలడు?

అమ్మ ఎవరైతేనేం? ఏమిటూ చేసేది? ఏం జరిగిందేమిటి?

రామన్న అబ్బ! నీకింత అర్థం కాకపోవడమేమిటే అమ్మా! ఔనులే! నీ సంగతే అంత! అన్నయ్యకి మాత్రం ఇదివరకే తెలుసు ఇంతా జరుగుతుందని! సరే ఆఖరికి అయిపోయిందేదో అయిపోయింది!

అమ్మ (అంతకంతకు హెచ్చుతున్న ఆందోళనతో) ఏమయిపోయిందిరా నాయనా ఏమిటది?

రామన్న ఏమీ లేదమ్మా! ఇక అంతా మరచిపోవచ్చును అప్పుడే అయిపోయి అరగంట దాటింది!

అమ్మ ఏమయిపోయి?

రామన్న . నన్ను వాళ్ళు ఉరితీశారమ్మా!

అమ్మ నా నాయనో!

(గుండె బాదుకుంటూ నేలపై ఒరిగిపోతుంది)

అమ్మా (చీకటిలోనుండి ఆదిమూర్తి పరుగెత్తుకుంటూ వస్తాడు ఇదివరకు లాగే తెల్లని అంగరఖా)

ఆదిమూర్తి ఏమయిందిరా తమ్ముడూ?

రామన్న చూడు. అమ్మ పడిపోయింది.

ఆదిమూర్తి . (మోకరిల్లి అమ్మ నాడి పరీక్షిస్తాడు) ఏదీ చూదాం అమ్మ కెలావుందో?

(నాన్నగారు చీకటిలోనుండి ప్రవేశం మిలిటరీ యూనిఫారం)

నాన్న అమ్మకి మరేం ప్రమాదం లేదుకదా!

రామన్న · ఏమో తెలియదు హఠాత్తుగా కిందపడింది

నాన్న : అమ్మని గాభరాపెట్టేశావు. జాగ్రత్తగా ఉండొద్దూ? (మోకరిస్తాడు) ఏమే? వొంట్లో ఎలా వుంది?

(నారాయణ వైమానిక దుస్తులతో చీకట్లోంచి వస్తాడు)

నారాయణ నాన్నా! నాన్నా! అమ్మకి వొంట్లో బాగులేదూ?

(టేబిలుమీద దీపం వెలిగిస్తాడు)

ఆదిమూర్తి· (మోకరిల్లి) గుండెపోటు! సరిగా కొట్టుకోవడం లేదు! ఆయాస పడిపోతోంది

నాన్న · ఎవరినైనా పిలిస్తే బాగుండును!

ఆదిమూర్తి: ఎందుకూ? మనమంతా లేమూ ఇక్కడ? ఇంకాస్త సేపటిదాకా అమ్మకి తెలివిరాదు గుండెదడ తగ్గిపోతుంది. కొంతసేపు విశ్రాంతి తీసుకోనిస్తే! ఏవీ ఆ తలగడా లందుకో!

రామన్న : (తలగడాలు తెచ్చి) ఇంద!

ఆదిమూర్తి నాన్నా! అమ్మ తల కొంచెం ఎత్తిపట్టుకో. (తలకింద తలగడాలు సద్దుతాడు) ఇక కదలకుండా పడుకో అమ్మా! (నిలబడతాడు) మీరంతా దూరం పొండి. అమ్మని కాస్త ఊపిరి తీసుకోనివ్వండి.

నాన్న . (నిలబడి) అమ్మ నెందుకురా అంత భయపెట్టావు? అసలు నువ్వెలా వచ్చావిక్కడికి?

ఆదిమూర్తి. ఉండు నాన్నా! ఒక్క క్షణం (రామన్నని దీపంవైపు తిప్పి మెడ పరిశీలిస్తాడు) అదీ కారణం!

నాన్న కూనీ చేశావన్న మాట?
రామన్న లేదు నాన్నా?
నాన్న లేకపోతే రాజద్రోహం అయుండాలి.
రామన్న దేశద్రోహం అన్నారు నాన్నా వాళ్ళు?
నాన్న నా కొడుకు దేశద్రోహం చేశాడా?
రామన్న నేనొక మహదాశయంకోసం నిలుచున్నాను నాన్నా! సేనలు నన్ను చెరసాలలో పెట్టాయి
నాన్న సేనలకి విరుద్ధంగా ఏం మహదాశయం వుంటుంది?
రామన్న మా తరపున కూడా సేనలున్నాయి నాన్నా?
నాన్న ఒక దేశంలో రెండు సేనలా?
రామన్న ఒక్క సేనలో రెండు ఆశయాలు!
నాన్న ఎంత అప్రతిష్ట! సైన్యంలో విభిన్నాశయాలా? కాలం ఇలా మండిపోతోందేం? నువ్వేమీ గూఢచారిలాగ పనిచెయ్యలేదుకద!
రామన్న లేదు నాన్నా! వుపన్యాసాలిచ్చేవాణ్ణి పత్రికా వ్యాసాలు రాసేవాణ్ణి
నాన్న అంతమాత్రాని కెవర్నీ ఉరితియ్యరు నువ్వు మతిపోయి మాట్లాడుతున్నావు సైనిక నీతిలో దేశద్రోహులకి, గూఢచారులకి మాత్రమే మరణశిక్ష!
రామన్న ఇప్పుడు కాలం మారింది నాన్నా?
నాన్న . ఔను తప్పకుండా అలాగే కనబడుతోంది ఇప్పుడు మీ రాడుతున్న ఆటకి ఏవో కొత్త నియమాలున్నట్టుంది (అమ్మవైపు తిరిగి) ఇప్పుడెలా వుంది!
ఆదిమూర్తి. (కుర్చీమీద కూర్చున్నవాడు ఆమెవైపు వంగి) స్మారకం లేదు నిద్రపట్టేసిందనుకుంటాను
నాన్న అయితే ఫర్వాలేదు. మనమాటల నెవరైనా వినగలిగిన వారంటూ వుంటే-
ఆదిమూర్తి . అమ్మ ఒక్కర్తే, మనతో మాటాడగల మనిషికూడా అమ్మ ఒక్కర్తే! ప్రపంచం అంతటికీ ఒక్క మన అమ్మ మాత్రమే మనతో సంబంధం తెగిపోకుండా అట్టే పెట్టుకుంది.
రామన్న . (గ్లోబ్‌ను నిస్పృహగా తిప్పుతూ) అమ్మకి చెప్పక తప్పింది కాదు. చాలా మథనపడ్డాను.
నారాయణ నాకు తెలుసులేరా! వెధవపని చేశావని ఒప్పుకున్నావన్నమాట. (ఒక డ్రాయరుతీసి వెదుకుతాడు) చూడండ్రా అంతమందీ! అమ్మ మనం కాల్చేపైపులన్నీ ఎలా భద్రంచేసిందో! ఎంత మంచిదీ అమ్మ! మనం బతికున్నప్పుడు ఇక్కడ పొగ తాగనిచ్చేది కాదు (కాళీ పైపును నోట్లో పెట్టుకొని పొగ పీలుస్తున్నట్లు నటిస్తాడు) మ్ ఉమ్! ఈ గదిలో వుంటే ప్రాణం లేచొచ్చినట్లుంది.
(వెలుపల కాల్పులు)
నాన్న · (కిటికీ దగ్గరకు వెళ్ళి) ఊళ్ళో గలాటాగా వున్నట్టుంది!
రామన్న : (టేబిలుమీది వస్తువులను అటూ ఇటూ నిర్లిప్తంగా కదుపుతూ) మావాళ్ళు, ఆ కాల్పులు మా బలంమీద.
నారాయణ : ఇవిగో నా నోటు బుక్కులు కూడా ఇక్కడే వున్నాయి. అమ్మకి ఎంతాలోచనో! (ఒక పుస్తకం పుటలు తిప్పుతాడు) ఇదిగో చిన్నప్పుడు నేను గీసిన బొమ్మ ఎంత వికారంగా ఉందో. ఇదిగో ఇదో కొత్తరకం విమానపు రెక్కని గీశాను.

రామన్న (పేపరుమీదనున్న నీగ్రో శిల్పాన్ని బల్లమీద పెడుతూ) ఏదీ చూదాం!

నారాయణ అదెందుకు తీశావు?

రామన్న ఏమో ఎందుకో? ఏదో ఒకటి చెయ్యాలని కాబోలు

నాన్న (కిటికీ నుంచి దృష్టి మరల్చి) వాటి జోలికి వెళ్ళకు నారాయణా! కొత్తగా చచ్చిపోయినవాళ్ళకి కొంత ఆరాటం సహజం! ఇదివరకు ఇక్కడే వుండే వాళ్ళం సుమా అని ఎవరికో అడుగడుక్కీ జ్ఞాపకం చెయ్యాలనుకుంటారు చూడూ రామం! ఆఖరి ఘడియల్లో నువ్వేమీ అవకతవకగా ప్రవర్తించలేదు కద!

రామన్న లేదు నాన్నగారూ! పెళ్ళికొడుకులాగ నిలుచున్నాను

నాన్న సెబాస్! బాగుంది వంశానికి అప్రతిష్ఠ తీసుకరాకూడదని నీకు తెలుసును

ఆదిమూర్తి (తల్లి పక్కని కూర్చుండి) అబ్బ! పగవాడికైనా వద్దు అటువంటి చావు

రామన్న నిజమే నాకు చెడ్డ అసహ్యం వేసింది నా చేతులు వెనక్కి విరిచి కట్టి నిలబెట్టారు. ఎదురుగుండా చమురు మొగాల వెధవలు ఎనమండుగురున్నారు నా యమభటులు, వాళ్ళని చూస్తే నాకు జాలివేసింది

నాన్న నీ కళ్ళకి గంతలు కట్టలేదూ?

రామన్న లేదండీ! కడతామన్నారు కాని నేనే కట్టనివ్వలేదు.

నాన్న . అదీ వరస! నీకేమేనా మిలిటరీ లాంఛనాలు జరిపించారా?

రామన్న : ఎవరో లెఫ్టినెంట్ అనుకుంటాను కర్రపెత్తనంచేస్తూ నిలబడ్డాడు ఎండ్రపీతలాగ మొగం వాడూ ఇంజన్ లాగ అరుస్తాడు సరిగ్గా ఉరితీయక పోతే గుండేసి కాల్చెయ్యాలనుకున్నాడో ఏమో కాని నా కళ్ళ యెదటే రివాల్వరు దట్టించుతూ నిలుచున్నాడు

ఆదిమూర్తి ·ఎంత ఘోరం!

నాన్న · నీకు తెలియదులే ఆదిమూర్తీ! దాని వరస అంతే.

రామన్న . అబ్బ! ఆ వెధవని చూస్తూవుంటే నాకెంత ఒళ్ళు మండుకొచ్చిందని! ఆఖర్ని వాడి మొగం ముందే అనేశాను "చేతకాని వెధవాయా! ఇంత ఆలస్యమేమిటిరా?" అని

నాన్న . తప్పు తప్పు. ఎంత మాటన్నావు? మిలిటరీ ఆఫీసర్‌ని అవమానించడమే? నిజంగా నీది మిలిటరీ శిక్షగాదు. చూస్తే కోర్టుమార్షల్ చూడాలి. ఒక మారిలాగే మా పటాలంలో ఏమయిందనుకున్నావు? దానికేంలే! మాటలకిది సమయం గాదు

రామన్న కాదు నాన్నా! ఒక అడ్డదిడ్డపు పరిస్థితిలో పడ్డప్పుడు ధైర్యం తెచ్చుకోవాలంటే ఏదో ఒకటనెయ్యాలి ఆ యనమండుగురూ నన్ను చూసి నవ్వడం! నాకూ నవ్వొచ్చింది ఆ నవ్వే నాకెంతో ధైర్యం కలిగించింది. కాని నేను నవ్వుతూ ఉండగా వాడిమొగం కందగడ్డలాగయిపోయి "కానియ్యం"డన్నాడు అదే ఆఖరి క్షణం.

నారాయణ అప్పుడేమనిపించిందిరా నీకూ?

రామన్న చెప్పకేం. ఒక్కసారి నా ముణుకుల్లో వొణుకు పుట్టింది. మనస్సంతా మబ్బు పట్టినట్లు మసకలు పోయింది ఇంతట్లో ఎవరో గొంతుక నొక్కినట్లయింది. ఆరవేసిన తడిగుడ్డ జారిపోయినట్టు పడిపోయాను. తల వెండ్రుకలలో చలిగాలి సోకినట్లయింది.

ఆదిమూర్తి భయమంటే అదే!

రామన్న అదే కాబోలును (మళ్ళీ ఆరాటంగా వస్తువులు కదుపుతాడు) కాని ఏం యాతన పెట్టింది! యమయాతనంటే నమ్మండి

నారాయణ (నోటు బుక్కునుండి తల పైకెత్తి) ఆ మాట నాకు వేరే చెప్పనక్కర లేదు

రామన్న నీకు తెలియదురా అన్నయ్యా! బాధన్నా బాధగాదు నాది నీకేం అనాయాస మరణం

నారాయణ అలాగే పాపం మరి! విమానం లోంచి పడిపోతున్నప్పుడు నేనూ అనుభవించకపోలేదు ఏ మాత్రం

రామన్న ఏముంది? అంతా కళ్ళుమూసి తెరిచేలోగ అయిపోయుంటుంది

నారాయణ ఎంతమాత్రం కాదు అరవై వేల అడుగుల ఎత్తునుంచి పడడమంటే నేలని చేరడానికెంత సేపు పడుతుందో తెలుసా నీకు? ఎన్నో యుగాల్లాగ ఉంటుందనుకో ఎవరికీ చెప్పడం సాధ్యంకాదు పడుతున్నంత సేపూ తల్లి భూదేవి నీ మీదికి, మీద మీదకి వచ్చేస్తున్నట్లే ఉంటుంది

రామన్న అప్పుడు నీకేమని అనిపించిందిరా అన్నయ్యా?

నారాయణ ఏముందిలెద్దూ! ఏదో ప్రచండమయిన ప్రశాంతిమాత్రం "అయిపోయింది మనపని! అయిపోయింది మని పని" అనే ఊహ! మాటలవి కావనుకో అయితేనేం? అలా పడిపోతూ అలా ఊహిస్తూ, మళ్ళీ మనం పడబోయే చోటు ఎలా వుంటుందో అని చూసుకుంటూ దిగడం, అబ్బా! చుట్టూ కనబడే చెట్లని చూస్తే భూతాల్లాగ ఉన్నాయి. ఏదేనా పొలంలో పడితే బాగుండు ననిపించింది

రామన్న అయితే మరేం! బాగానే అనిపించిందన్నమాట

నారాయణ అని నువ్వనుకుంటే సరా? నేను చెబుతున్నాను వినూ! ఆ పడిపోతున్నప్పటి నిస్సహాయస్థితికి ఏ బాధలూ సాటికావనుకో. ఒళ్ళంతా తిమ్మిరి కమ్మిపోయి ఒక వేలయినా కదపలేనట్లయింది ధూత్!

ఆదిమూర్తి అయితే నువ్వు మరీ భయపడ్డావనాలి.

నారాయణ ఏమో! ఆ మాట నేనేం చెప్పగలను? కాని మళ్ళీ అలాగ చచ్చిపోయే అనుభవం మాత్రం నాకొద్దు చీ! దుర్భరం!

(కొద్దిసేపు నిశ్శబ్దం)

రామన్న మరి నీ సంగతో ఆదిమూర్తి అన్నయ్యా?

ఆదిమూర్తి నా సంగతా? దానికేం, మాంచి సావకాశంగా చచ్చిపోయాను. నా విషయంలో కొన్ని రోజులబాటు వచ్చే ప్రాణం పోయే ప్రాణం అయింది. రేయింబగళ్ళు తీసుకొని తీసుకొని-

రామన్న . చచ్చిపోయావు

ఆదిమూర్తి: ఔను. ఇక మూడు రోజులుందనగా నాకు తెలిసిపోయింది. ఒకసారి నీ కా సంగతి నిశ్చయమైతే మరి నీ మనస్సు పెట్టే పరుగులకి అదుపుండదు. ఏవో జ్ఞాపకం వస్తాయి. అది నాకట్టే రుచించ దనుకోను. అదొహటిన్నీ నా సంగతి తెలిపోయిందిగా! ఒక్కొక్క

లక్షణమె ముందుకు రావడం కనిపెట్టాను సరిగ్గా పుస్తకాల్లో ఉన్నట్టే దీని తర్వాత ఇది! దీని తర్వాత ఇది! ఈ జ్వరం ఒంట్లో మంట! ఒక్కొక్కటే, ఒక్కొక్కటే!

నాన్న సరేగాని ఇది చెప్పు, చూద్దాం? అన్నీ జాగ్రత్తలు పడతారు గదా నీకెలా తగిలింది ప్లేగు?

ఆదిమూర్తి . ఒక సాహసం చేశానండీ నాన్నగారూ? ప్లేగు క్రిముల ప్రవర్తన కనిపెట్టడానికి ఆరోగ్యవంతుల అవసరం పడింది అందరూ తటపటాయిస్తూ ఉంటే నా మీద పరిశోధనవ కానియ్యండన్నాను ఆ వెంటనే -

నాన్న ప్లేగు తగిలింది నీకు?

ఆదిమూర్తి తగలడంలోకీ! తుఫానులాగ చెలరేగింది మావాళ్ళంతా అనుకున్న దొకటీ అయిన దొకటీ!

నాన్న అయితే అందువల్ల ఏం లాభం అబ్బాయీ!

ఆదిమూర్తి. విజ్ఞానాభివృద్ధి, నేను చస్తేనేం? విషక్రిముల ప్రవర్తన తెలిసింది అది ముఖ్యం ఆ తర్వాత విరుగుడు కనిపెట్టడం సులభమవుతుంది.

నారాయణ ప్లేగుతో చచ్చిపోవడం ఇబ్బందిగానే ఉంటుందికాదూ?

ఆదిమూర్తి ఇబ్బందిన్నర! ప్లేగు తగిలిన ఎలుకని చూశావ్? ఎలుకలాగే పడుక్కున్నా ననుకో అదేం జ్వరమో పాడో బ్రహ్మరాక్షసి కోరలతో కొరుకుతున్నట్టు! ఇక ఒళ్ళంతానా . పోనిద్దూ! గర్భశత్రువుకైనా వొద్దాచావు.

రామన్న . అయితే మనందరిలోకి ప్రశస్తమైన చావు నాన్నది మాత్రమే అని తోస్తుంది.

నాన్న నాదా? నా చావు ప్రశస్త మనుకుంటున్నావా?

రామన్న ఎందుక్కాదు? యుద్ధరంగంలో మరణం. ఏమైనా అది -

నాన్న . ఆ విధంగా చావలేదు నాయనా నేను!

రామన్న · అదేమిటి నాన్నగారూ అలా అంటారు? మీరు యుద్ధరంగంలో చచ్చిపోలేదూ? చిన్నప్పటినుంచీ మేము నమ్ముతున్న దేమంటే -

నాన్న ఆఖరి దాడిలో గుండుదెబ్బకి నేను చచ్చిపోయానని! అదంతా అమ్మకోసంలే! అసలు సంగతి వాళ్ళు బయటపెట్టడానికి వీల్లేదు చూడూ!

నారాయణ: అయితే మరి నాన్నగారూ మీరేవిధంగా -

నాన్న : తుపాకి దెబ్బకి నేను చావలేదు చచ్చిపోయా ననుకొని మా వాళ్ళు నన్ను వదలిపెట్టి పోయారు.

నారాయణ. గాయపడ్డ మనిషినా?

నాన్న శత్రువులు తరుముకొస్తూంటే ఏం చేస్తారు? కాలికి బుద్ధి చెప్పారు. నేనక్కడే ఉండిపోయాను. మన్యపు దొరలు నన్ను పట్టుకున్నారు.

రామన్న . పట్టుకుని?

నాన్న : పట్టుకొని నన్ను చిత్రవధ చేశారు. (విసుగ్గా చెయ్యి విసిరి) అదంతా ఎందుకులే ఇప్పుడు? ఆదిమూర్తీ! అమ్మకెలా వుంది?

ఆదిమూర్తి నాడి ఇప్పుడు కొంచెం నయంగా వుంది

నాన్న (అందర్నీ ఉద్దేశించి) ఇదుగో చూశారా! ఈ సంగతులేవీ అమ్మకు తెలియ నియ్యకండేం!
(కొద్ది సేపు నిశ్శబ్దం)

నారాయణ (నోటుబుక్కును చూసుకుంటూనే) ఇదే వరస. ఏదో ఒక కారణం చెప్పి చచ్చిపొమ్మంటారు ఏదో ఒక ఆదర్శం చూపించి దానికోసం ప్రాణాలు సమర్పించడం ఎంతో ఘనకార్యం అంటారు శాస్త్రం అనో, దేశం అనో, మతం అనో, మోక్షం అనో ఎప్పటికేది రుచిగా ఉంటే అది తీరా చచ్చిపోయిచూస్తే ఏముందీ వొట్టి -

ఆదిమూర్తి వొట్టి భ్రమ వాళ్ళు చెప్పేదానికంతా వ్యతిరేకం చచ్చిపోతున్న వాని మనోభావాలు ఇలా ఉంటాయని గ్రహిస్తే ఎవ్వరూ చావడం చాలా గొప్ప సంగతి అని అనరనుకుంటాను నాకు మట్టుకు నీ చావులో ఏ మాత్రమూ గొప్ప సంగతి కనబడలేదు
(దూరంలో కాల్పులు)

నాన్న ఏమైతేనేం! ఎల్లప్పుడూ మానవులు ఏదో ఒకదానికోసం చనిపోతూనే ఉన్నారు ఆదేదో మనకిప్పుడు జ్ఞాపకం ఉండకపోవచ్చును బహుశా ఇది తప్పనుకుంటాను అయినా నా కొక్కొకప్పుడేమనిపించుతుం దంటే - కొలువు ముగించుకొని పింఛను పుచ్చుకుంటూ ఇక్కడ మీ అమ్మతో జీవించాలని. ఏవో పూర్వస్మృతులను పుస్తకాలుగా రాయాలనీ. లేదా మనం ఇంటిచుట్టూ మొక్కలు పెంచాలనీ! అలా బతికుండడం బాగుంటుంది కాదూ! ఏమైనా జీవితాన్ని కొట్టిపారెయ్యలేము ఏదో ఒకటి చెయ్యడానికి అవకాశం ఇస్తుంది జీవితం! మీరంతా పెద్ద పెద్ద ఆదర్శాల కొసం ప్రాణత్యాగం చేశారని నే నెరుగుదును ఆదిమూర్తి సైన్సు కోసం, నారాయణ విమానాల అభివృద్ధి నిమిత్తం, రామన్న - అబ్బాయి! రామన్నా! నువ్వు దేనికోసం చచ్చిపోయావు నాయనా?

రామన్న (చదరంగం బల్లమీద బలాన్ని పేర్చుతూ) సమానత్వం కోసం నాన్నా! స్వాతంత్ర్యం కోసం!

నాన్న ఒహో అలాగా? మరి నేను రాజుకొసం దేశంకోసం నా పటాలపు మర్యాదకొసం చచ్చిపోయాను లేదా మాపై అధికారి ఒక చచ్చుచవట ఉత్తరువు ఇవ్వడం వల్ల అది సరేలే దానికేం! అన్ని చచ్చిపోవడానికి తగిన అమోఘావకాశాలే! కాని ఒకటుంది. చూడండీ మీ అందరికన్నా చాలాకాలం కిందట చచ్చిపోయాను కదా నేను అయినా మళ్ళీ బతికే అవకాశమే ఉంటే తప్పకుండా ఒప్పుకొని తీరుతాను సజీవంగా ఉండడమే సంతోషం. నేను సంతోషంగా బతికాను చాలా సంతోషంగా. మరి మిమ్ములందర్ని చూస్తూ ఉంటే, మీరు కూడా ఏవో గొప్ప కార్యాలు, నిజంగా గొప్పవి సాగించే వారనుకుంటాను. ఇప్పుడేమైంది? అందరం ఇక్కడ పోగయాం! అందరం వీరాధివీరులం! అన్యాయం! దురన్యాయం! ఇప్పటికీ మనందరం బతికే ఉండవలసింది

ఆదిమూర్తి. చావంత విసుగైన దింకోటి లేదు. ఇతరు లందరూ ఎన్నో పనులు చేస్తూంటే నోళ్ళు వెళ్ళబెట్టిచూస్తూ కూచోవడం తప్ప మనం చేసేది మరేదీ లేదు. మరణించాం కాబట్టి మనం గాలి ఎటువీచితే అటు కదలవలసిందే. (బుక్‌కేస్ దగ్గరికి నడచివెళ్ళి) నేనే బతికిఉంటే అహోరాత్రాలు పనిచేసే వాడిని! రాచకురుపుని నిర్మూలించడానికి ఉపాయాలు వెదికేవాడిని.

నారాయణ (ఇంకా పోట్లాడుకుంటారే) మరి నేనేం చేసేవాడినంటే

నాన్న ఏం చేసే వాడివి?

నారాయణ ఇప్పుడే తట్టింది ఫస్టైన ఊహ విమానం నడపడంలో కొత్త టెక్నిక్! ఛీ! ఇంతకు ముందె ఈ ఊహ నాకెందుకు తోచిందికాదో! ఇదిగో ఇప్పుడే అంతా గీచిచూపగలను. (టేబిలుముందు కూచుని ఒక్క స్కెచ్చిగీస్తాడు ) ఔను? ఇది చాలా సరయిన పద్ధతి!

ఆదిమూర్తి (బుక్ కేస్ తెరిచి) అమ్మ నిజంగా చాలా గొప్పదిసుమా!

రామన్న (చదరంగ బల్లవద్ద) ఎలాగేమిటి?

ఆదిమూర్తి నాకు వచ్చే పత్రికలన్నీ దాచింది ఇందులో మెడ్రాసునుంచి వస్తున్న మెడికల్ జర్నల్ దీనికి నేను వ్యాసాలు రాసెవాణ్ని

రామన్న ఔను అందులో నీ చావునుగురించి పసందయిన సంపాదకీయం ఉంది నేను చదివాను.

ఆదిమూర్తి (ఒక పత్రిక పుటలు తిరగేస్తూ) పత్రికలు చూడడమే బొత్తిగా మానేశాను ఏయే గొప్ప సంగతులు కనిపెడుతున్నారో ఇప్పుడు, నేనో పాత పత్రికనై పోయాను.

(సోఫాలో సుఖంగా కూర్చొని పత్రిక తిరగేస్తూ ఉంటాడు)

నాన్న (అమ్మ పక్కని నిలుచుండి) చూడవే ముసిలీ! నీ పిల్లలంతా నీ దగ్గరకి మళ్ళీ వచ్చేశారు ఈ ఇల్లెంతో సదుపాయంగా ఉంది వీళ్ళకి నీకు తెలుసునో తెలియదో గాని నీకు సంబంధించినంత మట్టుకు మేమంత మందిమీ యింకా బ్రతికే వున్నాం

రామన్న (చదరంగం బల్లదగ్గర) ఉఁహుఁ లాభం లేదు. చాలా కష్టం ఈ ఆట కట్టించడం

నారాయణ ఔను ఇదే పద్ధతి అయితే గురుత్వాకర్షణ సూత్రం ప్రకారం ఈ విమానం రెక్క ఇంకొంచెం కిందికుండాలి.

నాన్న (గ్రామఫోన్ పెట్టె తెరచి) ఈ గ్రామఫోన్‌ని యెప్పుడూ నాతో తీసుకు వెళ్ళేవాడిని, యుద్ధరంగాలకికూడా! (అలవాటు లాగే కీ ఇస్తూ) ఇది నాకెంతో ఇష్టమైన రికార్డు నా జ్ఞాపకంకోసం మీ అమ్మ దీన్ని ఇక్కడే ఉంచింది.

(గ్రామఫోను సంగీతం)

(నాన్న వింటూ ఉంటాడు. మిగిలినవాళ్ళు ఎవళ్ళ గొడవలో వాళ్ళుంటారు )

ఆదిమూర్తి. (మెడికల్ జర్నల్ చదువుతూ) అరే విచిత్రం! ఆఖరికి కుష్టు రోగానికి విరుగుడు కనిపెట్టారు ఎంత గొప్ప విశేషం

(వెలుపల కాల్పుల చప్పుడు)

నారాయణ (శ్రద్ధగా బొమ్మ గీసుకుంటూ) అవతల ఆ గొడవ యింకా అయిపోలేదూ?

రామన్న (చదరంగం దగ్గర) ఏదీ ఇంకా ఇప్పుడే ప్రారంభం. చూడండి నాన్నగారూ! ఈ ఆట సమం అయిపోయేటట్టుంది. ఎర్రబలానికి గెలుపులేదు తెల్ల బలానికి గెలుపులేదు.

(వెలుపల చప్పుడు ఎక్కువవుతుంది గ్రామఫోన్ ఆగిపోతుంది)

నాన్న ఎంతో యిష్టం కానీ రికార్డు - (ఇంకో వేపు దృష్టి మరల్చివింటాడు) వింటున్నావా? ర, ట, ర, ట, టట! మరఫిరంగులు!

రామన్న అంటే ఇప్పుడే రసకందాయంలో పడిందన్నమాట వ్యవహారం! నేను ఇక్కడ పడుకుని ఉన్నాను (దిగులుగా లేస్తాడు) ఏం దురదృష్టం! అక్కడ నేను ఉంటే ఎంత బాగుండును ఇప్పుడు! కానీయండర్రా కుర్రాళ్ళూ! చూపించండి మీ తడాఖా!

ఆదిమూర్తి (పత్రిక పారేసి నిలబడతాడు) అంటే మరి కొంపదీసి పీడ ప్రాణం అన్నమాట! వెధవ చప్పుడా అని! వెధవ చప్పుడు!

రామన్న అదేమిట్రా అన్నయ్యా అలా అంటావు అంతకన్న మించి సంగీతం ఏం వుంది? వాళ్ళు మావాళ్ళు సిద్ధమవుతున్నారు వీధులన్నీ మర తుపాకులతో తుడిచిపెడుతూ అమోఘంగా విజృంభిస్తున్నారు సెభాష్! వీరుల్రా! నేను వృథాగా చచ్చిపోలేదన్నమాట

నాన్న ఆవేవో కొత్తరకం తుపాకుల్లా వున్నాయి కొత్త చప్పుడు. రెండు మైళ్ళ దూరం పేలేటట్లున్నాయి

నారాయణ (నిలబడి) ఊరిమధ్య విరుచుకుపడ్డారు నాన్నా!

రామన్న (ఉద్వేగంతో) అవి మా ఫిరంగులు! అంటే, మేం గెలిచామన్న మాట

నాన్న అమ్మ జడుసుకోకుండా ఉంటే చాలును

ఆదిమూర్తి అమ్మకింకా స్మారకం రాలెదు ఇదేమీ వినబడదు (జేబులో నుంచి బాండేజిగుడ్డతీసి వేలికి తొచనట్టుగా చుట్టుతూ, విప్పుతూ) జనంపై ఫిరంగులు కాల్చుకుంటారా ఎవరైనా? ఎంత జనాభా నష్టం కాదు?

రామన్న అయితే కావచ్చును కొత్త వాళ్ళకి జాగా యివ్వాలి కొత్త ప్రపంచం పుడుతుంటుంటే వేనవేల ప్రజలు చస్తేనేం? ఆ చప్పుడు వినపడిందా? ఏం మజాగా ఉంది! అబ్బ! నేనుకూడా అక్కడుంటేనా?

నాన్న ఊరంతా చుట్టేస్తున్నారు ఇదేం బాగులేదబ్బీ! ఖూనీలు కాని ఇది యుద్ధం అనిపించుకోదు

రామన్న అవునుగాక! దీనిసంగతింతే! ఎప్పటికేనా అదను రాదూ? ద్రోహుల పని పట్టించడానికి? తెల్ల బలాన్ని నరికి కుప్ప వేయడమే పని ఇంకోలాగా దారికి వస్తారా వాళ్ళు? పోరాటం విస్తరిల్లుతోంది కొనదాకా మావాళ్ళు నిలబడతారు. సిపాయిలంతా మా తరఫు ప్రజలు మా పక్షం. ఆఫీసర్లే చాలడంలేదు మా శత్రువులకి విమానాలూ ఫిరంగులూ ఉంటేనేం? ఊరిమీద బాంబులు వేస్తారనుకోను అలాంటి పని చేస్తే ఊరంతా నేలమట్టమై పోతుంది అంత పని చేస్తారంటారా నాన్న గారూ?

నాన్న నాకు తెలియదు బాబూ! ఈ రోజుల్లో మీ కేవో కొత్త రూల్సు ఉన్నట్టుంది.

నారాయణ (రేడియో సెట్టుప్రక్క) రేడియోస్టేషన్ ఎవరిచేతిలో ఉంది?

రామన్న సందేహమా? మావాళ్ళ చేతులోనే ఉండి ఉంటుంది ఏదీ వెయ్యి అన్నయ్యా! ఏమంటారో విందాం!

నారాయణ. సరే కానియ్యి. (రేడియో తిప్పుతాడు) విను మరి!

రేడియో

గొంతుక : (లక్ష్మన్న గొంతుకవలె) ఇది తెల్లబలాల ప్రధాన కార్యాలయం.

రామన్న (బిక్క చచ్చిపోయి) ఏదో పొరపాటు జరిగినట్టుంది

రేడియో గొంతుక : ఇదే ఆఖరుసారి వీధుల్లో రక్తపాతం ఆపవలసిందని ఎర్రబలానికి తెల్లబలాల

సైన్యాధ్యక్షుని హెచ్చరిక - ఇదే ఆఖరి హెచ్చరిక! మీ ఆయుధాలను విసర్జించండి ఐదు నిమిషాలలోపుగా మీమీ ఆయుధాలను అప్పగించకపోతే నగరం మీద ఫిరంగులు కాల్చడానికి సైన్యాధ్యక్షుడు ఉత్తరువు చెయ్యక తప్పదు

రామన్న (అరుస్తాడు) ఘోరం! అంత పని చేస్తారా వాళ్ళు? నాన్నగారూ వాళ్ళంత ఘోరానికొడిగట్టుకోరు కాదూ? మతి పోయిందేమిటి చెప్మా ఆ దగుల్బాజీలకి?

రేడియో

గొంతుక పౌరులందరూ ఎవరిళ్ళలోంచి వాళ్ళు కదలకూడదని సైన్యాధ్యక్షుని ఉత్తరువు నాలుగు నిముషాలలో ఎర్రబలాలు లొంగిపోకపోతే నగరం మీద ఫిరంగులు బారుచేసి కాల్చడం ప్రారంభమౌతుంది అవసరంపడితే విమానాలు కూడా దాడి చేస్తాయి

రామన్న రాక్షసులు! నిజంగా విమానాలు తెస్తారేం? వొట్టిది! మమ్మల్ని బెదరించడానికి అంతే! ఛండాలపు తెల్లదండు!

రేడియో

గొంతుక నగరం నాశనమైనా, అమాయక ప్రజలు చచ్చిపోయినా అందుకు బాధ్యత ఎర్రబలాల నాయకులదే! ముందుగానే హెచ్చరిక చేశాము తుది ఘడియదాకా ఎర్రబలంతో మేము రాయబారాలు సాగిస్తూనే ఉన్నాము కాని వాళ్ళే రాయబారాలు ఒక మూల సాగుతూండగా తమకు చిక్కిన ఖైదీలనూ, మా ఆఫీసర్లనూ ప్రజలనూ హత్య చెయ్యడం ప్రారంభించారు -

రామన్న . పచ్చి అబద్ధం! మీరే ఖూనీలు మొదట ప్రారంభించారు (మెడ తడువుకుంటూ) దీని మాటేమిటి?

రేడియో

గొంతుక ఇక రాయబారాలతో నిమిత్తం లేదు. ఆయుధాలతో ఎవరు కనిపించినా తక్షణం వాళ్ళని కాల్చేస్తారు. ఎర్రబలాల పక్షం వహించిన వాళ్ళందరినీ మిలిటరీ కోర్టులు విచారణ చేస్తాయి. ఇక రెండు నిమిషాలలో నగరంమీద ఫిరంగి కాల్పులు ప్రారంభమవుతాయి ఆఖరిసారి ఎర్రబలానికి హెచ్చరిక! ఆయుధాలను విసర్జించండి లేకపోతే ఈ నగరం నాశనం కాకతప్పదు అందుకు బాధ్యత మీదే! ఆఖరిసారి హెచ్చరిక! ఆయుధాలు వదలండి ఆఖరిసారి ఆయుధాలు! ఆఖరిసారి ఆయుధాలు క్రింద పెట్టండి! ఆఖరిసారి!

రామన్న అరుచుకో! ఇంకా అరుచుకో! ఆయుధాలు మాత్రం వదలకండి అబ్బాయిలూ! నగరం నాశనమైనా సరే! వాళ్ళు యిష్టంవచ్చిన పని చెయ్యొచ్చు మీరు మాత్రం లొంగకండి!

ఆదిమూర్తి. అప్పుడందరూ చచ్చిపోవడానికి మంచి ఆదర్శం దొరుకుతుంది కాదూ! ఆపెయ్యరా! దాన్ని తమ్ముడూ!

(నారాయణ స్విచాఫ్ చేస్తాడు)

రామన్న · ఔను! చచ్చిపోదగ్గ ఆదర్శం! పారా హుషార్ ఎర్రబలాలు! పైపైకి కదలండి! స్వాతంత్ర్యంకోసం! విజయంకోసం! ఇంతకన్నా ఇంకో మంచి ప్రపంచంకోసం! లొంగిపోవద్దర్రా కుర్రాళ్ళూ! నగరమంతా ధ్వంసధూళి అయిపోయినా సరే! ప్రజలందరూ నాశనమైపోయినా సరే, ప్రపంచమంతా భస్మీపటలమై పోయినా సరే మన ఉద్యమం

జయిస్తే చాలును! తెల్లవాళ్ళది పై చెయ్యి కాకపోతే చాలు లోకమంతా తుడిచిపెట్టుకుపోయినా సరే!

(దూరంలో ఫిరంగి కాల్పులు)

నాన్న ఫిరంగులు! చప్పుడునుబట్టి చూస్తే భారీ ఫిరంగుల్లాగే ఉన్నాయి! అన్నంతపనీ చేసి తీరుతున్నారు వాళ్లు.

నారాయణ ఇదంతా చూస్తే నేను చచ్చిపోవడమే నయమనిపిస్తోంది!

నాన్న కాదామరి! థాం! మళ్ళీ చప్పుడు ఇందాకటికన్నా దగ్గరగా ఉందే!

రామన్న (అరుస్తాడు) ఖూనీకోరులు! చంపండి! మీ యిష్టం! యింకా చంపండి! మేం మాత్రం లొంగం!

నాన్న గట్టిగా అరవ్వొద్దు అమ్మకి తెలివొస్తున్నట్టుంది

నారాయణ పాపం? అమ్మ మంచి రద్దీ సమయంలోనే మేలుకుంటోంది

నాన్న . దీపాలార్పెయ్యండి.

(చీకటి ఫిరంగుల మ్రోతలు, తుపాకి కాల్పులు)

ఆదిమూర్తి

గొంతుక . అమ్మా! మరి నేను వెళ్తున్నాను.

నాన్న

గొంతుక నీకేం భయంలేదే అమ్మీ! మేం యెప్పుడూ నిన్ను వదలి పెట్టము

నారాయణ

గొంతుక అబ్బే! అదేదో తుఫానే అమ్మా! త్వరలోనే తెరిపిచ్చేస్తుంది

రామన్న

గొంతుక ఖూనీ! ఖూనీ!

(దూరంగా ఫిరంగులూ తుపాకులూ పేల్చుతున్న చప్పుడు కిటికీలో ఎర్రటి మంటల కాంతి క్రమక్రమంగా హెచ్చుతుంది)

అమ్మ . (తలెత్తి) రామా! లచ్చిగా! చిట్టీ! ఒరే లచ్చీ! ఏమిటర్రా ఆ చప్పుడు? ఏడీ రామం? చిట్టీ లచ్చిగాడేడీ? లచ్చీ - నా మాట వినబడుతోందా?

(గుమ్మంలో సింహం)

సింహం ఇక్కడే ఉన్నానే అమ్మా! (ఎలక్ట్రిక్‌లైటు వేస్తాడు) నీ కోసమే వెదుకుతున్నాను

అమ్మ (రెండు చేతులతో కళ్ళు మూసుకుని) చిట్టీ! రామం ఏడిరా? ఇంకా యింటికి రాలేదూ?

సింహం . లేదమ్మా! ఇంకా లేదు.

అమ్మ . ఆ చప్పుడంతా ఏమిట్రా చిట్టీ!

సింహం తుపాకులతో చంపుకుంటున్నారు. ఈ దగ్గిర్లో కాదులే నీకేం భయం లేదమ్మా! నేనిక్కడే ఉంటాను. (డ్రాయరు తెరచి లక్ష్మన్న దట్టించిన రివాల్వరు తీస్తాడు) నువ్వేమీ భయపడకమ్మా!

అమ్మ : ఏం చేస్తున్నావు చిట్టీ? అలా ఉంచు ఆ రివాల్వర్ని. అదెందుకురా నీకు? దానితో ఆడుతావేం? వొద్దు. అక్కడ పడెయ్యి.

[illegible] అది కాదే అమ్మా! ఏమయింది ఏమొచ్చినా - అన్నయ్య ఉన్నాడు కదా-

అమ్మ చిట్టి—దేవీ! ఎలా చిట్టిగాడ్నీ!

[illegible] మరి నువ్వు కోప్పడకపోతే -

అమ్మ ఏమీ! ఏమిటా మీ అన్నయ్య? ఎక్కడ చిట్టిగాడు?

[illegible] వీధిలోకి పోయాడమ్మా! తుపాకి తీసుకుపోయాడు కోప్పడవద్దని నీతో చెప్పమన్నాడు వెళ్ళక తప్పదన్నాడమ్మా! అంటూ వెళ్ళిపోయాడు

(ఫిరంగి మోతలు - తెరపడుతుంది)

# తృతీయాంకము

(అదే గది. అయితే గోడలమీద ఆయుధాలన్నీ తొలగించబడ్డాయి)

అమ్మ (ఆఖరి పిస్తోళ్ళ జతతీసి డ్రాయర్లోపెట్టి తాళం వేసి, తాళాలు మొలలో పెట్టుకుంటుంది) అమ్మయ్య! శని విరగడయింది చిట్టిగాడికి కత్తులూ కటార్లూ ఎప్పుడూ ఎదురుగుండా కనబడ్డం నాకు సుతరామూ యిష్టం లేదు (చుట్టూ పరికిస్తుంది) ఎంతమాత్రమూ యిష్టంలేదు (కిటికీదగ్గరికి వెళ్ళి తలుపులు మూస్తుంది) కిటికీలోంచి వాడు వీధిలోకి చూస్తేనే నొప్పుకోను (తలుపు దగ్గర లైటు వేస్తుంది) ఇంకేవీ ఇక్కడ మిగిలిపోలేదు కద! (రేడియో సెట్టును సమీపిస్తుంది) తమరింకా మాటలాడుతూనే ఉన్నారు కదూ? ఆవతల ఏం జరుగుతున్నదీ చిట్టిగాడికి తెలియ నక్కరలేదు (సెట్టుదగ్గర తటపటాయిస్తుంది) నాకూ తెలియనక్కరలేదు ఇంకో మాటకూడా వినదలచుకోలేదు. వాళ్ళంత మందీ ఎలా చస్తేనాకేం? (సంకోచిస్తుంది) చూశావూ? నువ్వు నోరు మూసుకోవాలి ఏవో కబుర్లు చెప్పాలనుంది కాదూ నీకు? చిట్టిగాడి మనస్సులో ఏవో వెర్రిఊహలు కల్పించాలని కాదూ నీ తాపత్రయం? వీల్లేదు! ఇక నిన్నుకేకలు వెయ్యనివ్వను మా యింటిలో నువ్వరవకూడదు. ఇంకెక్కడయినా నీ యిష్టం వచ్చినట్లు కేకలు వేసుకో. ఇక్కడమాత్రం వీలులేదు. ఈ యింటికి నేనూ పెద్దని, తెలిసిందా? చిట్టిగాడికి నువ్వు పిచ్చికబుర్లేవీ చెప్పకూడదు సుమా, ఏమనుకుంటున్నావో యేమిటో? (రేడియో వేస్తుంది) అయినా విందాం, యేం చెబుతావో చెప్పు!

రేడియో
గొంతుక (స్త్రీ కంఠం చించుకున్నట్లు ఆందోళనగా) ఇది ఘోరం. ఇది దారుణం. అన్ని ధర్మాలకూ విరుద్ధం ఈ నేరం! ఒడంబడిక లన్నింటినీ కాలరాచివేశారు ఎన్నడూ కనివిని యెరుగని ఘాతుకచర్యలు సాగిస్తున్నారు ఏ యుద్ధ ప్రకటనా లేకుండా, ఏ కారణం చూపించకుండా, రాయబారాలనైనా జరపడానికి ప్రయత్నించకుండా. ఒక విదేశరాజ్యపు సైన్యం మా సరిహద్దులను దాటింది ఏ హెచ్చరికా లేకుండా, కేవలం నిష్కారణం, ఏ యుద్ధ ప్రకటనా లేనిదే విదేశీయ శతఘ్నులూ, విమానాలూ మా నగరాలమీదా, పట్టణాలమీదా దండయాత్ర ప్రారంభించాయి మా దేశం దురదృష్టవశాత్తూ ఒక అంతర్యుద్ధంలో

చిక్కుకున్నందున ఆ అవకాశం తీసుకొని ఈ సంధిగ్ధసమయంలో, శత్రువులు శాంతిభద్రతలు నెలకొల్పడం అనే మిషతో మామీద విరుచుకుపడ్డారు ఎవరిచ్చారు వాళ్ళ కీ హక్కు? ఇలా కల్పించుకోవడానికి వాళ్ళకేం అధికారం ఉంది? అటువంటి హక్కు లేదు అటువంటి అధికారం లేదు ఈ రేడియో ప్రకటన, ఈ విజ్ఞాపన సకల మానవ ప్రపంచానికీ చేస్తున్నాము ఒక ఘోరం, నోట వచించరాని నేరం జరిగింది. ఉయార్ బ్రాడ్ కాస్టింగ్ దిస్ ఎపీల్ టుది హోల్ వర్ల్డ్ హం సారే దునియాకో యహ్ విజ్ఞాపన్ కర్ రహేహై. దేఖియే. కైసే అత్యాచార్ హోగయా హమారేలోగోం లూట్ విమానితే. హోయ్ కెల్ క్రిమ్ మా దేశం మా దురదృష్టదేశం, అలిసిపోయిన మా దేశం ఆఖరిదశకి వచ్చేసింది

అమ్మ (వైర్లెస్సును స్విచాఫ్ చేసి) నా ముందు అరుచుకుంటే ఏంలాభం? నీ యేడుపులు నేను వినదలచుకోలేదు ఘోరం జరిగిందే? నేరం జరిగిందే? నా రామన్నని ఉరితియ్యడం నేరంకాదు కాబోలు? తుపాకిదెబ్బతిని నా లక్ష్మన్న చచ్చిపోతే నేరం కాదు కాబోలు? నేరాలను గురించి నాముందు మాట్లాడితే ఏంలాభం? నాకు వాటి సంగతంతా తెలుసును నేను పిల్లలుగల తల్లిని! నా పట్ల జరిగినన్ని నేరాలు ఎవరిపట్లా ఎప్పుడూ జరగలేదు. ఔనులే నా పిల్లలని నువ్వెరగవు వాళ్ళున్నప్పుడీ యింటికెంత వెలుగుగా ఉండేది? అప్పుడు వాళ్ళని నువ్వు చూడవలసింది? అరుచుకో! ఇంకా అరుచుకో! ప్రపంచం వింటుందనుకున్నావా నిన్ను? నీలాగే నేనూ ఇదివరకు అరిచానులే! నాకేమైనా జవాబు వచ్చిందనుకున్నావా?

(రేడియో వేస్తుంది)

రేడియో

గొంతుక కాబట్టి ఇతరులమీద ఆధారపడకుండా శాయశక్తులా మనమే పోరాటం సాగించాలి. కొనూపిరి మిగిలినదాకా దేశరక్షణకియుద్ధంచేస్తాం శవాల గుట్టలుగా పడి ప్రతిఘటిస్తాం నిరాశనుంచి పుట్టిన సాహసంతో మనసేనలు శత్రువు నెదుర్కొని పోరాడుతున్నాయి. అదనపు బలాలులేని మనవాళ్లు ఇక నెంతో కాలం నిలబడలేరు. దేశంలోని మగవాళ్ళందరికీ ఇదే పిలుపు! సేనలు తగ్గిపోతూ ఉంటే వారి జాగా మీరు తీసుకోవాలి! యుద్ధంలోకి వెళ్ళిన తమ భర్తలూ, కొడుకులూ చేస్తున్న పనులన్నింటినీ దేశంలోని ఆడవాళ్ళు కొనసాగించవలసిందిగా కోరుతున్నాం.

అమ్మ (రేడియో స్విచ్ఛాఫ్ చేసి), లాభంలేదు! నేనెవ్వరినీ నీ దగ్గరకి పంపించను. పంపించడానికి నా కెవ్వరూలేరు చిట్టిగాడు వెళ్ళడానికి వీల్లేదు! వాడింకా ముక్కుపచ్చలారని బిడ్డడు! బాలుర్నికూడా సైన్యంలో చేరమని ఇంకా ఉత్తరువు జరగలేదు కాదూ? అయినా మా భర్తలనీ, పుత్రులనీ సైన్యంలో చేరమని అడగడానికి నువ్వెవరివి? వాళ్ళు నీ కొడుకులు కారు! నీ భర్తలు కారు! అంచేత ఇక నోరు మూసుకో? నీకేమైనా పిల్లలా? కొడుకుల తల్లివి కావుగద నువ్వు కొంపతీసి?

(రేడియో వేస్తుంది)

రేడియో

గొంతుక    మీరు ఈ గొంతుక ఏ మనిషిదీ కాదు! మీ దేశమాత కంఠం మిమ్మల్ని పిలుస్తోంది! నేను మీ మాతృదేశాన్ని! నా కొడుకులందరినీ ప్రార్థిస్తున్నాను నన్ను రక్షించండి! నా సంసారాన్ని రక్షించండి!

అమ్మ    (రేడియో స్విచాఫ్ చేసి) ఆపేయ్! నువ్వెక్కడ అమ్మవి? నేను, నేను అమ్మని, వింటున్నావా? నా కొడుకులమీద నీకేం హక్కుంది? నువ్వే తల్లివైతే యుద్ధానికి పంపిస్తావా కొడుకుల్ని? దాచేస్తావు వాళ్ళని నాలాగే! గదిలో పెట్టి తాళం వేస్తావు నాలాగే! వేసేసి ఏడుస్తావు నాలాగే నా కొడుకుల్ని వొదులుకోను మొర్రో అని! నిజం చెప్పమంటావా? నీ కష్టగించడానికి ఇక నాకే కొడుకూ మిగలలేదమ్మా! ఒక్కడూ లేడిక్కడ! ఈ యింటలో నేనొక్కత్తినే మిగిలాను పిచ్చిముండని ముసలిముండని! నాకెవరూ మిగల్లేదు ఎవరూ లేరు! ఎవరూ

(అర్థోక్తిలో సింహం గుమ్మందగ్గర నిలుస్తాడు)

అమ్మ    (వెనక్కి తిరిగిచూస్తుంది) నీకేం కావాలిక్కడ? (చచ్చిపోయాడనుకొని భయంకరంగా అరుస్తుంది) అమ్మయ్యో! నువ్వుకూడా నా చిట్టీ! (సింహంని మీదపడి ఒళ్ళంతా తడుముతుంది) లేదు! బతికావ్రా భగవంతుడా! నువ్వే? నువ్వే? బతికే ఉన్నావు. బతికే ఉన్నావు కాదూ? ఎంత హడలిపోయాను! ఏమిటి వెదుకుతున్నావు చిట్టీ? ఏం కావాలినీకు? నువ్విక్కడ వినడం నా కిష్టంలేదు (రేడియో చూసి ) ఆవిడ మాటలు నువ్వు వింటే ఒప్పుకోను. నాకెంత మాత్రం ఇష్టంలేదు చిట్టీ!

సింహం · కాని ఆవిడ గొంతుక ఎంత అద్భుతంగా వుందమ్మా! నా ఒళ్ళంతా గరిపొడుస్తోంది! చూడూ! ఆ అమ్మాయి ఎలా వుంటుందో నేనూహించుకోగలను! సన్నగా పొడుగ్గా.. ఇంతలేసికళ్ళూ

అమ్మ . చాల్లే! అదెలావుంటే మనకేం?

సింహం · కాని ఆవిడ నన్ను పిలుస్తోందమ్మా!

అమ్మ . నువ్వాజోలికి పోకూడదు. చిట్టీ! దానిష్టంవచ్చినట్లు అరుచుకోనియ్యి ఇకమీద నువ్వాగదిలోకి రానేరావద్దు - ఈ గదితలుపు తాళం వేసేస్తున్నాను

సింహం . తాళం ఎందుకమ్మా?

అమ్మ . (కూర్చుంటుంది) తాళం వేసేస్తాను అంతే! ఈ గదిలో తిండి దినుసులు జాగ్రత్తచేస్తాను యుద్ధంవస్తే బువ్వపెట్టొద్దూ నా కన్నతండ్రికి? అయినా ఈ గది ఎందుకూ పనికిరాదు దినుసులు జాగ్రత్త చెయ్యాలని బాగా బుద్ధిపుట్టింది! మనం కిందనే వుండిపోదాం - ఇక్కడికి రానేవద్దు ఎవ్వరూ మనల్ని చూడలేరు ఈ యింట్లో ఎవరూ లేరనే అందరూ అనుకుంటారు

సింహం    ఔనుగాని, అమ్మా.

అమ్మ    : ఒక్కక్షణం ఆగు! భయపడకు చిట్టీ! ఎవ్వరూ పోల్చుకోలేనిచోట నిన్ను దాచేస్తాను. నువ్వసలు బైటికే వెళ్ళకు ఎలాగో ఇంట్లోనే పడి కాలక్షేపం చేద్దాం. అవతల గొడవలన్నీ చల్లారిందాకా ఇక్కడే వుందాం? యుద్ధం ఒకటి జరుగుతోంది కూడా నీకు

తెలియనక్కరలేదు. అదంతా నీలాంటి వాళ్ళకి కాదు నువ్వు పొత్తిగా కుర్రాడివి మనం తలుపులన్నీ వేసుకొని ఎలకల్లాగ బతుకుదాం! నువ్వు పుస్తకాలు చదువుకో ఎప్పటిలాగే ఈ యింటి వెలుపల సూర్యుడు ఉదయిస్తూ ఉంటాడు అస్తమిస్తూ ఉంటాడు. నిక్షేపంలాగ మనం ఈ యింట్లో బతకొచ్చు.

సింహం నేను వెళ్ళాలమ్మా! నన్ను వెళ్ళనివ్వవూ? బతిమాలుకొంటున్నాను వెళ్ళనివ్వవూ?

అమ్మ అదేమిటి చిట్టీ! ఏమిటి నీ ఉద్దేశం? ఇలాంటి మాటలాడకూడదు నువ్వు బాబూ!

సింహం నన్ను వెళ్ళనివ్వవే అమ్మా! ఊఁ అని అను సైన్యంలో చేరుతాను. ఇక్కడ నేనుండలేనమ్మా!

అమ్మ ఏం వాలకంరా యిది? ఎలా వెళ్ళగలవునువ్వు? నీకింకా పద్దెనిమిదేళ్ళు రాలేదు

సింహం అయినా ఫరవాలేదమ్మా! మా క్లాసులో కుర్రాళ్ళంతా చేరుతున్నారు అమ్మా అమ్మా! నువ్వొప్పుకొని తీరాలి

అమ్మ ఏమిటీ వెర్రి? నువ్వువెళ్ళి ఏంచెయ్యగలవు చెప్పు?

సింహం అబ్బ! నీకేం తెలియదమ్మా! నువ్వు పొరపాటు పడుతున్నావు. నేనూ మంచి సిపాయినవుతాను. మా క్లాసులో ఎవరికీ నేను తీసిపోను అదీకాక మాటిచ్చేశాను కూడా!

అమ్మ మాటిచ్చావూ? ఎవరికి?

సింహం మాస్కూలు కుర్రాళ్ళకమ్మా!

అమ్మ నువ్వు మాట ఇవ్వవలసింది మీ అమ్మకిగాని స్కూలు కుర్రాళ్ళకు కాదనుకుంటాను చిట్టీ!

సింహం . తప్పయింది క్షమించవూ అమ్మా! అయితే మరి వాళ్ళంతమంది వెళ్ళుతున్నప్పుడు.

అమ్మ . నువ్వొక్కడివి వెళ్ళకపోయినా మించిపోయింది లేదు చిట్టి తండ్రీ! నువ్వింట్లోనే ఉండిపో!

సింహం . అందరూ వెళ్లుతూంటే నేనే ఎందుకుండిపోవాలమ్మా ఇంట్లో?

అమ్మ : ఇలాంటివాటికి నువ్వు తగినవాడివి కావు కాబట్టి! చూశావా చిట్టీ! నువ్వింకా అర్భకుడివి అదీకాక నువ్వు వెళ్ళడం నాకిష్టం లేదు ఇంతకంటె ఎక్కువేం చెప్పగలను?

సింహం · బాగానే ఉందిగాని అమ్మా; మరి కోప్పడకేం, చెబుతున్నాను: ఇది ఆఖరి అవవకాశం ఇదిపోతే అంతా నాశనమైపోతుంది? ఈ అవకాశం జారిపోతే ఎవరూ ఇక దేశాన్ని రక్షించలేరు.

అమ్మ . నువ్వొక్కడివి అడ్డుపడి దేశాన్ని రక్షిస్తావన్న మాట! నువ్వు వెళ్ళకపోతే అంతా నాశనమవుతుందన్నమాట! ఏం మాటలు నాయనా ఇవి? నువ్వొక్కడివి వెళ్ళగానే అటున్న ముల్లు ఇటు తిరిగిపోతుందా?

సింహం . అందరూ తల్లులూ ఇలాగే అంటే మరి -

అమ్మ : నాకేమీ అది ఆశ్చర్యం అనిపించదు ఏ తల్లి మాత్రం సహిస్తుంది. ఒక్కొక్కళ్ళనే తన కొడుకుల్ని తన కళ్ళముందే ఈడ్చుకుపోవడానికి - అటువంటి ఆడది అమ్మ అనే అనిపించుకోదు - బుద్ధి పూర్వకంగా ఇందు కిష్టపడిందంటే!

సింహం : మరి ఇంతఘోరమైన యుద్ధం ప్రారంభించినప్పుడు -

అమ్మ దీన్ని నేను ప్రారంభించలేదు చిట్టీ! ఏ తల్లీ యుద్ధాలని ప్రారంభించదు తల్లులు ఎప్పుడూ ఎక్కడా యుద్ధాలు చెయ్యలేదు వాళ్ళు చేసిందంతా తమ బిడ్డల ప్రాణాలని ముడుపులాగ ప్రతీ యుద్ధంలోనూ చెల్లించడమే! కాని ఈ యుద్ధానికి మాత్రం నా ఆఖరి కొడుకును అర్పించలేను నా సాయంలేకుండానే సాగించమను ఈ యుద్ధాన్ని! ఇక నేమీ ఇవ్వలేను నేను! ముఖ్యంగా నిన్ను వాళ్ళు తీసుకుపోవడానికి ఒప్పుకోను చిట్టీ!

సింహం మరి నువ్వు కోప్పడకూడదమ్మా! నేను వెళ్ళితీరాలి ఆజ్ఞ అయింది! మేమంతా ఆయత్తపడాలి

అమ్మ నీకింకా యీడులేదు. పసిబిడ్డవి నువ్వు! ఇలా నేను కళ్ళుమూసుకుంటే చాలును ఏమిటి కనబడుతుందనుకున్నావు నాకు? పాకుతూ కేరుతూ చిట్టిగాడు! నడవబోయి పడిపోతున్న చిట్టిగాడు! లక్కపిడత నోట్లో పెట్టుకుంటాడు! అల్లరి బాజా చిట్టీ! చిట్టి! తప్పుకాదూ? లక్కపిడత నముల్తారా ఎవరేనా? బుద్ధిగా ఇలారా! ఎవరొస్తారో! ఎవరొస్తారో! నా వెన్నముద్దే వొస్తుందో, వెండిగిన్నే వొస్తుందో?

సింహం నేనింకా చిన్నపిల్లణ్ణే అనుకుంటున్నావుటే అమ్మా!

అమ్మ రావూ? ఇలా దగ్గిరగారా? నిన్నొకమారు చూడనియ్యి? సింహం (దగ్గిరగా వస్తాడు) అయితే సిపాయివి కావాలని ఉందీ నీకు? హ్హా! ఏం సొంపుగా ఉంది! చిట్టీ నీకు జ్ఞాపకంలేదూ? ఒకప్పుడు యుద్ధాన్ని నువ్వు అసహ్యించుకునేవాడివి మనుష్యులెందుకు తమలోతాము కాట్లాడుకుంటారొ అనేవాడివి ఈ యుద్ధాల్లో ఎప్పుడూ చేరకూడదనేవాడివి! "అమ్మా! నేను పెద్దవాణ్ణయాక యుద్ధాలేవుండవు మేము యుద్ధాన్ని బహిష్కరిస్తాం ఒకళ్ళనొకరం చంపుకోము! పశువుల ముందలాగ బలి అయిపోవడానికి ఒప్పుకోము! అమ్మా! ఒక మనిషికి ఇంకో మనిషిని చంపడానికి చేతులెలా వస్తాయే"? అనేవాడివి జ్ఞాపకం ఉందీ?

సింహం : ఔనుగాని ఇప్పటి పరిస్థితి వేరు ఈ యుద్ధం ఆత్మరక్షణకోసం

అమ్మ . అయితే నువ్వువెళ్ళి ఎవరినైనాసరే చంపుతావన్నమాట?

సింహం . ఔను అంతే. మరి అవసరంపడినప్పుడు -

అమ్మ నీకు వెళ్ళడం ఇష్టమేనన్నమాట?

సింహం ఇష్టమే! తప్పకుండా ఇష్టం!

అమ్మ చూశావా మరి! ఆఖరికి నువ్వు కూడా నన్ను వదలిపెట్టేస్తున్నావు. ఇక నువ్వుకూడా నాకు బోధపడవు అంతేకాదూ చిట్టి! ఇంతట్లోనే ఎంత మారిపోయావురా నాయనా!

సింహం అమ్మా! నువ్వేడుస్తున్నావు అయితే నన్ను వెళ్ళనివ్వవూ?

అమ్మ · వీల్లేదు చిట్టీ నేను ముసిలిదాన్ని. పెడసరపు ముసిలిదాన్ని నా కొంప తియ్యడానికి వచ్చిన ఈ యుద్ధానికి నా కొడుకుని బలి ఇవ్వలేను. ఇప్పటికే మీ యుద్ధాలు నన్ను పీల్చి పిప్పిచేశాయి వీల్లేదు నిన్ను వెళ్ళనివ్వను. ఇక్కడే ఉండాలి నువ్వు

సింహం · నువ్వలా మాట్లాడకూడదమ్మా! నువ్వొప్పుకోకపోతే పారిపోతాను నేను నిన్ను వొదిలిపెట్టి పారిపోతాను.

అమ్మ (నిలబడుతుంది) అయితే ఉండు! నావేపు చూడుట్టీ! ఒక్కమాటు సరిగా నావేపు చూడూ!

సింహం అమ్మా! అమ్మా! బతిమాలుకుంటున్నాను నిన్ను!

అమ్మ నన్నిక్కడ వదలిపెట్టేస్తావు కాదూ? నేనేమైపోయినా నీకక్కరలేదు కాదూ? నువ్వు లేకపోతే నేనెలా బతగలనో ఆలోచించావా? చిట్టీ! నీకు న్యాయమేనా యిది? నువ్వు తప్ప నాకింకెవరున్నారు?

సింహం నేనేమీ అయిపోనులేవే అమ్మా! ఎందుకూరికే భయపడతావు? నిజం చెబుతున్నాను నాకు తెలుసును నాకేమీ ప్రమాదం జరగదు

అమ్మ నువ్విలాగే అనుకుంటావు మీరంతా అలాగే అనుకొని బయలు దేరుతారు షికారుకి వెళ్ళినట్టుగా వెళ్ళిపోతారు మీరు "భయపడకే అమ్మా! మళ్ళీ వచ్చేస్తాం కదూ"? ఏం చూస్తారో నా మొగం నాకు తెలుసును ఈసారి నన్ను మోసం చెయ్యకు నాయనా?

సింహం నేనేం మోసం చెయ్యలేదమ్మా! నాకు తెలుసు బహుశా నేను, నేను చచ్చిపోవచ్చును వెళ్ళాలని నిశ్చయం చేసుకున్న తర్వాత లక్షసార్లు చచ్చిపోయాను చచ్చిపోవడం నాకిప్పుడొక కష్టమైన పనికాదు అంతా నాకు స్పష్టంగా కనబడుతోంది మా క్లాసు కుర్రాళ్ళంతా యుద్ధరంగంలో చచ్చిపోయినట్లు పడిపోవడం కనబడుతుంది! బారులు బారులుగా పడి ఉంటారు ఇంకా వాళ్ళ వేళ్ళకి సిరా అంటుకునే ఉంటుంది అయినా నాకేమీ లక్ష్యం ఉండదమ్మా! నాకేమీ భయంవెయ్యదు చూశావామరి? అంటే నేను వెళ్ళాలన్నమాట నిజానికి నేను వెళ్ళకపోవడమే అనేదే ఊహించలేను వెళ్ళడమే మా అందరి విధి అని మేమంతా కూడ బలుక్కున్నాము

అమ్మ నీ విధి ఏమిటో నీకు తెలుసునా చిట్టీ? ఇక్కడ నా దగ్గరే వుండడం అదీ నీ ధర్మం! మాకోసం నీ అన్నలకోసం నువ్విక్కడే వుండాలి నీ మీద నాక్కూడా ఒక హక్కుంది కాదూ చిట్టీ?

సింహం ఔనుగాని అమ్మా! అంతకన్నా పెద్దధర్మం ఒకటి -

అమ్మ అంతకన్నా పెద్దది! నాకన్నా ఎక్కువది! ఇప్పుడు తెలిసింది. మీ దృష్టిలో నాకేమీ విలువలేదన్నమాట! నేనేమైపోయినా సరే! మీ విధులూ! మీ ధర్మాలూ మీవి! మీరు పెద్దపెద్ద పేర్లు పెట్టి పిలిచే ధర్మాలన్నీ నాకు తెలుసునాయనా! అవి నన్నేమీ ఆకర్షించలేవు! బొత్తిగా ముసిలిదాన్నయిపోయాను. అవి నా రక్తాన్ని ఉడుకెత్తించలేవు ముసిలిదాన్నినేను! వెయ్యి వేలేండ్ల ముసిలిదాన్ని!

సింహం అమ్మా! నువ్వు నన్ను వెళ్ళనివ్వకపోతే, మరి నేను -

అమ్మా మరి నువ్వు నాతో మాట్లాడవు అంతేకాదూ? నన్ను చూడనే చూడవు. నేనంటే అసహ్యించుకుంటావు. ఎలాగైనా ఇక్కణ్నుంచి పోదామనుకుంటావు నువ్వు అసహ్యించుకున్నాసరే నిన్ను వెళ్ళనివ్వను చిట్టీ! ఈ యుద్ధం అయిపోయాక నువ్వే ఒప్పుకుంటావు. నేను చేసిందే సరైనదని, (సింహం భుజాల మీద చెయ్యివేసి) ఉండిపోతావు కాదూ, చిట్టీ?

సింహం (ఒదులుకొని నిలబడి) అబ్బ! ఊరుకుందూ నన్ను చికాకు పెట్టక -

అమ్మ . సరే! కానియ్యి. నన్నసహ్యించుకో! ఇంతకన్నా ఎక్కువేముంటుంది? నే ననుభవించిన దాంట్లో ఇదెన్నోవంతు? ఇదీ ఎలాగో భరిస్తానులే! వెళ్ళాలనుంటే వెళ్ళు నాయనా! నేనుమాత్రం బతకను కావలిస్తే వెళ్ళు .. ఏం? ఇంకా వెళ్ళలేదేం బాబూ?

సింహం మరి నువ్వు కోప్పడితే యెలాగమ్మా! నీకు సరిగా చెప్పలేకపోతున్నాను అందరూ వెళుతున్నప్పుడే నేనూ వెళ్ళాలి చూడూ!

అమ్మ నేనేమీ చూడలేను నాకేమీ కనబడదు నా పిల్లలుతప్ప నాకెవరూ కనబడరు లాగులు తొడుక్కొని బుగ్గలో ఆడుకునే నా పిల్లలు మాత్రమే నాకు కనబడతారు మీరు ఎదిగినట్టే నా కనిపించదు ఏదీ చూడ్డాం! ఇలారా! చిట్టీ! ఎంత పెద్ద వాడివయ్యావు నువ్వు! ఇక నువ్వు పెద్దమనిషిలాగ ప్రవర్తించడం నేర్చుకోవాలి

సింహం ఔనమ్మా! పెద్దమనిషిలాగ ప్రవర్తించాలి

అమ్మ అయితే మరి నువ్వు నీ వయస్సు చెల్లిన ముసలితల్లిని దానిగతికి దాన్ని వదలిపెట్టి పోకూడదు. ఇలాచేస్తే నీ తల్లికి మతిపోతుంది అప్పుడు నేనేం చేస్తానో తెలుసునా? వీధుల్లోకి వెళ్ళి అరుస్తాను ఈ యుద్ధానికి శాపనార్థాలు పెడతాను. నా కొడుకుని యుద్ధాని కప్పగించుతున్న వాళ్ళందరినీ తిట్టితిట్టి పోస్తాను

సింహం అమ్మా!

అమ్మ ఊరుకో నువ్వు. అంతపని నాచేత చెయ్యనివ్వకూడదు సుమాచిట్టీ! ఇంట్లోనే ఉండి మీ అమ్మని ఊరడించాలి మీ అమ్మని కాపాడాలి నువ్వొకడివే నాకిక మిగిలావురా నాయనా! నువ్వు మనస్ఫూర్తిగా చేసుకున్న నిశ్చయాన్ని వదలిపెట్టడం కష్టమే అని నాకు తెలుసు కాని నా కోసం అటువంటి త్యాగం చెయ్యాలి నువ్వు! ఏమంటావు? ఉండిపోతావు కాదూ?

సింహం (కన్నీళ్ళను ఆపడానికి పెదవులు కొరుక్కుంటూ) అమ్మా నాకేం తోచలేదు! నిన్నొక్కర్తెనే వదలిపెట్టి - నాకేం తోచలేదమ్మా! నేనుండక తప్పనిసరైతే సరేలే అమ్మా!

అమ్మ (నుదుటిమీద ముద్దుపెట్టుకొని) అదీమాట! ధైర్యశాలి నా కొడుకు - అమ్మ చెప్పినమాట వింటాడు. ఎంత బుద్ధిశాలి! ఇప్పుడు నిన్ను చూస్తే మీ నాన్న ఎంత గర్వించాలి! రా నాయనా! నాతోరా! ఈ యుద్ధానికిక మనం సిద్ధపడాలి.

(సింహం భుజంమీద ఆనుకుని నడిపిస్తూ అతణ్ణి గది అవతలికి తీసుకపోతుంది గుమ్మందగ్గర స్విచ్ వేస్తుంది రంగం అంతా చీకటి అవతలినుంచి గదికి తాళం వేసిన చప్పుడు)

ఆదిమూర్తి

గొంతుక (చీకటిలో) పాపం, అమ్మ!

నాన్న

గొంతుక చిట్టిగాడు పాపం!

లక్ష్మన్న

గొంతుక . వెళ్ళనివ్వలేదని చిట్టిగాడికెంతో ఇదిగా వుండాలి (కాస్త సేపు ఎవరూ మాట్లాడరు వీధి వెలుపల మిలిటరీ బాజాలు, సిపాయిలు నడుస్తున్నట్లు బూట్సు చప్పుడూ )

రామన్న

గొంతుక . అదుగో! వినబడలేదూ?

నారాయణ

గొంతుక · యుద్ధరంగానికి వెళ్ళిపోతున్నారు

నాన్న
గొంతుక  ఎంత దర్జాగా నడుస్తున్నారో! లెఫ్ట్, రైట్, లెఫ్ట్, రైట్.

లక్ష్మన్న
గొంతుక  ఎంత బాగుంది! వాళ్ళతో కలిసి నేనూ నడుస్తూంటే ఎంత బాగుండును.

(క్షణం నిశ్శబ్దం, వెలుపలి చప్పుడు క్రమంగా దూరమవుతుంది.)

నాన్న
గొంతుక  చూడూ నారాయణా! ఏం జరుగుతోందో ఏమిటో రేడియో వెయ్యి నాయనా ఒకమాటు!

నారాయణ
గొంతుక  అలాగే, నాన్నా! (రేడియో వేస్తాడు )

రేడియోలో
మగ
గొంతుక  (దుర్బలంగా)  మన తూర్పు సైన్యాలు తీవ్రంగా పోరాడుతూ వెనక్కి తగ్గుతున్నాయి. వాటి కుడిపార్శ్వం ఒక కొండ చరియను చాటువేసి నిలద్రొక్కుకొని శత్రువును పట్టుదలగా ప్రతిఘటిస్తున్నాయి

నాన్న
గొంతుక  పార్శ్వభంగం కాకుండా జాగ్రత్త పడాలి మనసేనలు!

రేడియోలో
మగ
గొంతుక  పదిహేను శత్రు విమానాలను నేలగూల్చాం. మనవి తొమ్మిది విమానాలు తిరిగి రాలేదు

నారాయణ
గొంతుక  పదిహేనుకి తొమ్మిది! ఫర్వాలేదే!

రేడియోలో
మగ
గొంతుక . రక్షణలేని మన పట్టణాలమీద శత్రువులు నిర్దాక్షిణ్యంగా బాంబులవర్షాలు కురిపిస్తున్నారు. చనిపోయిన పౌరులసంఖ్య ఈసరికి పద్దెనిమిది వందలని అంచనా. నిన్న బాంబులదాడికి గురి అయిన సరిహద్దు పట్టణాల విషయమై కొత్తవార్తలేవీ తెలియరాలేదు

నాన్న
గొంతుక  ఆపెయ్ నాయనా! ఎవరో వస్తున్నట్టుంది

(తలుపుతీసిన చప్పుడు. తాళం తీసి అమ్మ గదిలో ప్రవేశిస్తుంది. రంగం ఇంకా చీకటిగానే ఉంటుంది )

అమ్మ  · (తలుపు తాళం వేస్తుంది. నాలుగడుగులు ముందుకునడచి నిలబడుతుంది ) మీరంతా ఇక్కడున్నారని నాకు తెలుసు. ఏం కావాలి మీకు?

నాన్న  . నిన్ను చూదామని మాత్రం వచ్చామే పిచ్చీ!

అమ్మ  · నన్నెందుకూ చూడడం?



(రాతబల్లమీద దీపం వెలిగించి చుట్టూ చూస్తుంది. గదిలో వేరువేరుచోట్ల కొందరు నిలబడీ కొందరు కూర్చుని ఉంటారు. ముసలాయన, నాన్న, ఆదిమూర్తి, నారాయణ, లక్ష్మన్న, రామన్న-)

లక్ష్మన్న  అమ్మా! నమస్కారం!

నాన్న  ఎవరొచ్చారో చూశావుటే! మామగారు

ముసలా.  (కుర్చీలో కూర్చుని ఉంటాడు. పాతకాలపు దుస్తులు) అమ్మాయీ! సింపాదిగా వున్నావా?

అమ్మ  ఇదేమిటి నాన్నా! నువ్వు వచ్చావా! ఎన్నాళ్ళయింది నిన్ను చూచి

ముసలా.  వచ్చానమ్మా! మరి వచ్చాను నేనేమీ మారిపోలేదు కాదూ?

అమ్మ  . ఏమీ మారలేదు అచ్చంగా అప్పట్లాగే ఉన్నావు అవునుగాని (చుట్టూ కలయజూస్తుంది) ఇదేమిటి మీరంతా ఇలా కలుసుకున్నారు! కుటుంబ వ్యవహారాలు మాట్లాడుతున్నారా?

ఆదిమూర్తి: అబ్బే! ఏమిలేదమ్మా! ఊరికే వచ్చాము నీ దగ్గరే ఉండడానికి! ఇటువంటి ప్రమాదకాలంలో ఒంటరిగా నిన్నెలాగ వదిలేస్తాం చెప్పు?

అమ్మ  నిజం? ఇదివరకెప్పుడూ మీరు నా దగ్గరే ఉండేవారు కారు మీరేమో, మీ పనులేమో! ఏమిటి మాట్లాడుతున్నారింతసేపూ మీరంతా?

నారాయణ. ఏమీ లేదమ్మా! రేడియో వేసుకొని వార్తలు వింటున్నాం

అమ్మ  ఏం చిత్రం! ఇవన్నీ ఇప్పుడు మీకు కావలసి రావడమేమిటి?

రామన్న  ఎంచేత? మేం చచ్చిపోయామనా? మాకిది చాలా అవసరంసుమా! ఎంతవసరమో నీకు తెలియనే తెలియదు

అమ్మ  ఒకందుకు సంతోషించాలి దిగాలనుకున్నా ఈ గొడవల్లో మీరిక దిగలేరు

నాన్న  అలాగే అనుకుంటావు నువ్వు! ఇందులో మేమెంతదాకా దిగి వున్నామో నీకు తెలియదు యుద్ధం ప్రారంభమయిందంటే చాలు చచ్చిపోయిన వాళ్ళందరం జల్దుకుంటాం.

లక్ష్మన్న  · చూశావా అమ్మా! నువ్వనుకున్నంత ఇదిగా మేం చచ్చిపోలేదు

రామన్న  ఔను, లోకంలో జరుగుతున్నవన్నీ ఇదివరకులాగే ఇప్పుడూ మమ్మల్ని తాకుతూ ఉంటాయి అసలు సంగతి చెప్పాలంటే దీనంతటికీ కారణం మేమే!

అమ్మ  ఔను మీరే కారణమని నాకు తెలుసును ఈ యుద్ధానికి కూడా మీ కాట్లాటలే కారణమైతే ఇందులో ఏమీ గొప్ప చెప్పుకోవడానికి లేదు.

నాన్న  అప్పుడే అంతా అయిపోయినట్లు మాట్లాడుతావేం? మనమే గెలవొచ్చు అదనపు బలాలు అందితే సరి! అదుగో చూశావ్! ఆ యెడమ పార్శ్వం సంగతే నన్ను కొంచెం కలవరుస్తోంది! ఏవీ! నా మిలిటరీ మ్యాపు లెక్కడ దాచావ్?

అమ్మ  (రాతబల్ల తాళంతీసి) ఇవిగో! ఇవెందుకు కావలసివచ్చాయి ఇప్పుడు మీకు?

నాన్న  : ఒక చిన్న సంగతి తేల్చుకుందామనుకున్నాలే ఇలా వుంచు.

(బల్లమీద మ్యాపులు పరుస్తాడు)

లక్ష్మన్న వొచ్చిన చిక్కేమిటంటే నాన్నగారూ మన సైన్యంలో ఆఫీసర్లు చాలడం లేదు. అంతర్యుద్ధంలో ఈ రామన్నగారి మూలా ఎందరో ఆఫీసర్లను పోగొట్టుకున్నారు ఇప్పుడు తెలిసివస్తోంది ఆఫీసర్లు లేని లోటు! ఎందర్ని తుడిచిపెట్టేశారు!

రామన్న ఔను మరి! అందుకు మమ్మల్నంటే ఏం లాభం? అంతర్యుద్ధానికి అంత బాధ్యతా మీదే!

లక్ష్మన్న మాదా బాధ్యత? మొట్టమొదట కయ్యానికి కాలుదువ్విందెవరు? మీరూ మీ పెడసరపు కేకలూ! డిసిప్లిన్ అంటే ఏమిటో తెలియదుకదూ! చీమల పుట్టల్లాగ అన్నీ పీపుల్సానూ మీరే!

రామన్న మీ ఫిరంగుల మాట చెప్పవేం? ఎంత జనాభాని బలిపుచ్చుకున్నాయో ఇప్పటికే లెక్క తేలలేదు

లక్ష్మన్న ఫిరంగు లుపయోగించామంటే మాదా తప్పు? మీరంతా తిరగబడి దేశాన్ని నాశనం చేసేస్తే చేతులు కట్టుకుని చూస్తూ వుండాలి కాదూ మేము? ఓ అప్పుడిక చెప్పేదేముంటుంది? నయంకాదూ? ఈపాటి సైన్యాన్నయినా మిగల్చగలిగాము మీ బోధనలో పడి కొట్టుకుపోకుండా!

రామన్న పోరాడడం యెలాగో ప్రజలకు నేర్పగలిగాం మేమని నా సంతోషం!

లక్ష్మన్న అంతేగాని ఉత్తరువుల ప్రకారం నడుచుకోవడం కాదు

రామన్న మీ ఉత్తరువులను వాళ్ళు మన్నించరు ఉండు ఈ యుద్ధం కాస్తా అయిపోనియ్యి! అప్పుడు తెలుస్తుంది నీకు

లక్ష్మన్న . ఏదెలా వున్నా ఈ యుద్ధం అయిపోయాక ప్రజలెవ్వరూ మీ తెలివితక్కువ స్కీముల మాటమాత్రం ఎత్తరు

రామన్న అలాగా పాపం! సరిగ్గా మేము చెప్పినట్టు చేస్తారు చూడు. ఈ యుద్ధం కూడా ఆఖరికి మంచికే వచ్చిందని అప్పుడు తెలుస్తుంది.

లక్ష్మన్న అబ్బీ నువ్వెన్నైనా చెప్పు ఈయుద్ధంలో విజయం అంటూ లభిస్తే అది దేశం మొత్తానికి చెందుతుంది దేశం మొత్తంమీద బలిష్ఠమవుతుంది స్వయం సమృద్ధమవుతుంది ఆ విధంగా ఈ యుద్ధం ఒక అదృష్టం అంటాను. మీరు వేసే వెర్రికేకలు చల్లారుతాయి.

అమ్మ · ఇదేం గ్రహచారమర్రా ఇప్పటికీ మీ కొట్లాటలు మానకుండా ఉన్నారు? సిగ్గువెయ్యడం లేదూ? ఈ దెబ్బలాటలతోనే మీరిద్దరూ చచ్చిపోయారని తెలుసా? ఇకనైనా తృప్తిలేదూ? కాస్త కట్టిపెట్టండి మీ వాదం. ఇదంతా వింటూ వుంటే మీ తాతయ్య ఏమనుకుంటాడు?

ముసలాయన . వీళ్ళు మాట్లాడుతున్న దేమిటో నాకు తలాతోకా తెలియకుండా వుంది. ఏవో కుర్రతనపు జట్టీలు కాబోలు!

రామన్న . అమ్మా! నువ్వేమన్నా పడతానుగాని, మాలో ఆలోచనశక్తి నశించనంత కాలం మేము పోరాడుతున్న ఆశయం సిద్ధించనంతకాలం చేతులు కట్టుకొని ఊరుకోలేం సుమా, ఇప్పుడైతే మేము చచ్చిపోతే మాత్రం ఏంగాక!

సత్యమూర్తి మాకావా అమ్మా! అందరిలాగా మేం అంతమందీ కూడా మా పోరాటాలని సాగిస్తూనే ఉన్నాం సత్యంకోసం, దేశంకోసం, మానవజాతికోసం! ఇప్పటికీ మా ఆశయమే నెగాలని కోరుతూ ఉంటాం ఎప్పటికైనా ఒకవేళ ఓడిపోవచ్చును కూడా ఇప్పటి మట్టుకు మేం చచ్చిపోతే చచ్చిపోయాంగాక

నాన్న (మిలిటరీ మ్యాప్పులోకి వంగిచూస్తూ) ఇక్కడ బలపరచాలి మన రక్షణశ్రేణిని! ఇక్కడే అటకాయించాలి కేంద్రంలో స్థిరంగా నిలద్రొక్కుకొని పార్శ్వంనుంచి విరుచుకుపడాలి ఆదీ సంప్రదాయసిద్ధమైన యుద్ధ తంత్రం! అలాగయితే శత్రువులను సముద్రంలో కూలదొయ్యవచ్చును

లక్ష్మన్న అలాగని నికరంగా చెప్పలేం నాన్నా! పార్శ్వంనుంచి విరుచుకు పడడం అంటే మాటలు కాదు వందలకొద్దీ సేనలని బలిపెట్టాలి

నాన్న బలి పెట్టాలి మరి! నీళ్ళలాగ సైన్యాలని ఖర్చు పెట్టాలి మనం అందరం ఇందులోకి ఉరకాలి.

అమ్మ "మనం అందరం" అంటే ఏమిటండీ మీ ఉద్దేశం?

నాన్న : ఏముందీ? దేశం అంతా అన్నమాట? మగవాడన్న ప్రతి మనిషీ అన్నమాట? మేమందరం కూడా!

అమ్మ వెళ్ళగా వెళ్ళగా మీరే వెళ్ళాలి! అప్పుడిక అడగక్కర్లేదు అందం!

నాన్న అక్కడే పొరబడుతున్నావమ్మీ! చచ్చిపోయాం కాబట్టి ఇక మేం ఎందుకూ పనికిరామనుకుంటున్నావు మరణించిన వాళ్ళందరి శక్తులూ ఇప్పుడు దేశానికెంతో అవసరం!

అమ్మ అందుకేనా యేమిటి అంతమందీ బలి అయిపోవాలని కోరుతున్నారు?

రామన్న అది కాదమ్మా! ఇప్పుడు జరుగుతోంది ఈ యుద్ధం ఇది మా అందర్నీ తనలోకి లాక్కుంటోంది ఇందులో ఓడిపోవడమనేది సంభవిస్తే -

లక్ష్మన్న సర్వనాశనమన్నమాట. మేమంతమందిమీ వృథాగా చచ్చిపోయామన్న మాట అప్పుడిక మిగిలేదీ ఏమీ ఉండదమ్మా! మరణించిన మాలో కూడా ఏమీ మిగలదు

అమ్మ అయితే నిజంగా మీ అందరికీ వెళ్ళాలనే ఉందా?

నారాయణ . వెళ్ళి తీరాలమ్మా! అది మా విధి! నాన్న తన పాత పటాలంలో చేరుతాడు.

రామన్న నేను వలంటీర్ల దళంలో చేరుతాను

నారాయణ · మరి నేను - నేను విమానశాఖని వదలిపెట్టను.

నాన్న . చిట్టిగాడు నా పటాలంలోనే ఉంటే ఎంతో బాగుంటుంది

అమ్మ చిట్టిగాడే!

నాన్న మా పటాలం సంగతి నీకు తెలియదే అమ్మీ! దానికెంత పేరు ప్రతిష్ఠలున్నాయనుకున్నావు! అన్ని పటాలాలలోకన్నా ఎక్కువమంది చచ్చిపోవడం ఎప్పుడూ మా పటాలంలోనే!

అమ్మ అయితే మీరంతా ఇందుకోసం వచ్చారన్నమాట ఇక్కడికి? నేననుకుంటూనే ఉన్నాను ఏమయేది చిట్టిగాడ్ని మీ కప్పగించను. వింటున్నారా? చిట్టిగాడు వెళ్ళడానికి వీల్లేదు - వీల్లేదు

నాన్న నువ్విలాగంటే ఇక నేనేం అనగలను! పిట్టగాడు వెళ్ళకపోతే నేను వాణ్ణి వెలివేస్తాను అంతే

ఆదిమూర్తి అమ్మా! నువ్వు కొంచెం అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి పిట్టగాడు ఇంట్లో కూర్చుండిపోతే ఎప్పటికీ మాయని మచ్చ పడుతుంది వాడికి తర్వాత నీమీద ఏడుస్తాడు వాడి అంతరాత్మ కెప్పుడూ శాంతి ఉండదు

నారాయణ అదీకాక, వాడు సుబేదార్ మేజరు కొడుకు వాళ్ళ నాన్న యుద్ధరంగంలో వీరస్వర్గం అలంకరించాడు వాడు వెనక దిగబడిపోతే అంతా ఏమనుకుంటారు? అదెంత అమర్యాద వాడికి!

లక్ష్మన్న అమ్మా! ఇది దేశంకోసం యుద్ధం! సింహం ఉరికి తీరాలి అది వాడి పరమధర్మం!

రామన్న అమ్మా! నన్ను కూడా కొంచెం నచ్చచెప్పనియ్యి, నిజమే. ఇది వరకు నేను యుద్ధానికి వ్యతిరేకిని కాని ఇప్పుడు జరుగుతున్న దారుణంలాంటి దాన్ని ప్రతిఘటించక తప్పదు ఇది మన కర్తవ్యం మన ధర్మం

అమ్మ (వేటగాళ్ళ మధ్య చిక్కుకుపోయిన జంతువులాగ చుట్టూ చూస్తూ) మీరంతామందీ కలసి వాణ్ణి కడతేర్చాలని చూస్తున్నారు కాదూ? మీరంతా కలిసి వాణ్ణి లాక్కుపోవాలని వచ్చారుకాదూ? నాకు తెలుసు మీరందరూ నా విరోధులే! అందరూ! అందరూ!

నాన్న నీమీద విరోధం కొద్దీ చెబుతున్నా మనుకున్నావటే పిచ్చిదానా?

అమ్మ కాకపోతే మరేమిటి? నానోరు కట్టించడానికి కావలసినన్ని బాణాలు ప్రయోగించారు గౌరవం, ధర్మం, కర్తవ్యం, అంతరాత్మ అంతేనా ఇంకేమైనా మిగిలిపోయాయా? ఆలోచించండి! ఇంకేదీ లేదూ నా మీద విసరడానికి?

ఆదిమూర్తి నువ్వంటున్నదేమిటో బోధపడలేదమ్మా!

అమ్మ ఆఖరిబాణం ఒకటి మిగిలిపోయింది మరిచిపోయారా? "నీ కిదంతా అర్థంకాలేదమ్మా! ఇది మొగాళ్ళతో పని!" ఆ మాటలు కూడా అనరేం ఇంకా?

నాన్న నిజమే, నువ్వన్నది ఇది తప్పకుండా మొగాళ్ళతో పనే!

అమ్మ అలాగా? సరే, అయితే దీన్ని ఆడవాళ్ళ పనికింద మారుస్తున్నాను తల్లుల వ్యవహారం! కొడుకులనుకన్న తల్లుల పని! మీ కెవరికీ యిది బోధపడదు ఎంత వాదించినా లాభంలేదు.

నారాయణ అదంతా బాగానే వుందిగానీ అమ్మా

అమ్మ చాలించు ఇక మరెవ్వరూ నాతో మాట్లాడకండి పొండి మీరంతా ఇక్కణ్ణుంచి! మిమ్మల్ని చూస్తే కాలుకొస్తుంది (మొగం తిప్పుకొంటుంది కొంత సేపు ఎవరూ మాట్లాడరు మరణించిన వ్యక్తులు కలవరపాటుతో ఒకరిమొగం ఒకరు చూసుకుంటారు)

ఆదిమూర్తి: అమ్మకు మనమీద నమ్మకం పోయింది.

అమ్మ పోయిందంటే పోదూ మరి? ఎలాగ చూసినా మిమ్మల్నెవర్నీ నమ్మడానికి వీల్లేదు

ఆదిమూర్తి. మా మాట వింటే సింహంగాడు చెడిపోతాడని కాబోలును. పోనీ! తాతయ్య ఏమంటాడో.

మ..లా.. ఇదేమిటి నాన్నా! ఎందుకలా ముఖం ఆకాశం వైపు చూస్తావు! ఏమిటి! నేనేం చెప్పగలను నాయనమ్మ ఏమంటుందో? మా రోజుల్లో యుద్ధాల గొడవే లేదు! యుద్ధమంటూ జరిగినట్టు జ్ఞాపకమైనా లేదు నాకు

అమ్మ నాన్నా! నీ అబ్బాయి కొడుకుని యుద్ధంలోకి పంపిస్తావా?

మ..లా.. ఇక్కడికొచ్చే ఉంది ఈ ప్రశ్న! చూడు అమ్మాయీ! మేం పూర్వకాలపు మనుషులం మీ సంగతి వేరు మీకు యుద్ధాలూ, అవీ అలవాటయి పోయాయి వెయ్యిమంది, లక్షమంది చచ్చిపోవడం మీకు విస్తారంగా కనిపించదు మా రోజులు వేరు పురాణాలలో చదవడం తప్ప యుద్ధం అంటే ఎలా వుంటుందో కూడా మాకు తెలియదు నిజంగా యుద్ధం అనేది మా మీదికొస్తుందని మే మెప్పుడూ అనుకోలేదు

అమ్మ వొచ్చిందనుకో నాన్నా! వొచ్చినప్పుడేం చేస్తావు?

ము..లా.. మా రోజుల్లో మేమంత తొందరపడి కత్తులు నూరుకోలేదమ్మాయీ! అయినదానికీ కానిదానికీ మేం కొట్లాడుకోలేదు! ఇక యుద్ధం అంటావూ! చెప్పాను కాదూ, భారత భాగవతాల్లో యేం చదువుకున్నామో! సత్యభామా దేవి యుద్ధాన్ని మహానుభావుడు పోతన్న ఎలా వర్ణించాడూ!

పరుజూచున్ వరుజూచు నొంప
సంరంభన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో
వీర్యంబు శృంగారమున్ .

(ఆకస్మాత్తుగా పద్యం మధ్యలో ఆపి) ఏమిటో మాదంతా పాతకాలపు చాదస్తంలే! మీరూ, మీ యుద్ధాలూ

అమ్మ నే నడిగినదానికి జవాబు చెప్పేవు కావు! తీరా యుద్ధమే వచ్చిందనుకో? నీ కొడుకుల్ని సైన్యంలోకి పంపిస్తావా?

ముసలాయన నువ్వలా అడుగుతున్నావు కాబట్టి నా మనస్సులో ఉన్న సంగతి చెప్పేస్తున్నాను. నిజంగా నేనే మా చిట్టినాయనగాడి స్థితిలో వుంటే తప్పకుండా యుద్ధానికి వెళ్ళి తీరుతాను అదుగో, నువ్వెందుకు గాభరా పడతావు! ఇది దేశం మీదికి ముంచుకొచ్చిన యుద్ధం! చిన్నలూ, పెద్దలూ అందరూ సిద్ధం కావలసిన సమయం ఇది నేను ముసిలివాణ్నే అనుకో, తిన్నగా తుపాకికూడా పట్టుకోలేననుకో యుద్ధం చెయ్యడం నాకో సరదా కాదు ఎవ్వర్నీ నేనెప్పుడూ పల్లెత్తుమాట అనలేదు. ఎవరిచేతా పల్లెత్తుమాట పడలేదు సుఖంగా, శాంతంగా, నా బతుకు కడవెళ్ళిపోయింది .. అన్నట్టు నువ్వడిగిందేమిటి?

అమ్మ నీ కడుపున కన్న కొడుకుని యుద్ధానికి బలియిస్తావా నాన్నా?

ముసలాయన ఆఁ! అదిగదీ! జ్ఞాపకం వొచ్చింది, హాయిగా నీడపట్టున బతికినవాడ్ని. అందరూ నన్నెంతో ఎన్నిక చేసేవారు నాకు న్యాయమని తోచిన పని తొణకకుండా బెణకకుండా చేసేవాణ్ని. అంచేత నేను చచ్చిపోయిన తర్వాత కూడా నా గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటున్నారు ఔను నా జన్మ సుఖంగానే కడతేరిందని చెప్పవచ్చును అయినా

నే నప్పుడప్పు డనుకుంటాను కదా, ఏదో నా బతుకులో వెలితి చెప్పలేను కాదో నా బతుకులో లోపించిం దనుకుంటాను

అమ్మ నువ్వంటున్నది నాకేం బోధపడలేదు చిట్టిగాడి మాట చెప్పమంటే ఇవన్నీ యెందుకేకరువు పెట్టడం?

ముసలాయన వస్తున్నా నమ్మాయీ! అదే చెప్పొస్తున్నాను తొందర పడితే యెలాగా? చూశావా మరి! జీవితం ఎంత విచిత్రమైనదో! అదే నేను చెప్పేది విన్నావా! నిన్ను కనడానికి ముందు మీ అమ్మకి ఉపద్రవమైన జబ్బు చేసింది చెప్పామూ! చచ్చిపోతుందనే అనుకున్నాం మేం అంతమందిమీ! ఇవతలి గదిలో నేను మోకాళ్ళమీద తలపెట్టుకుని కూచున్నాను అప్పుడు నే నేమనుకున్నానో తెలుసునా! ఎంత కష్టపడుతోందీ ఈ ఆడది! ఒక ప్రాణిని కనడానికి తన సమస్తమూ ధార పోస్తోంది మొగాణ్ణి నేనేం చేస్తున్నాను? ఏమీ లేదు చూశావా! అలాగే కలుగుతుంది ప్రాణానికి విలువ! ఒక్కొక్కప్పుడు ప్రాణాన్ని ప్రాణం యిచ్చి కొనుక్కోవాలి! అదీ ఆడదాని పనే అమ్మాయీ! అన్ని విషయాల్లోనూ అంతే! మొగాళ్ళు దేశానికనీ, ధర్మానికనీ, సత్యానికనీ ప్రాణాలు ధారపోస్తేనే ఆ ప్రాణాలకంత విలువ! అందుకని వెళ్ళనియ్ అమ్మాయ్, నీ కొడుకుని! వెళ్ళనియ్! అదే ప్రస్తుత కర్తవ్యం!

అమ్మ అంతేనంటావా నాన్నా! నువ్వు చెప్పగలిగినదంతా ఇంతేనా?

ముసలాయన ఏమోలే మరి! చూశావూ! ఈ యుద్ధంలో నే నే కొంచెమో సాయపడగలిగితే బాగుండునని నాకుంది కనీసం ఒక్క మనవణ్ణి ఈ యుద్ధానికి పంపగలితేనా? ఒక్కణ్ణి పంపగలిగినా చాలు నా జన్మ వ్యర్థమయిం దనుకోను ముసలివాణ్ణి ఏనాడో చచ్చిపోయినవాణ్ణి నేనంటూ ఇవ్వగలిగిందేమీ లేదు కాని

అమ్మ . చిట్టిగాణ్ణి నువ్వు చూడనైనా చూడలేదే! ఇటువంటి మాటలు నీ నోటంట ఎలా వస్తున్నాయి నాన్నా?

ముసలాయన ఔను. వాణ్ణి నేనెప్పుడూ చూడలేదు అయితేనేం? వాడు మన కుటుంబంలో పుట్టినవాడు మన తరపున పోరాడుతాడు మనదెంత సాంప్రదాయమైన కుటుంబం!

అమ్మ వీల్లేదు చిట్టిగాడు వెళ్ళడానికి వీల్లేదు.

ముసలాయన సరే, నీ యిష్టం అమ్మాయీ! మాకు మాత్రం ఇది మర్యాదగా కనిపించదు మనదెంత . సాంప్రదాయమైన కుటుంబం!

(కొంత సేపు నిశ్శబ్దం)

నాన్న . చాల్లేద్దూ నీ పంతం! అబ్బాయిని వెళ్ళనియ్యి!

అమ్మ . మీరూ ఆ మాటేనా? మీరు కూడా చిట్టిగాణ్ణెపుడూ చూడలేదే? ఎప్పుడూ వాణ్ణి మీరెత్తుకోలేదే? మోకాళ్ళమీద పెట్టుకొని ఆడించలేదే! పుట్టినప్పుడు వాడెంత పసికందో మీకేం తెలుసును. దమ్మిడీలాగ చేతులూ వాడూనూ! ఏ మాత్రం హృదయం ఉన్నా మీరిలాగ మాట్లాడుతారూ? చిట్టిగాడు వెళ్ళలేడు. వాడికి బలం లేదు. ఏం నాయనా ఆదిమూర్తి! నువ్వు డాక్టరువి నువ్వు చెప్పూ? ఎప్పుడూ చిట్టిగాడు నీరసంగా ఉంటాడుకాదూ! నువ్వెన్నిమార్లు వాడికి టానిక్కులు తెప్పించలేదు! నీదే వాడి పూచీ,

ఏమయ్యినా చెప్పవూ చిట్టిగాడికి యుద్ధం చేసే సత్తువలేదని చెప్పు నాయనా చెప్పవూ!
(ఆదిమూర్తి భుజాలు దులుపుకొని ఏమీ మాట్లాడడు)

అమ్మ నా మాట వినవుకదూ సరే నువ్వైనా చెప్పు బాబూ, నారాయణా అందరికన్నా నువ్వు ఆటలోనూ, కసరత్తులోనూ. ఆరితేరినవాడివి ఆటల్లోకి రాడని చిట్టిగాణ్ణి నువ్వు వెక్కిరించే వాడివి కావూ? "చిట్టిగాడితో లాభం లేదు చిట్టిగాడు ఎందుకూ పనికిరాడు చిట్టిగాడు పొట్టి పిరికి" అనే వాడివికావూ? ఎలా వేళా కోళం చేసేవాడివో జ్ఞాపకం తెచ్చుకో - చిట్టిగాడిలాంటి బక్క చిక్కిన మనిషి సిపాయి ఎలా అవుతాడు చెప్పూ! యుద్ధరంగంలోకి ఎలా వెళ్ళగలడు చెప్పూ?
(నారాయణ భుజాలు దులుపుకొని ఏమీ మాట్లాడడు)

అమ్మ అయితే నువ్వూ నా మాట వినవన్న మాట! నా తరపున పలకవన్న మాట! నారాయణా, రామా! నువ్వైనా చెప్పరా! లక్ష్మణా! నువ్వైనా చెప్పవూ! నా రామలక్ష్మణులకి తెలియదూ చిట్టిగాడెంత అర్భకుడో? మీరిద్దరూ పోట్లాడుకుంటున్నప్పుడల్లా చిట్టిగాడెంత బిక్కచచ్చిపోయేవాడు? ముక్కు పచ్చలారని కుర్రనాగమ్మ! ఒక రోజు జట్కావాడు గుర్రాన్ని బాదుతూ వుంటే చిట్టిగాడు మూర్ఛపోయాడు మీకు జ్ఞాపకం లేదూ? చెప్పండర్రా, మిమ్మల్ని బతిమాలుకుంటాను వాణ్ని గురించి మీయిద్దరికే అందరికన్నా బాగా తెలుసు ఒక్కమాట అను. నాయనా. లచ్చిగా!

లక్ష్మన్న లాభంలేదమ్మా! అందరూ ఈ యుద్ధంలో దిగవలసిందే!

అమ్మ మీ కెవ్వరికీ చిట్టిగాడంటే ఇష్టంలేదు అదీ సంగతి మీ కెవ్వరికీ వాడంటే ఇష్టం లేదు

నాన్న లేదమ్మీ! చిట్టిగాడంటే మా కందరికీ ఎంతో ఇష్టం ఎటొచ్చీ ఇంట్లో ఉండిపోతే వాడికే పెద్దబాధ వాడి మంచినికోరే మేమంతా-

అమ్మ బాధపడితే పడతాడు ఇంట్లోనే ఉండితీరాలి అమ్మకోసం ఆపాటి త్యాగం చెయ్యలేడూ? ఏమో! వాడికి కూడా నామీద అభిమానం లేదు

ఆదిమూర్తి లేదమ్మా! వాడికి నువ్వంటే ప్రాణం. మా కందరికీ కూడా నువ్వంటే మా కందరికీ ఇష్టం!

అమ్మ ఎందుకొచ్చిన మాటలు లెద్దూ ఇవన్నీ! ప్రేమా, అభిమానం అంటే ఏమిటో మీకు తెలియదు మీ కెవ్వరికీ అర్థం కాదు మీ అందరికీ ఏవో ఇతర వ్యాపకాలున్నాయి ఇంకొకరిని ప్రేమించడం అనేది తెలియదు మీకు నా సంగతివేరు నాకు మీ ప్రేమ తప్ప వేరే లోకం లేదు (భర్తవైపు తిరిగి) చిట్టిగాడు నెలల పిల్లడుగా ఉన్నప్పుడు వాణ్ణి మీరు చూడవలసిందండీ! గాజుబొమ్మలాగ ఉండేవాడు ముట్టుకుంటే కందిపోయేటట్టు కనిపించేవాడు అలాంటివాణ్ణి యుద్ధానికి వెళ్ళమంటారేమిటండీ

నారాయణ. నువ్వు మరీనమ్మా! చిట్టిగాడింకా చిన్న పిల్లడనుకున్నా వేమిటి?

అమ్మ మీకు కాకపోవచ్చును. నాకు మాత్రం చిన్నపిల్లడే! అందుకే అంటున్నాను మీ కెవరికీ అర్థం కాదని, చిట్టిగాడిని కని, పెంచినదాన్ని నేను ఈ చేతులతో బువ్వ తినిపించిన దాన్ని. బట్టలు తొడిగించినదాన్ని! తప్పటడుగులు వేస్తూ పడిపోతుంటే నడిపించినదాన్ని! మీ కంతమందికీ వెర్రెత్తిపోయిందేమిట్రా! ఇంటిపట్టు విడిచి వాడు వెళ్ళిపోవడం నే నెలా సహించగల ననుకుంటారు?

లక్ష్మన్న  మరి మేం వెళ్ళిపోవడం సహించావు కాదూ అమ్మా!

అమ్మ  అబద్ధం! మీరు వెళ్ళడం నాకొక్క పిసరు కూడా యిష్టంలేదు. నా ఇష్టం లేకుండానే మీరంతా వెళ్ళిపోయారు. ఎప్పుడూ మీరు నా కంటిపాపలో లేని ఇంకో లోకంలో తిరుగుతూండే వారు. అక్కడ మీరు ఎదుగుతున్నా మనుకునే వారు. పిచ్చివి! ఎదిగిన పిల్లల్లాగ మిమ్మల్నెప్పుడూ చూడడంలేదు నేను. నా దృష్టిలో మీ రెప్పుడూ పరాధీనులు కానేకారు. అల్లరిపిల్లలు! అదృష్టం కలిసిరాక చచ్చిపోయారు అంతే! (భర్తనుచూసి) మరి మీరు! మీరంటే నా కెలా గనిపించేదో తెలుసునా? ఈయన మా ఆయన! నా సొంతం! నా హక్కు! మే మెప్పుడూ కలిసే ఉంటాం! ఇదే ఎప్పుడూ నా ఆలోచన! ఈ ఊహలతో నా శరీరం, నా ఆత్మ ఆనందం పరవశం అయిపోయేవి! అంతట్లో హఠాత్తుగా వెళ్ళిపోయారు. దిక్కులేని దూరదేశాల్లో హతమార్చుకు పోయారు! ఎంత అసందర్భం! ఆ వెధవ మన్యాలు ఏమయిపోతే నాకేం? అయినా ఆ అర్థంలేని అడివికి నా సమస్తాన్నీ ధారపోశాను! నా హక్కుని జారవిడిచాను!...

నాన్న  ఇప్పుడెందుకు చెబుదూ అవన్నీ ఏనాటిమాటలో?

అమ్మ  ఏనాటి మాటలోనా అవి? నాకు మాత్రంగావు నా మట్టుకు అవన్నీ ఇవాళ జరుగుతున్న కథకి సంబంధించినవే! ఇక నీమాట నాయనా, ఆదిమూర్తీ! ఈడుకు మించిన బాధ్యతతో ఈ సంసారమంతా నీ నెత్తిమీద వేసుకున్నట్టు కనబడే వాడివి నువ్వు! జ్ఞాపకం ఉంది! నీ చెయ్యి పట్టుకొని తోటలోనిన్ను నడిపించేదాన్ని. అప్పుడు నువ్వే నన్ను నడిపించుతున్నట్టుండేది. మరినువ్వు! నారిగా! ఎన్నిమార్లు ఈ చేతులతో నీ చిరిగిపోయిన చొక్కాలూ, లాగులూ కుట్టేనో! చెట్లెక్కడమంటే నీకు చెడ్డ సరదా! ఎప్పుడూ ఒంటికి దెబ్బలు తగుల్చుకొని వచ్చేవాడివి. నీ మోకాళ్ళకి, మోచేతులకీ మందురాసేదాన్ని నేను! "అక్కర్లేదమ్మా అదేమానిపోతుం"దనే వాడివి మరి నువ్వు, లచ్చిగా!

లక్ష్మన్న  · ఏం లాభం చెప్పూ ఇప్పుడీ చిల్లర సంగతులన్నీ ఏకరువు పెడుతూ కూర్చుంటే?

అమ్మ  ఏం లాభమా? అదే నీకు అర్థంకాదు. ఇవన్నీ చిల్లర సంగతుల్లాగ కనబడతాయి కాదూ నీకు. కాని, ఇప్పటికికూడా ఈ చిల్లర సంగతులే నాకు మీ వీరావేశాలకంటే, యుద్ధాలకంటే ప్రాణప్రదమైనవి ఎంచేతనంటావా? ఈ చిల్లర సంగతులవల్లనే మిమ్మల్ని నేను గ్రహించగలుగుతాను. ఏమైనా నే నుపయోగపడ గలిగితే వీటివల్లనే! ఇదే నా ప్రపంచం! మీకు పెద్దపెద్ద ఊహలు రావడంతోనే నా చేతుల్లోంచి జారిపోయారు. అయినా మీరు ధైర్యంగా నా మొగంలోకి చూడలేరు. ఏదో మీ అంతరాత్మలో బాధిస్తూ వుండాలి. "నీకు బోధపడదే అమ్మా!" అదుగో. యిప్పుడు కూడా మీ అందరి కళ్ళలోకి ఆ యిబ్బంది చూపు వచ్చింది. మీరంతా కలిసి ఏదో పెద్ద కుట్రపన్నుతున్నారు.

ఆదిమూర్తి  మరి నువ్వు కోప్పడితే చెప్పలేనుగాని అమ్మా! ఈసారి నిజంగా పెద్దపని పడింది

అమ్మ  : ఒరే పెద్దవాడా! ఇవన్నీ నాకు చెప్పకు! (చెవులు మూసుకుంటుంది.) చిట్టిగాడి సంగతి అయితే నేను వినదలచుకోలేదు. మీ కారణాలు మీ కుంటే నా కారణాలు నాకున్నాయి. మీవి పెద్ద పెద్ద కారణాలే కావచ్చును. మీ దేవుడూ, మీ దేశం, మీ గొప్పతనం .. యింకా దేవుడు మేలుచేస్తే మీ ...

[illegible]

[illegible] ... మీ విధ్యుక్త ధర్మం. మరి నాకూ ఒక విధ్యుక్త ధర్మం వుంది [illegible] ఉంది అది మీరే నాకున్న సర్వస్వం మీరే, మీరే, మీరే! ఇప్పుడు మీరు నాకు కొంచెం బోధపరచండి చూదాం ఎంచేత నేనే, ఎప్పుడూ నేనే ఏమీ లేకుండా నేనే ఆడదాన్ని నేను పిల్లల తల్లిని నేనే ఎంచేత మీ దిగ్విజయాలకి యింత భయంకరమైన ముడుపు చెల్లించాలి?

[illegible] అలా కోపం తెచ్చుకోకు [illegible], వాళ్ళమీద!

[illegible] నా కెవళ్ళమీదా కోపంలేదు నాన్నా! నా కోపం అంతా లోకంమీద! ఎప్పుడూ నా పిల్లలే హతమైపోవాలి ఏదో గొప్ప కారణానికి ఏదో కీర్తికోసం ఎందుకో నాకు బోధపడదు ఇంతాచేస్తే ఈ ప్రపంచాని కొరిగిందేమిటి? ఒక్క పిసరైనా ఈ ప్రపంచం బాగుపడిందీ? ఇదంతా యెందుకొచ్చింది చెప్పు! ఏమైనా లాభం ఉందీ?

[illegible] లేకేం! అమ్మాయీ! ఒక గొప్ప సంప్రదాయం ఏర్పడింది అది చాలా అవసరమని ఒప్పుకోవూ?

నాన్న . నువ్వు పడుతున్న క్షోభ మా కర్థమవుతుంది కాని ఈ సమయంలో నిన్నెవరైనా చూస్తే?

అమ్మ నన్నెవరూ చూడనక్కరలేదు మీ రెవరూ నావేపు చూడకండి కోపం వొస్తే నేను మనిషిని కాను

నాన్న అయినా నీ కెప్పుడూ ముక్కునుంటుంది కోపం! దానికేంగాని నేనొకటి అడుగుతున్నాను చెప్పు! అవసరమైతే నీ మట్టుకు నువ్వు ప్రాణం ఆహుతివ్వడానికి వెనుదీస్తావా?

అమ్మ నా అవసరమంతా మీరే! మీ కోసం సంతోషంగా ఈ ప్రాణాన్ని ధారపొయ్యగలను నా భర్తకోసం! సంసారంకోసం! నా పిల్లలకోసం! ఆడదాన్ని నేను! ఇంతకన్న ఎక్కువైనవి యింకేముంటాయి నాకు! ఊఁహూఁ! ఊఁహూఁ! ఊఁహూఁ! చిట్టిగాణ్ణి నేను వదులుకోలేను! (కొంతసేపు నిశ్శబ్దం)

ఆదిమూర్తి నాన్నా! ఒకవిధంగా చూస్తే అమ్మ చెప్పింది నిజమే అనిపిస్తుంది చిట్టిగాడికి వొంట్లో సేరుమాంసం లేదు దేనికీ వాడికి శక్తి లేదు

నారాయణ అసలు వాడి స్వభావంలోనే లోపం వుంది. అన్నయ్యా! ఏ కోశానా వాడికి ధైర్యంలేదు వాడి యీడు కుర్రాళ్ళంతా జమాజట్టీల్లాగుంటారు వాడొక్కడే చస్తినమ్మా అన్నట్టుంటాడు

లక్ష్మన్న · వాడేం చెయ్యగలడు చెప్పు! బలంలేదు వాడికి, మనిషేమో చురుకైనవాడే! అయినా చెడ్డ పిరికి ఏం కావాలో వాడిగతి.

రామన్న వాణ్ణి చూసి జాలి పడాలి. ఇక వాడెందుకూ పనికిరాడు.

అమ్మ చాలించండి వాణ్ణి పల్లెత్తుమాటంటే నే నొప్పుకునేది లేదు. (భర్తవైపు తిరిగి) వీళ్ళమాటలు మీరు వినకూడదు. చిట్టిగాణ్ణి గురించి ఒకటైనా మంచిమాట వీళ్ళెప్పుడూ ఆడలేదు. చిట్టిగాడు సున్నితమైన మనిషి అంతే వాడికి నేను చేసిన సంరక్షణ ఎంతో పనికొచ్చింది. ఇప్పుడు చూడండి వాణ్ణి! ఎంతో ముచ్చటొస్తూ ఉంటాడు. వాడికా శక్తిలేదు? ఆ మాటకొస్తే వాడే పటాలంలోకి వెళ్ళతానన్నాడు. నన్నెంతో బతిమాలుకున్నాడు. నేనే ఒప్పుకోలేదు నేనెప్పుడూ ఒప్పుకోను ఇందులో వాడిదేం తప్పుంది?

[illegible]

అమ్మ [illegible] నాకింకెవ్వరు? నేను చూసుకుంటున్నాను. మీరంటె ఎలాగున్నా కాని నాను తప్ప నాకింకెవ్వరు? మిమ్మల్ని బలిమాలుకుంటున్నాను నాకు మిగిలిన ఈ ఒక్కణ్ణీ వదిలిపెట్టండి పిల్లాడు పోతే యిక నాకేమీ లేదు ఏమీ లేదు వాణ్ణి నాతో ఉండనివ్వరూ! ప్రార్థిస్తున్నాను ఉండనివ్వరూ! నేను ముసలిదాన్నయిపోయాను అలిసిపోయాను ఇక నాకెవ్వరూ లేరు చెప్తున్నా నాకు దక్కనివ్వరూ! వాణ్ణి పంపించక్కరలేదని మీ నోటితో ఒక్కమాట అనరూ? "ఊం" అనండి ఏం? నేనంటున్నది మీకు వినపడడం లేదూ?"

(కొంచెంసేపు నిశ్శబ్దం)

ముసలాయన అబ్బబ్బ! ఇదేం బాగులేదు ఏమిటమ్మాయీ! ఇంత గాభరా పడతావు? బహుశా వాడిక వెళ్ళనవసరం లేదేమో? ఈపాటికి మనం యుద్ధం ఓడిపోయి వుంటాము

నాన్న (మిలిటరీ మ్యాపులోనికి చూస్తూ) ఇంకా ఆశలేకపోలేదు ఈ పార్శ్వాన్ని నిలబెట్టవచ్చు అయితే ఉన్న బలం అంతటినీ కూడదీసి పంపించాలి

రామన్న మన ప్రజలమీద నాకు నమ్మకం వుంది వాళ్ళకి ఆయుధాలున్నాయి. వీధి వీధికీ వాళ్ళు పోరాడుతారు చూస్తూ ఉండండి చిన్న పిల్లలు కూడ యువాశక్తిని సాయపడతారు తండ్రుల ఆయుధాలను కొడుకులు ధరిస్తారు

లక్ష్మన్న (చుట్టూ చూస్తూ) అమ్మా! ఇక్కడ తుపాకులుండాలి. ఏమైనాయే?

అమ్మ ఏమంటున్నావు నాయనా?

లక్ష్మన్న ఇక్కడ నాన్నగారి కత్తులూ, తుపాకులూ అవీ ఉండాలే వాటినేం చేశావు?

అమ్మ కనబడకుండా దాచేశాను చిట్టిగాడి కళ్ళ పడకూడదని

లక్ష్మన్న ఎంతపని చేశావు? అందులో ఒక పసందైన తుపాకీ ఉండాలి.

నారాయణ (ఒక డ్రాయరు తెరిచి, తన పాత నోటుబుక్కులలో ఒకటి తీసి, పుటలు తిరగవేస్తూ) ఈ కొత్త యంత్రపు ప్లాను పూర్తి చెయ్యడానికి నాకు వ్యవధి లేకపోయింది భేషైన యంత్రం.

(నోటుబుక్కు పట్టుకొని కూర్చుంటాడు)

నాన్న (మ్యాపులో మైమరచిపోయి) ఇక్కడ నిజంగా నాలాంటివాడుండాలి కొండ కనుమలలో యుద్ధం చక్కగా నడిపించి ఉందును.

లక్ష్మన్న . అమ్మా! చూడూ! ఆ తుపాకీ ఎక్కడ దాచావు?

అమ్మ ఎంత గొడవ చేస్తున్నావు! (బీరువాతాళం తీస్తుంది తుపాకి పైకితీసి) ఇదుగో తీసుకో

లక్ష్మన్న ఇదే! ఇదే! (అందుకొని పరిశీలిస్తాడు) కొంచెం తుడిచి బాగుచేస్తే దీనిలాంటి ఆయుధం లేదు

(టేబులు మీద పెట్టి తుడుస్తూ ఉంటాడు. కొంచెంసేపు నిశ్శబ్దం)

ముసలాయన చూశావా అమ్మాయీ! ఇప్పుడు మన కుటుంబం అంతా ఒక్క చోటికొచ్చాం!

రామన్న అది వినబడుతోందా?

[illegible] ఏమిటి?

రామన్న ఆ నిశ్శబ్దం!

ఆదిమూర్తి ఔను! సరిగ్గా ఎవరో ఉపన్యాసం ఇవ్వడానికి ఉపక్రమిస్తున్నట్టుంది!

రామన్న ఎవరు చెప్మా? (ఒకళ్ళ నొకరు చూసుకుంటారు తర్వాత రేడియో సెట్టువైపు చూస్తారు) ఆఁ! ఇప్పుడు తెలిసింది

నాన్న (తలయెత్తి చూచి) ఏమిటి సంగతి?
(ఆదుర్దాగా రేడియోవైపు చూస్తాడు. కొంచెంసేపు నిశ్శబ్దం)

అమ్మ మీ కందరికీ దానిమీదే దృష్టి! అది తప్ప మరేమీ వినదలచుకున్నట్టు లేదు యుద్ధం గొడవతప్ప మరేమీ అక్కరలేదు మీకు. సరే వినండి
(రేడియో వేస్తుంది)

లక్ష్మన్న యుద్ధం ఒకటి జరుగుతున్నప్పుడు అది తప్ప ఇంకో ఆలోచన ఏం తోస్తుందమ్మా!

రేడియోలా మగ గొంతుక అగ్రసైన్యాలు నదీతీరాన్ని సమీపిస్తున్నాయి మన సైనికులు వంతెనలన్నిటినీ పడగొట్టి ఇవతలి ఒడ్డున ప్రతిఘటనకు సిద్ధంగా ఉన్నారు ఏమైనా సరే శత్రువును ఒక్కడుగు కూడా ముందుకు రానివ్వడానికి వీల్లేదు మన సైనికులు కొసదాకా పోరాడడానికి నిశ్చయించుకున్నారు - చనిపోవడం తప్ప వెనుకంజవెయ్యడం ఉండదు-

రేడియోలో ఆడ గొంతుక మొగవాళ్ళందరూ ఆయుధాలు ధరించండి - మొగవాళ్ళందరికీ ఇది పిలుపు - ఇది దేశంకోసం యుద్ధం - మన తండ్రులు జీవించిన దేశంకోసం, మన పిల్లలు జీవించబోయే దేశంకోసం, యుద్ధంలో చనిపోయిన మన పెద్దల పేరిట, పుట్టబోయే మన పిల్లల పేరిట, మన జాతి జాతంతా ఆయుధాలు ధరించవలసిన అవసరం వచ్చింది -

అమ్మ : వీల్లేదు! చిట్టిగాడు వెళ్ళడానికి వీల్లేదు - నేను వెళ్ళనివ్వను -

రేడియోలా మగ గొంతుక ఉత్తర రంగంనుంచి మన సర్వసైన్యాధ్యక్షుడు తెలుపుతున్న దాని ప్రకారం అధికసంఖ్యాకులగు శత్రువుల ఒత్తిడివల్ల మన సైన్యాలు తీవ్రంగా పోరాడుతూ, క్రమక్రమంగా స్థలం వొదులుతున్నట్టు తెలుస్తోంది - ప్రతి అంగుళం మేరకీ, ప్రతి పొలం, ప్రతి గుడిసె హోరాహోరి పోరినమీదటనే వదలిపెడుతున్నాము - గ్రామాలలో ప్రజలు తమ ఇళ్ళు కాళీచెయ్యడంమాని మన సేనలతో కలిసి శత్రువులను ఎదుర్కొంటున్నారు - శత్రువులు ప్రతి గ్రామాన్నీ నేలమట్టం చేస్తున్నారు - ఉభయపక్షాలకీ అపారమైన నష్టం సంభవిస్తోంది -

ఆదిమూర్తి. పాపం! ఎంత జనాభా నాశనమవుతోంది?

నాన్న  అయితేనేం? అదే సరైన పద్ధతి - శత్రువును ముందుకు పోనివ్వకుండా చెయ్యాలంటే అదొక్కటే మార్గం -

రేడియోలో

ఆడ

గొంతుక  సముద్ర మధ్యంలోని మన యుద్ధ నౌకనుంచి అప్పుడే ఒక వైర్లెస్‌వార్త! తర్జుమా చెయ్యటం పూర్తికాగానే వినగలరు  నాలుగు వందలమంది నావికులతో ఈ యుద్ధనౌక  ఓయ్, నాయనోయ్! (ఏడుస్తుంది) క్షమించాలి వారిలో నా కొడుకుకూడా ఉన్నాడు - (కొద్దిసేపు నిశ్శబ్దం) నాలుగువందల మంది నావికులతో ఈ యుద్ధనౌక శత్రుదిగ్బంధనాన్ని ఛేదించుకొని హార్బరు చేరడానికి ప్రయత్నించగా ఈ సాయంత్రం అయిదుగంటల ఏడు నిమిషాలకు శత్రు జలాంతర్గామి దాడికి గురి అయింది - మన యుద్ధనౌక క్రమంగా మునిగిపోతోంది (ఒక నిట్టూర్పు) అందలి నావికులు తమ దేశప్రజలను ఆఖరి కోరికగా  ఏమని అడుగుతున్నారంటే  ఆఖరిసారి .వందేమాతరం పాడాలని.  అడుగుతున్నారు! నా నాయనోయ్. నా కొడుకోయ్

అమ్మ  ఏమిటి! చెప్పేవుకావు? నీకూ ఒక కొడుకున్నాడూ? నువ్వూ బిడ్డల తల్లివే అన్నమాట!

రేడియోలో

మగ

గొంతుక . యుద్ధ నౌకనుండి సందేశం మీరు విన్నారు. మన యుద్ధనౌక వినడంకోసం! వినండి! నావికులారా! హలో హలో! వినగలుగుతున్నారా? నావికులారా! మీ దేశం తరఫున మీకిదే తుది వీడ్కోలు! వినండి! నావికులారా!

(రేడియోలో వందేమాతరం గీతం వినబడుతుంది - మృతవ్యక్తులందరూ చప్పుడు చెయ్యకుండా లేచి ఎటెన్షన్ పొజిషన్‌లో నిలబడతారు-)

అమ్మ  : నాలుగువందలమంది కుర్రాళ్ళే! ఎలా వొప్పుకుంటున్నారు ఇంత దారుణానికి?

రామన్న : అమ్మా! కొంచెంసేపు మాట్లాడకుండా ఊరుకుందూ!

(అందరూ నిశ్చలంగా నిలుచుకుంటారు. వందేమాతరం పాట పూర్తి అవుతుంది)

రేడియోలో

మగ

గొంతుక . యుద్ధనౌకనుండి మరేమీ కబురులేదు -

లక్ష్మన్న · నావికులకు వీడ్కోలు - (తుపాకి గోడకు తగిలిస్తాడు)

రేడియోలో

ఆడ

గొంతుక : మొగవాళ్ళందరికీ పిలుపు! జాతి అంతటికీ సమరాహ్వానం! దేశమాత తన పిల్లల్ని పిలుస్తోంది - అందరూ ఆయుధాలు ధరించండి. అందరూ ఆయుధాలు ధరించండి-

అమ్మ  . ఏమిటీ? ఇంకా అరుస్తున్నావూ? ఇంకా నీకు తృప్తి కాలేదూ? మళ్ళీ తల్లినంటావూ? ఇంకా ఎందర్ని పంపించాలని ఉంది నీకు?

రేడియోలో
మగ
గొంతుక పశ్చిమరంగంనుంచి మన సైన్యాధికారి తెలుపుతున్న వార్త రంగం పొడుగునా అత్యధిక సంఖ్యాకులగు శత్రువులతో పోరాటం సాగుతోంది - ఉభయపక్షాలూ ప్రాణాలకు తెగించి తలపడ్డారు శత్రువులకు అదనపు బలాలు వస్తున్నట్లు మన వైమానికులు తెలుపుతున్నారు -

(తలుపు తట్టిన చప్పుడు)

సింహం
గొంతుక అమ్మా! అమ్మా!

అమ్మ (రేడియో మూసివేసి) ఇకచాలు -

(తలుపు తట్టిన చప్పుడు)

సింహం
గొంతుక అమ్మా! తలుపు తలుపు -

అమ్మ వస్తున్నానుండు నాయనా! (దీపం ఆర్పివేస్తుంది తలుపు చప్పుడు) వచ్చె! వచ్చె!

(చీకటి - కొంచెంసేపు నిశ్శబ్దం)

అమ్మ (తలుపుతాళం తీస్తుంది) నీవిక్కడెందుకు చిట్టీ!

సింహం ఈ చీకట్లో ఉన్నావా?

అమ్మ దీపం వెయ్యి!

సింహం (దీపం వేస్తాడు గదిలో ఎవరూ ఉండరు- మిలిటరీ మ్యాపులు చిందరవందరగా పడివుంటాయి) అమ్మా! ఇక్కడ ఎవరితోనే మాటాడుతున్నావు?

అమ్మ ఎవరితోనూ లేదు నాయనా!

సింహం ఎవరో మాట్లాడినట్టయింది?

అమ్మ మరెవరూకాదు రేడియో!

(రేడియో వేస్తుంది)

సింహం (మ్యాపులను చూపించి) ఇవన్నీ ఎందుకు తీశావమ్మా!

రేడియోలో
మగ
గొంతుక ప్రధాన సైన్యాధిపతి కార్యాలయంనుంచి వార్త ఇవాళ తెల్లవారుజామున ఇంకో రేవుపట్టణం మీద శత్రు విమానాలు దాడిచేశాయి. పట్టణం పూర్తిగా ధ్వంసమయిపోయింది - ఎనిమిది వేలమందికి పైగా జనం చనిపోయారు - వీరిలో చాలామంది స్త్రీలూ, శిశువులూ! ఇప్పటికీ ఇళ్ళింకా తగలబడుతూనే ఉన్నాయి

సింహం . వింటున్నావా? అమ్మా!

రేడియోలా
మగ
గొంతుక · ఆసుపత్రిమీద బాంబుపడి అరవై మంది చనిపోయారు రైళ్ళ రాకపోకలు ఆగిపోయాయి!

[illegible]

[illegible]

[illegible]

రేడియో  సమస్త ప్రపంచానికీ విజ్ఞాపన చేస్తున్నాము - ప్రపంచమానవకోటికి విజ్ఞాపన చేస్తున్నాము ఈ ఉదయం శత్రు విమానాలు ఇంకొ గ్రామం మీద బాంబులు వేశాయి - గ్రామ పౌరులకి పారిపోతున్న పౌరుల పిల్లల మీద శత్రు విమానాలు [illegible] ఊచకోత కోశాయి. - [illegible] - [illegible] పిల్లలు [illegible] ముక్క చెక్కలుగా ఎగిరిపోయారు

అమ్మ  ఏమంటున్నావు? పిల్లలా? పిల్లల్ని కూడా చంపేస్తున్నారా?

సింహం  (మెల్లిగా ఊపుతూ) నాకు తెలుసు యుద్ధం ఇప్పుడెక్కడ జరుగుతోందో నాకు తెలుసు

అమ్మ  (నిర్ఘాంతపోయి నిలబడి) పిల్లల్ని చంపేస్తున్నారు! నా పిల్లల్లాంటి వాళ్ళని చింపిరిజుత్తుల పిల్లల్ని! మురికి మొగాల పిల్లల్ని! (గోడనుంచి తుపాకిని ఊడలాగి సింహం చాచిన చేతుల్లో పెడుతుంది చేతులు విశాలంగా విసురుతూ) వెళ్ళు! నాయనా! వెళ్ళు!

*ఆనందవాణి వారపత్రికలో 19-9-1948 సంచిక నుంచి సీరియల్‌గా వెలువడింది*

★ ★ ★

ఈ అనువాద నాటకాన్ని మొదట ముద్రించింది అరుణరేఖ ప్రచురణలు నెల్లూరు (1952) తర్వాత సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ రెండవ మారు ముద్రించారు (1967 ఏప్రిల్)

Karel Capek (1890-1938) చెకొస్లవేకియన్ రచయిత. అంతర్జాతీయ ప్రఖ్యాతి సంపాదించుకొన్న చెక్ రచయితలలో ఒకరు 1918 నుండి 1938 వరకు చెక్ దేశపు మేధోజీవిత ధోరణులకు ప్రాతినిధ్యం వహించినవాడు ప్రాగ్, బెర్లిన్, పారిస్ నగరాలలో విద్యాభ్యాసం చేసి, ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో జర్నలిజానికి దిగాడు. తన అన్న జోసెఫ్ చాపెక్‌తో కలిసి కొంతకాలం, స్వతంత్రంగా తదనంతరకాలంలో సాహిత్య వ్యాసంగం సాగించాడు 1920కీ 1938 కీ మధ్య చెక్ నాటక కర్తలలో అగ్రగణ్యుడయాడు. నవలలు కూడా రాశాడు

ప్రారంభంలో జీవిత మర్మాలను గురించి కథలు, తర్వాత యంత్రయుగానికి చెందిన సమస్యలను గురించి కల్పనాత్మక రచనలు, ఇంకా తర్వాత మానవ వ్యక్తిత్వాన్ని తరచి చూచి సూక్ష్మంగా వివేచించే నవలలు రాశాడు ఈ చివరి వాటిలో ముఖ్యమైనది Hordubal (1933),The Meteor (1934), An Ordinary Life (1934) అనే పేర్లతోటి మూడు భాగాలు గల రచన.

R U.R (1920) , The Insect Play (తన సోదరునితో కలిసి రాసింది 1920), వంటి నాటకాలతో ప్రారంభించి, 1937లో The white sickness, 1938లో The Mother నాటకాలు రాశాడు తన మాతృదేశానికి హిట్లరైట్ జర్మనీ నుంచి దూకిపడిన పరిస్థితిలో,

దేశభక్తిభావం వల్ల స్వదేశీయులు ఎంతటి విషాదపూరిత కర్తవ్యాలను నిర్వహించవలసివస్తుందో ఆ నాటకాలలో చిత్రించాడు

రాజకీయాలలో కూడా చాపెక్ ఆసక్తి చూపక తప్పలేదు తామస్ మేజరిక్ తోటి తాను సాగించిన సంభాషణలను మూడు సంపుటాలుగా వెలువరించాడు

Robots అనే మాటను ఇంగ్లీషు భాష కిచ్చింది (Rossum's universal Robots ద్వారా) చాపెక్ అట

---

Dear Comrades,

A new word has found its place in the dictionary. నక్సలైట్. You may kill a dozen or a hundred or a thousand or a 100 000 Naxalites but you cannot destroy this word.

తెలుగు సాహిత్యంలో నిజంగా ఇవాళ ఎఱ్ఱ అక్షరాల రోజు.

By Sri Sri
Written at Khammam
on 9-10-70

Dear Comrades,

A new word has formed its place in the dictionary నక్సలైట్. You may kill a dozen or a hundred or a thousand or a 1,00,000 Naxalites but your cannot destroy this word

తెలుగు సాహిత్యంలో నిజంగా ఇవాళ ఎఱ్ఱ అక్షరాల రోజు.

By **Sri Sri**
Written at Khammam
on 9-10-1970



యువకుడిగా శ్రీశ్రీ



తాపీ ధర్మారావుతో శ్రీశ్రీ



లెనిన్ గ్రాడ్ లైబ్రరీలో శ్రీ శ్రీ



కృష్ణశాస్త్రి - శ్రీశ్రీ



అల్యా ఎహ్రెన్‌బర్గ్‌తో శ్రీ శ్రీ



ఆరుద్ర, శ్రీ శ్రీ



విశ్వనాథ సత్యనారాయణతో శ్రీ శ్రీ

## విరసం ప్రచురిస్తున్న
## శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం

★ 1 పరిణయ రహస్యము, ప్రభవ
★ 2 అనువాద కథలు
3 అనువాద నవలలు
★ 4. అనువాద నాటకాలు
★ 5 మహా ప్రస్థానం
★ 6. వారం వారం
★ 7. 1 + 1 = 1 (రేడియో నాటికలు)
★ 8. చరమరాత్రి
★ 9 మన గురజాడ
★ 10 ఖడ్గ సృష్టి
11 జాబులు
★ 12 రెక్కవిప్పిన రివల్యూషన్
★ 13. చైనా యానం
★ 14. సిప్రాలి
★ 15 మరో ప్రస్థానం
★ 16 వ్యూలు, రివ్యూలు
★ 17. వ్యాసాలు
★ 18. ఉపన్యాసాలు
★ 19. ప్రజ
★ 20. అనంతం

★ ఇవి ఇప్పటికే వెలువడ్డాయి.

తరువాతి ప్రచురణలు

**శ్రీ శ్రీ అనువాద నవలలు**

(శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం - 3)

**జాబులు**

(శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం - 11)



# విజ్ఞప్తి

మహాకవి శ్రీ శ్రీ సంపూర్ణ రచనలని 20 సంపుటాలుగా విప్లవ రచయితల సంఘం ప్రచురిస్తోంది దీనిలో భాగంగా యిప్పటి వరకూ వద్దెనిమిది సంపుటాలను ప్రచురించాం ఎంతోమంది తమ షరతుల్లేని సహకారాన్ని అందివ్వటంవల్లే విరసం యీ పని నిర్వహించగలిగింది. ఇంకా రెండు సంపుటాలు రావల్సిన పని మిగిలుంది. ఈ సంవత్సరం ఆఖరికల్లా మిగతా రెండు సంపుటాలు తేవాలని ప్రయత్నిస్తున్నాం

ఇప్పటివరకూ ప్రచురించిన సంపుటాలపై వచ్చిన డబ్బు, పెట్టిన ఖర్చులు చూస్తే కొన్ని లక్షల రూపాయల అప్పు పేరుకుపోయింది ఈ అప్పు తీర్చడం ఒక పని కాగా, మిగతా సంపుటాల ప్రచురణకు చేయాల్సిన అప్పుకోసం ప్రయత్నించాల్సి వుంది ఈ సందర్భంగా అభిమానులకు ఒక విజ్ఞప్తి చేస్తున్నాం.

విరసం ప్రచురించిన, ప్రచురిస్తోన్న శ్రీ శ్రీ రచనలు కొని చదవండి ఈ పుస్తకాలు మీకు తెలిసిన నలుగురితో కొనిపించండి. ఇదే మీరిచ్చే కొండంత అండ శ్రీ శ్రీ రచనలు కూడా వెయ్యి ప్రతులు వేసి అమ్ముకోలేక పోవడం మన దురదృష్టం.

ఈ పరిస్థితిని మనందరం కలిసి మారుద్దాం ఇందుకు మీ ప్రయత్న పూర్వక సహకారాన్ని స్నేహ హస్తాన్ని ఆశిస్తున్నాం.

విశాఖపట్టణం
..1999

చలసాని ప్రసాద్